# మహాంధ్ర సామ్రాజ్య పతనము



గ్రంథకర్త :

సాహిత్య సమ్రాట్టు

డా॥ త్రిపురనేని వేంకటేశ్వరరావు,

M. B. B. S.,



జ సాహిత్య విహారము

# మహేంద్ర సామ్రాజ్య పతనము

(చారిత్రాత్మకమైన నవల)


ర చ న

సాహిత్య సమ్రాట్టు — సాహిత్య అకాడమీ కార్యవర్గసభ్యులు

డా॥ త్రిపురనేని వేంకటేశ్వరరావు M. B. B. S



కవిరాజ సాహిత్య విహారము

గుడివాడ : : కృష్ణాజిల్లా



అ మ ర జీ వి

శ్రీ ముళ్ళపూడి నరేంద్రనాద్ చౌదరి.



సాహితీవల్లభ, ఆంధ్రభోజ
శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారు

అంకితం

ఆంధ్రభోజ - సాహితీ వల్లభ

శ్రీశ్రీశ్రీ ముళ్లపూడి తిమ్మరాజు గారికి

తమ్ముడు.

## అందుకో - మహేంద్ర సామ్రాజ్యాన్ని

ఆంధ్రభోజునకు

సాహితీ వల్లభునకు

కర్మ వీరునకు

ధర్మ వీరునకు

విశిష్ట వ్యక్తికి,

సరళ హృదయునకు

సరస, సారస్వత లోలునకు

విద్యాదయితునకు

మృదుమధుర సంభాషణునకు

ప్రత్ననూత్న కవిత్వ భాసురునకు

విజ్ఞాన శాస్త్ర సంవేత్తృత ప్రౌఢిమ ప్రాజ్ఞునకు

అస్తోక విభవేంద్రునకు

సుగుణాకర మూర్తికి

నరేంద్ర మండలి యధ్యక్షునకు

దాన, ధర్మ దక్షపరతంత్రునకు

దీన జనబంధునకు

కరుణా జలధికి

దురితౌఘత మోద్యుమణికి

సురిచిర గుణమణికి

తణుకు పురాధ్యక్షునకున్

శారద చంద్రికాధవళ చారునిసూత్నయ శశిప్రపూర్ణునకున్

అజ్ఞాన తిమిర భాస్కరునకు

దివ్యకవిత్వధురణపూర్ణ విద్యారమణీయ విగ్రహ విధాతకు

ముళ్ళపూడి వంశ రామచంద్రునకు

మహానందంగా సమర్పిస్తు నా - మహేంద్ర సామ్రాజ్య గ్రంధాన్ని

అందుకో మహాదరంగా.

# మన చరిత్ర

"తెలుఁగు బిడ్డా తెలుఁగు చరితను
నేటికైనను తెలిసికోరా !"

మనకు మహోజ్జ్వలమైన చరిత్ర యున్నది. కాని అది యతిశయోక్తులతోను దేవతా గాధలతోను, అలౌకిక మహిమలతోను అభూత కల్పనలతోను, అద్భుత వృత్తాంతములతోను నిండి నిబిడీ కృతమై యున్నది. నిజమైన చరిత్ర మెప్పుడును వాస్తవములతోను శాసనాధారములతోను నిష్పక్షపాత బుద్ధితోను వ్రాయవలయును. పురాణముల వలన కావ్యముల వలన సాహిత్యము వలన తెలియవచ్చెడి చారిత్రక విషయములు శాసనాద్యాధారములచే స్థిరీకృతమైనపుడే, ఆ చారిత్రక విషయములు ప్రమాణములుగ అంగీకరింపవలయునే గాని, ఏ మహా కవియు తన కావ్యమున చెప్పినంత మాత్రమున నమ్మదగినది గాదు. ప్రాచీన కాలములో పురాణముల యందు అనేక చరిత్రిక విషయములు దేవతా మహిమచే జరిగినట్లు గ్రంథస్థము గావింపబడినవి. పరశురాముడు తన గండ్రగొడ్డలిచే యావద్భారత దేశమందలి క్షత్రియుల నొక్కౕ తృటిలో నరికి వేసె ననియు, అగస్త్యుడు తన తపోమహిమచే సప్తసముద్రములను మ్రింగె ననియు, శాలివాహనుడు తన చిన్న తనములో తయారుచేసిన మట్టి బొమ్మలు రథగజతురగ పదాతులయ్యెననియు, శాతవాహనుడు సింహ రూపియై వచ్చిన యక్షునిచే ప్రసాదింపబడెననియు, చాళుక్యవంశముల పురుషుడు బ్రహ్మభూళుకమునుండి యుద్భవించెననియు మొదలగు పెక్కౕ లలౌకిక గాధలు చారిత్రక విషయములుగ ప్రచారమునందున్నవి. ఆధునిక చారిత్రక విమర్శకు లిట్టి విషయముల నంగీకరింపరు. చారిత్రక విషయ

ములు అద్భుతములైనను, అసాధారణములైనను, అసాధ్యములైనను మన చరిత్రకారు లొకరు చెప్పినదే మఱొకరు చెప్పుట పరిపాటియైనది. దాని నెవరైన పరిశోధన చేసి హేతువాద దృక్పథముతో పూర్వచరిత్ర అతిశయోక్తులతో కూడియున్నదని చెప్పినచో వారిని 'రెట్టమతస్థుడనియు, అజ్ఞాని యనియు, పాషండుడనియు దయ్యబట్టుట అలవాటయినది. మన మీ విషవలయము నుండి యేనాడు బయటపడుదుమో ఆనాడు మన చరిత్ర నవవికాసముతో శోభిల్లగలదు. లేనిచో సభ్య దేశ చరిత్రకారుల చేత పరిహాసాస్పదుల మగుదుము.

ప్రస్తుతము మన కథావస్తువయిన కాకతీయ చరిత్రను నిష్పక్ష పాత బుద్ధితో, హేతువాద దృష్టితో, శాస్త్రీయ దృక్పథముతో పరిశీ లింతము.

కాకతీయ వంశపు మొదట రాజెవరు? అతడెచట నుండి వచ్చెను? అను విషయములు వచ్చినపుడు కాకతీయ వంశ మూలపురుషుడు దైవాంశ సంభూతుడని చెప్పబడినది. ఆయన పద్మాక్షిదేవి కటాక్షముచే మాధవ వర్మకు ఖడ్గ ఖేటకములు లభింపగ, వాని దివ్యప్రభావముచే శత్రువు లను జయించి నిరాటంకముగ రాజ్యమేలెనని సోమదేవరాజీయము, సిద్ధే శ్వర చరిత్ర, ప్రతాపరుద్ర చరిత్ర చెప్పుచున్నవి.

కం॥ ఈ ఖడ్గఖేటములు దృఢ
వైఖరి నీకేలనున్న వాలెంబు హతం
బౌ ఖల రిపుసంతతి నీ
పై ఖరగతి చెందవు పరనృపాలాస్త్రంబుల్.

కం॥ ద్విసహస్ర మాసములు సుఖ
వసతింబ్రజలెల్ల మిగుల వర్ణన సేయన్
వసుధా చక్రంబేలుము
విస్మృమరకీర్తి ప్రతాప విభవోద్ధతులన్.

సోమదేవరాజీయము (పుట 32).

"వినుము శ్రీ పద్మాక్షి వీరహంకారీ
మాతండ్రి పశువుల మల్లు బల్లహుని
చేత నోటువడిన సేమ మంతయును
తమ తల్లిచే విన్న తన కథ తెలియు
కామంబునకు ఫలము గావలెననియు
వాని జయింపగ వరబలశక్తి,
గావి యెందొల్లనో కమలాక్షి!" యనిన
నట్టె కానిమ్మని యపుడు కృపపుట్టి
నెట్టనఁ ధనవద్దినెటి బిరుదైన
ఖడ్గ ఖేటకముల కరమొప్పనిచ్చి
అద్ద దలచిన కోర్కెలన్నియు నిచ్చి
"యిది చేతనున్న నీ కెల్ల జయములు
గదిసి సాధింపుము కటక బల్లహుని"

శ్రీ సిద్ధేశ్వర చరిత్రము - పుట 55-56.

"అద్దేలి నీ వన్నయట్లు కృపచేయుదునని యొక్క దివ్య ఖడ్గంబును దివ్యఖేటకంబును కృపచేసి యీ ఖడ్గంబు నీ చేతనున్న విన్నెదిర్చిన శత్రువు లడంగుదురు. ఈ దివ్యఖేటకంబు నీ చేతనున్న శస్త్రాస్త్రం

బులు నిన్ను జేరవు. అని యానతిచ్చి ద్విగుణీత సహస్ర మాసంబులు రాజ్యంబు సేయుదువని పల్కి తన సమీపంబున నున్న నొక్క బిలం బును జూపి పశ్చిమ ముఖుండవై యరిగి యొక్క రమ్య ప్రదేశమున నీవీ బిలంబు వెడలియున్న సమయంబున సూర్యోదయ పర్యంతంబునకు వచ్చి యమార్గంబు వెడలి చతురంగ బలంబులు నీ వెంట చనుదెంచునని యానతిచ్చి మరియు నిట్లనియె. ఈ దివ్య ఖడ్గ ఖేటకంబులు మీ యింట సింహాసనంబున వెయ్యేండ్లుండునని యానతిచ్చి గోబ్రాహ్మణ పూజయు, నుమామహేశ్వర పూజయు, లక్ష్మీనారాయణ పూజయు, మరువకుమని చెప్పెను.

ప్రతాపరుద్ర చరిత - 13 పేజి.

విద్యానాథ కృతమైన ప్రతాపరుద్ర యశోభూషణ మను అలంకార గ్రంథమును బట్టి చూడ కాకతీయ రాజులకు కాకతి యను దుర్గాశక్తియు, స్వయం భూదేవుడను నీశ్వరుడును ఆరాధ్య దేవతలుగ నుండగ పైపుస్తక త్రయము నందీ ప్రసక్తియేలేదు.

శాసనాద్యాధారములనుబట్టి కాకతీయులు క్రీ.శ. 1020-1320 వరకు పాలించినట్లు తెలియుచుండగ పైగ్రంథములలో క్రీ శ. 369 నుండి 1359 వరకు, సుమారు వేయేండ్లు పాలన చేసినట్లు కానబడుచున్నది ఇది చరి త్రకు విరుద్ధమైన విషయము. హనుమకొండ మీద పద్మాక్షి దేవాలయ మున్నట్లును, పార్వతియే అచట పద్మాక్షిగ వెలసినట్లును, దానికి తూర్పున కొంత దూరములో సిద్ధేశ్వరాలయము కలదనియు నీ గ్రంథములు చెప్పు చున్నవి కాకతీయులకీ దేవతలు ఉపాస్యదేవతలైనచో వారి శాసనములలో

గాని, సాహిత్య గ్రంథములలోగాని యీ పేర్లు కానరావు. పద్మాక్షీ సిద్ధే శ్వరు లీ కావ్యములతోనే సిద్ధించినారని చెప్పవలెను.

ఈ కావ్యములలో కాకతీయుల వంశము సోమదేవరాజుతో ప్రారంభ మగుచుండ శాసనములను బట్టి మొదటి బేతనతో ప్రారంభ మగుచున్నది. శాసనములను బట్టి తెలియ వచ్చెడి మొదటి బేతరాజు మొదటి ప్రోలంరాజు, రెండవ బేతరాజు ఈ కావ్యములలో లేరు. మాధవ వర్మ. వెన్నమరాజు, గుండరురాజు, ఎఱుకదేవరాజు, భువనైక మల్లుడు, త్రిభువనైక మల్లుడు అను రాజులు ఈ కావ్య ప్రపంచములోనేగాని శాస నములందు కానరారు.

కాకతీయులలో రెండవ ప్రోలుడు ఓరుగల్లు కోటను, అచటి దేవా లయములను నిర్మించినట్లీ కావ్యములు చెప్పుచున్నవి. కాని శాసనములను పరిశీలించిన గణపతి రుద్రమ దేవుల కాలమున నిర్మితమైనట్లు తెలియు చున్నది.

రెండవ ప్రోలుడు వెలనాటి రాజులతో యుద్ధమున మరణించి నట్లు శాసనములు చెప్పుచుండ నీ కావ్యముల యందు అతని కుమారుడు రుద్రుడే తండ్రిని పొరపాటున చంపినట్లీ గ్రంధములు చెప్పుచున్నవి.

తాకుటయు దద్దరిలిలేచి యాకొమరుడు
గ్రుచ్చు గ్రుచ్చని తద్దయు రొదయొనర్చి
చేతి సురియను బొడిచె నాక్షితిపు డంత
నతఁడు రాజగుటెరిగి భయంబునొంది.

సోమదేవరాజీయము - పుట 72.

.... .... విద్రభంగ
మని మాటలాడక నటరాగ నీతని,
దన బొటమన వ్రేలు తాఁకిన నులికి.
పడిలేచి మృచ్ఛంచు పట్టి యారాజు
బొడిచి వాడంతట భూవరుఁడనుచు ...."

శ్రీ సిద్ధేశ్వర చరిత్రము - పుట 104.

"అంత విధి వశమున కాకతిప్రోలరాజు జంఘులు సుతుడగు రుద్ర మహారాజు బొటమనవ్రేలు తాకెను. అంత నాతడు దద్దరిల్లి లేచి మ్రుచ్చని యరచుచు తన చేతి సురియచే పొడిచిన యతండు రాజౌట నెఱింగి గడ గడ వణకుచు నాయుధంబు తీయక నిలిచియుండెను."

ప్రతాపరుద్ర చరిత్ర — పుట 33.

ప్రోలుడు యుద్ధమున వీరమరణ మొందినట్లు శాసనములు చెప్పు చుండ, నీ పైగ్రంథము లందీతడు ప్రమాదవశమున పుత్రుడైన రుద్రు విచే నిహతుడైనట్లు చారిత్రక విరుద్ధముగ పేర్కొన బడినది.

గణపతి దేవుడు యాదవులపై దండయాత్ర సలిపి వారలను జయించి యాదవుల కన్యను వివాహ మాడినట్లు, ఆమెయే గణపతిదేవుని యనంతరము రాజ్యమేలినట్లీ కావ్యములు చెప్పుచున్నవి. కాని శాసనము లను బట్టి చూడ గణపతి దేవుని పుత్రిక రుద్రమదేవి రాజ్యమేలినట్లు కన బడుచున్నది. విద్యానాథుని ప్రతాపరుద్ర యశోభూషణమును బట్టి కూడ ఇట్లే తెలియుచున్నది.

శ్లో॥ శైవో మా చేతి విఖ్యాత సోమాచేతి ప్రథామగాత్
తవ మాతా శివా సాక్షాద్దేవ గణపతిః పితా॥

ఓ రుద్రమదేవీ ! నీ తల్లియగు సోమాంబ యను ప్రసిద్ధి కెక్కిన రాజకన్య సాక్షాత్తు పార్వతియే యనియు, తండ్రియైన గణపతి దేవుడు ప్రమధ గణాధిపతియైన శివుడనియు నిందలి తాత్పర్యము.

శివదేవయ్య అను నతడు గణపతి దేవునకును, రుద్రమ దేవికిని, ప్రతాపరుద్రునకు మంత్రిగ నున్నట్లీ కావ్యముల వల్ల తెలియుచున్నది. శివదేవయ్య సాక్షాత్తు శివుడే యని తిక్కన గణపతి దేవునితో తెలిపి నట్లున్నది.

ద్వి॥ ఆ గణపతిరాజు నసుమతి వడసి
వేగరాఁబోవుచు వేదవేదాంగ
పాఠక పరమార్ధ భవ్యతత్త్వార్ధ
పఠన చిద్విజ్ఞాన బాదరాయణుడు
సదసద్వివేక లక్షణ రక్షణుండు
విదిత శైవాగమ విద్యాధ రిపుఁ
డతు లిత రాజసభా మంత్రివరుడు
సైతగు మంత్రియై యారాజు నొద్ద
నుండు శివదేవుని నుద్దండుఁ జూపి
దండిగా నాయన పాండిత్యశక్తి
నుద్దండత కొనియాడ రెండవ శివుడు
మండిత యశుడని మాటికి చెప్పి
మనుజమాత్రుడుగాడు మనకైచిచూడ''

శ్రీ సిద్ధేశ్వర చరిత్ర - పుట 117

ద్వి॥ పనుచునెడ దిక్కనమఖియ
జన వర సింహాసనమున సచివాగ్రణియై
దనరెడి శివదేవయ్యం
గనుగొని యా రాజుతోడ గడకంబలికెన్

గీ॥ వసుమతీనాథ ! యీతడీశ్వరుడు గాని
మనుజ మాత్రుండుగాడు పల్మారుపితని
యనుమతంబున నీవు రాజ్యంబు నెమ్మి
నేలుమని చెప్పి యాఘనుడేగుటయును.”

సోమదేవరాజీయము – పుట 80

“అంత నెల్లూరి నుండి తిక్కన సోమయాజి గణపతి దేవరాజు చేతననుజ్ఞతుండై పోవునపుడీ రాజు, సింహాసనమున మంత్రియై యున్న శివదేవయ్య గారిని జూపి యితండీశ్వరుడు గాని మనుష్య మాత్రుండు గాడు గావున రాజ్య భారం బీతని యనుమతిని నడుపు మని చెప్పి చనెను.

ప్రతాపరుద్ర చరిత్ర – పుట 86

ఇదే ప్రతాపరుద్ర చరిత్ర యందు రెండవ ప్రతాపరుద్రుని కాలములో నొక శివదేవయ్య ‘నీవు కైలాసంబున కేగెదవని చెప్పెను. శాసనాదులలో నీ శివదేవయ్య విషయమే లేదు. రెండవ ప్రతాపరుద్రుని కాలములో నొక యుగంధర మంత్రి యున్నట్లొక ప్రతీతి కలదు. కాని శాసనాదులందీ యుగంధర మంత్రి ప్రసక్తియేలేదు. ఈ విధముగ కావ్య

ములలో చెప్పబడు చారిత్రక పురుషులకు, శాసనములందు చెప్పబడు చారిత్రక ప్రాముఖ్యము గల పురుషులకు సంబంధమే లేదు నేను కొన్నిటినే ఉదాహరించు చున్నాను. కాని యిట్టివి పెక్కు దాహరణలు కలవు.

## యదార్థ చరిత్ర

"తెలుగు బిడ్డా ! తెలుగు చరితను
తెలుపు చుంటిని తెలిసికోరా !"

కాకతీయులకు మూలపురుషుడు కాకర్త్యగుండన రెండవఅమ్మరాజు Inscriptions of Andhra dyanesties. by Dr. M. Rama Rao. మాగల్లు శాసనము వలన గుండియన తాత పేరు గుండియ రాష్ట్రకూటుడు, తండ్రి యెఱ్ఱయరాష్ట్రకూటుడు అని తెలియుచున్నది. తల్లి వంజనాంబ – వీరు గుమ్మడి వంశము వారని తెలియుచున్నది కాకతీయులు కూష్మాండినీ దేవత నారాధించెడి వారనియు, కూష్మాండమునకు తెలుగు రూపమయిన 'గుమ్మడి' అనునది వీరికి గృహనామమై యుండవచ్చుననియు నిశ్చయింపవలసియున్నది. ఈ కాకతీయులు అమ్మరాజునకు సామంతులు. గుండ్యన అమ్మరాజునకు పెక్కు యుద్ధములలో తోడ్పడుటచే నత వాటి సీమ (నేటి మదిర) కానుకగా లభించినది. దీనితో గుండ్యన వంశీయుల ప్రతిష్ఠ పెరిగినది. నేటికి మండలాధిపత్యము సంపాదించి అనుమకొండ రాజ కుటుంబములో పెండ్లి చేసికొని పెండ్లి గుండమ రాజా అను కీర్తిని పొందెను.

రెండవ అమ్మరాజు తర్వాత అతని వంశీకుడు దానార్ణవుడు మూడు సంవత్సరములు ( క్రీ శ 970–73 ) పాలించి జటాచూడ భీమునిచే

యుద్ధము నిహతుడయ్యెను. దీనితో రాష్ట్రకూట రాజ్య మస్తమించి క్రీ.శ. 973 ప్రాంతమున కల్యాణి చాళుక్యాధిపత్య మేర్పడినది. ఈ సంధి సమయములో రాజకీయ ధురంధరుడైన కాకత్యగుండన స్వతంత్ర రాజ్యమును స్థాపించెను. ఆ కాలములో మహాబలవంతులైన విరియాల వారితో చుట్టరికముచేసి రాజ్యము సుస్థిరము గావించుకొనెను. తన సోదరియగు కుంతలీదేవిని ఎఱ్ఱనరేంద్రున కిచ్చి వివాహము చేసెను. ఈ ఎఱ్ఱనరేంద్రుడు విరియాల వంశీయులలో ప్రసిద్ధుడు.

కాకర్త్యగుండన తదనంతరము అతని కుమారుడు ఒకటవ బేతరాజు రాజ్యమునకు వచ్చెను. బేతరాజు చిన్నవాడగుటచే అతని మేనత్త కుంతలీదేవి రాజ్యవిచ్ఛిత్తి గాకుండ చూచినది. బేతరాజు బాలుడగుటచే అతని వైరులు విజృంభించి కాకతీయ రాజ్యాంకురమును పూర్తిగ నాశనము చేయుటకు బద్ధకంకణులైరి. ఇటువంటి విపరీత విపత్కర పరిస్థితులలో విరియాల నృపతి బాలుడగు బేతరాజును రక్షించి కాకతీయ రాజ్యమును కాపాడెను. కనుకనే కాకతిరాజ్య స్థాపనాచార్య బిరుదము విరియాల నాయకులను దక్కినది. "కాకతి నిల్పుట కోటిసేయదే." అను సామెత ఆ కాలము నాటిదే. విరియాలవారు దుర్జయ వంశీయులు. కాకతీయులు మొదట గుమ్మడి వంశమువారయినను రాజ్యము స్థిరపడిన తర్వాత దుర్జయ వంశీయులని మార్చుకొన్నట్లు కనబడుచున్నది. రెండవ ప్రోలరాజు కాజీపేట శాసనములో తన తండ్రి దుర్జయ వంశ సుజాతుడని చెప్పికొన్నాడు. విరియాలవారితో సంబంధ బాంధవ్యములు నెఱపుటచే అట్లనుటలో వైపరీత్యములేదు. విరియాలవారు నీతిపరులు, స్వామిభక్తి పరాయణులు. బంధుప్రీతికలవారు. ఔదార్యవంతులు. బేతరాజు విరోధులను చంపి అతని రాజ్యమాతని కిచ్చుట వారి యౌదార్యమును నిర్మల ప్రవర్తనను బంధుప్రీతిని సూచించుచున్నది.

## బేతరాజు I

బేతరాజు పెరిగి పెద్దవాడై కాకతీయ మహామండలేశ్వరుడయ్యెను. రెండవ బేతరాజు తన కాజీపేట శాసనములో తన తాతకు "చోడక్ష్మా పాలచమూవార్ధి ప్రమథనోపార్జిత లక్ష్మీః అని చెప్పబడే మొదటి బేత రాజు చోడచక్రవర్తిని జయించినట్లు కనబడుచున్నది. ఈ మొదటి బేత రాజును గూర్చి యింతకు మించిన మనకు శాసనములద్వారా ఎక్కువ తెలి యుట లేదు.

## ప్రోలరాజు I

మొదటి బేతరాజు నకేకైక పుత్రుడే మొదటి ప్రోలరాజు. ఇతడు భువనైక మల్ల బిరుదాంకితుడు. మొదటి ప్రోలరాజు మిక్కిలి పరాక్రమ శాలి. స్వశక్తిచేతన రాజ్యమను విస్తరింపజేసెను ప్రోలుడు పెక్కు విజ యములను సాధించినట్లు శాసనముల వలన తెలియుచున్నది. ఇతడు నిర్మల వర్తనుడనియు, నీతివిదుడనియు ప్రసిద్ధికెక్కెను.

## బేతరాజు II

ఈ రాజు చరిత్రకు సుపరిచితుడు. సాహిత్య గ్రంథములు వీనివి గూర్చి పెక్కు విషయములు చెప్పినవి. కాని యవి వినికిడి వలన వచ్చి నవే గాని పరిశీలన చేసి శాసనాధారములతో చెప్పినవిగావు. ఈ రాజు క్రీ శ. 818 మొ॥ 892 వరకు పరిపాలించినట్లు ప్రతాపరుద్రీయ చరి త్రము చెప్పుచున్నది. వాస్తవమున కితడు క్రీ శ. 1075—1110 వరకు పాలించినట్లు చారిత్రక నిర్ణయము - కటక వల్లభుని జయించినట్లు ప్రతా

పరుద్ర చరిత్ర చెప్పుచున్నది. కాని యా కటకవల్లభు డెవ్వరో తెలియుట లేదు ఈతడు పెక్కు దేవాలయములను కట్టించెను. కాకతిదేవుని ప్రసాద మున నితని కొక కుమారుడు కల్గెనని సాహిత్యగ్రంథములు చెప్పుచున్నవి. ఈతడే రెండవ కాకతిప్రోలుడు.

బేతరాజు గొప్ప పరాక్రమశాలి. విక్రమ చక్రియను బిరుదము గలదు. పచ్చిసాయర మండలము (కరీంనగర జిల్లా) ను జయించినట్లు శాసనముల వలన తెలియుచున్నది. ఈ విజయములో మంత్రిపై జన దండ నాధు డెక్కుడుగ తోడ్పడినాడు. ఈ దండనాధుని శాసనము పద్మాక్షి దేవాలయమున కలదు. ఈ రాజు పెక్కు ధర్మకార్యము లొనర్చినట్లు శాసనముల వలన తెలియుచున్నది. తన తండ్రి మొదటి ప్రోలుని పేర ఒక దేవాలయము కట్టించినట్లు కాజీపేట శాసనము చెప్పుచున్నది ఇతనికి దారిద్ర్యవైరి యను ఘనత గలదు. అడిగినవారికి దారిద్ర్యము పోగొట్టెడి వాడట; కుమార సంభవకర్త నన్నెచోడునిచే 'దారిద్ర్య విద్రావణుడుగ కొండాడబడిన వాడితడే యని కొందఱు పండితుల యభిప్రాయము. తన కుమారుడు కాకతి ప్రోలరాజునకు పట్టము గట్టి యితడు దేహ త్యాగము చేసెను.

## కాకతి ప్రోలరాజు II

రెండవ బేతరాజు మరణానంతరము కాకతి ప్రోలరాజు రాజ్యము నకు వచ్చెను. ఇతడు బాలుడగుటచే జగద్దేవుడను దండనాయకుడు అనుమకొండపై దండెత్తెను. రుద్రదేవుడు తన అనుమకొండ శాసన ములో తన తండ్రి విజయమును ప్రస్తావించి జగద్దేవుని వృత్తాంతమును పేర్కొనెను. ఈ జగద్దేవునితో ఘోర యుద్ధమున కాకతి ప్రోలుడు

విజయమొందెను. ఈ జగద్దేవుడు పశ్చిమ చాళుక్య సామంతుడు కావచ్చు నని చారిత్రకుల అభిప్రాయము.

రెండవ ప్రోలుడు మహాయుద్ధలంపటుడు. గొప్ప పరాక్రమ వంతుడు. పెక్కు మంది సామంతరాజుల నోడించి రాజ్యమును విస్తరింపజేసిన మహావీరుడు. ఇతడు చాళుక్య తైలపుని, మంత్రకూటాధిపుడైన గుండరాజును, గోవిందరాజును సులభముగ నోడించినట్లు అనుమకొండ శాసనము తెల్పుచున్నది. ఇతడు శాశ్వత శివాలయ ప్రతిష్ఠాత. తీతతటాక నిర్మాత. అరి కేసరి సముద్ర మితని నిర్మాణమే. ఈ విషయము కాజీపేట శాసనమున చెప్పబడినది, ఇతడు శిల్పకళాపోషకుడు. ప్రోలరాజు నిర్మాణములలో మిక్కిలి ప్రధానమైనది, ఓరుగల్లు కోట. దీని నిర్మాణము క్రీ. శ. 909 సం॥ ప్రాంతమున జరిగినదని చారిత్రకుల అంచనా. ఓరుగల్లు గ్రామమతిప్రాచీనమైనది. అక్కడ దుర్గనిర్మాణము ప్రోలరాజు కాలములో జరిగి యుండవచ్చును. ఇతడు రామేశ్వరదీక్షితులు మొదలైన పండితులను పోషించినట్లు మాడరెడ్డి కుంట శాసనము వలన తెలియుచున్నది. ప్రోలునకు రుద్రదేవుడు మహాదేవరాజు అను ఇర్వురు కుమారులు గలరు.

ఇతడు వెలనాటి రాజులతో యుద్ధము నందు మరణించినట్లు తెలియుచున్నది. ద్రాక్షారమ శాసనములో రెండవ చోడరాజునకు "కాకతి ప్రోలనిర్దహన" అను బిరుదము ప్రకటింపబడినది. కనుక నితడు వెలనాటి ప్రాంతమును జయింపబోయి అచట మరణించినట్లు చారిత్రకులు భావించుచున్నారు,

XX

# రుద్రదేవుడు

రెండవప్రోలు డస్తమించగనే అతని కుమారుడు రుద్రదేవుడురాజయ్యెను. ఇతడవక్రపరాక్రమలాంఛనుడు. ఇతడు మొదటిప్రతాపరుద్రుడుగ ప్రసిద్ధుడు. ఇతడనేక రాజ్యములను జయించి రాజ్యవిస్తరణకు తోడ్పడిన భూజాని ఇతనిని కటక విజేతగ చారిత్రకులూహించుచున్నారు. ఇది అమరావతి - ధాన్యకటకము కాదు. నేటి ఒరిస్సాకు ముఖ్య పట్టణమైన కటకము. ప్రోలుడు తాను జయించిన రాజ్యములను స్థిరపరచుకొని ప్రజానురంజకముగ పాలించెను. ఇతని దండయాత్రాశ్రవణ మాత్రముననే తైలపుడు మరణించినట్లు అనుమకొండ శాసనమున గలదు. దీనిచే పశ్చిమ చాళుక్యులు కాకతీయులను సామంతులుగ నొనర్చు యత్నములు కమ్మయినట్లు భావించనగును. "ప్రాప్తశ్రీ పొలవాసదేశ విభవం శ్రీ రుద్రదేవకు" అని అనుమకొండ శాసనమున వర్ణింపబడినది. ఇతడు దొమ్మరాజు, మైళగిదేవుడు, మేడరాజు మొదలైన వారిని జయించినట్లు ఈ శాసనమునందు చెప్పబడినది. పొలవాస దేశమన కరీంనగర మండలమని చెప్పవచ్చును. సబ్బిమండలము రుద్రదేవుని తాతకాలముననే కాకతీయుల వశమైనది పానుగల్లు - కందూరు - వర్ధమాన పురము మున్నగు కోటలను జయించి చోడరాజులను తన వశమొనర్చుకొన్న మహావీరుడు. రుద్రుడు కందూరు రాజైన ఉదయచోడుని పుత్రిక పద్మావతిని పాణిగ్రహణము చేసికొన్నట్లు అనుమకొండ శాసన కథనము.

రుద్రుడు వెలనాటిపై దాడిచేసి ఆ రాజ్యమును జయించినట్లు ద్రాక్షారామము నందలి క్రీ. శ. 1186 సం॥ నాటి శాసనము తెల్పుచున్నది' వెలనాట తన తండ్రి మరణమునకు ప్రతీకారముగ ఈ విజయ యాత్ర సాగించినట్లు చారిత్రకులు భావించుచున్నారు. ఈ కాలమున జరి

గిన పల్నాటి యుద్ధమున కీ రాజు కొంత సైన్యమును పంపినట్లు తెలియు చున్నది.

ఈ రాజు సంగ్రామ ధీరుఁడనియు, కళాపోషకుఁడనియు తెలియు చున్నది. అనుమకొండ నగరమును తీర్చిదిద్ది సుందర నగరముగ మార్చి నాడు. అనేక శివాలయములను కట్టించెను. అనుమకొండలో వేయి స్తంభ ముల దేవాలయమును కట్టించినదీ రాజే. ఈ దేవాలయము 1163 లో కట్టించినట్లు ఆలయములోని కోనేటి ప్రక్కనున్న శిలాశాసనము వల్ల తెలియుచున్నది, "అన్మకొండ —— —— భాను సంవత్సరము జ 113 వద్ద వారం నాన్డు శ్రీ రుద్రేశ్వరుడు —— శివ విష్ణు సూర్యుల ప్రతిష్ఠించినట్లు న్నది కాని దెవాలయములో చూడగ విష్ణు విగ్రహము, సూర్యవిగ్రహ మును లేవు. వీనిని మతాన్మాదులైన మహమ్మదీయులు నాశనముచేసి యుండ వచ్చును. రుద్రమదేవుడు విద్యాధికుడుగ కూడ కనబడు చున్నాడు సంస్కృతమున నీతిడొక నీతి శాస్త్రము రచించినట్లు బద్దెన ప్రశంసించినాడు.

రుద్రమదేవునకు సంతతిలేదు. ప్రతాపరుద్ర చరిత్ర, సిద్ధేశ్వర చరిత్ర గణపతిదేవుఁ రుద్రదేవుని కొడుకని తెల్పుచున్నవి. రుద్రదేవుని తమ్ముడైన మహాదేవరాజు పుత్రుడు గణపతిదేవుడని కుందవర శాస నము వల్ల స్పష్టముగ తెలియుచున్నది. మహాదేవరాజు ప్రోలరాజు రెండవ కుమారుడు. ఈతడు (1195—98) మూడు సంవత్సరములు కాకతీయ రాజ్యము నేలినట్లు చారిత్రకులు అభిప్రాయ పడుచున్నారు. మహదేవరాజు కూతురు కుందాంబ తన శాసనమునందు మహదేవరాజు పాలించినట్లు ఈ క్రింది శాసన భాగమున ప్రకటించినది.

తస్మాదనంతరం తస్యమహాదేవో మహీపతిః
అనుజో మనుజాకార మహాదేవో మహీభృతాత్.

దేవగిరి రాజగు జైతుగితో యుద్ధము పొసగి రుద్రదేవరాజు మహాదేవరాజులు మరణించినట్లు తెలియుచున్నది. ఈ విషయమును చారిత్రకు లింకను పరిశోధనచేసి నిర్ణయింపవలసి యున్నది.

## గణపతి దేవుడు

గణపతి దేవుడు కాకతీయ సామ్రాజ్యమును నిరుపమాన దక్షతతో పెక్కు సంవత్సరములు ప్రజలు శాంతి సౌఖ్యములతో నోలలాడునట్లు పాలించెను. ఇతని బాల్యదశను గూర్చిన వివరములు తెలియుటలేదు. గణపతి దేవుడు దేవగిరి రాజకన్యయైన రుద్రమదేవిని వివాహమాడినట్లు ఆ ఖ్యానములు తెలుపుచున్నవి. కా తీయ సామ్రాజ్ఞి రుద్రమదేవి గణపతి దేవుని పత్నియను ప్రదూరపు వ్రాతకు కూడనిదియే హేతువగుచున్నది. గణపతి దేవునకు రుద్రమదేవి యను భార్యలేదు.

గణపతి దేవుడు పెద్దవాడై దేవగిరి, వెలనాటి రాజులపై దాడి వెడలి యా రాజులను జయించెను. ప్రోలరాజు II నుండియు కాకతీయులు ఉత్తరాంధ్ర దేశ విజయమునకు కృషిచేయుచున్నారు. తుదకు కాకతీయ గణపతి కాప్రతిష్ఠ దక్కినది.

సామ్రాజ్య విస్తరణకు ప్రతిభాశాలియు సంఘ సంస్కర్తయునైన గణపతిదేవుడు పెక్కు మార్గముల ననుసరించెను. తన సోదరి కుందాంబను నతవాటి వారికిచ్చెను. ఈమెకు మేలాంబ యను పేరుకూడ కలదు. గణపతి దేవుడు కృష్ణాజిల్లా దివితాలూకా దేవరకోటపై దాడిసల్పి అయ్య

వంశము వారిని జయించి వారి కన్యలను వివాహమాడెను. వీరి సోదరుడైన జాయపనాయకుని గజాధ్యక్షుడుగ చేసి తన అనుయాయిని గావించెను. ఇతడు సైన్యాధిపతియే గాక సంస్కృతము నందు మహాపండితుడు. నృత్త రత్నావళి కర్త యీతడే. జాయప తోబుట్టువే. కాకతీయ పట్టమహిషియై వంశాభివృద్ధికి కారకురాలైనది. రుద్రమదేవి యీమె పుత్రిక. రుద్రమదేవిని నిరవద్యపుర (నిడుదవోలు) పాలకుడైన వీరభద్రునకిచ్చి వివాహము చేసినట్లు కొలనుపాక శాసనమువల్ల తెలియుచున్నది. రెండవ పుత్రిక గణపాంబను ధాన్యకటక రాజైన బేతరాజున కిచ్చి వివాహము చేసెను.

నెల్లూరి నుండి తిక్కన సోమయాజి గణపతి దేవుని ఆస్థానమునకు వచ్చి తన వాదనాపటిమనుచూపి జైనులను జయించి వారిని చంపించినట్లు మనకు జనశ్రుతి వలనను, సిద్దేశ్వర చరిత్ర, ప్రతాపరుద్ర చరిత్ర వలనను తెలియుచున్నది. సంఘసంస్కర్తయు, పరమత సహనము కల్గిన గణపతి దేవుడంత క్రూరుడగ కిన్పడుట లేదు. అందుచే జైనులను చంపించే ననుమాట విశ్వసనీయము కాదు. తిక్కన సోమయాజి కోరికపై మనుమసిద్ధి జ్ఞాతులైన అక్కన బయ్యనలను శిక్షించి ఆ రాజ్య వ్యవహారములను సరిదిద్ది కొలది రాజ్యమును మాత్రము మనుమసిద్ధికిచ్చి మిగిలినది తానే స్వీకరించినట్లు కనబడుచున్నది.

నెల్లూరి విజయముతో తృప్తిపడక రాయల సీమపై దండెత్తి ఆ సీమనుకూడ తన రాజ్యమున కలుపుకొనెను. ఉత్తరమున కళింగులు విజృంభించుట చూచి వారిని అణచుటకు జాయపసేనానిని పంపి దానిని తన స్వాధీనము చేసికొనెను. ఈ విధముగ ఆంధ్రదేశము నంతటిని ఒక గొడుగు క్రిందికితెచ్చి ఏకచ్ఛత్రాధిపత్యముగ నేలినకీర్తి గణపతి దేవునకే దక్కినది.

గణపతి దేవుడు గొప్ప వదాన్యుడు, కళాప్రియుడు, సంఘ సంస్కరణాభిలాషి - దైవభక్తి పరాయణుడు. రామప్పగుడి నీయనయే కట్టించెను. పాకాల తటాక నిర్మాత. సర్వవర్ణముల వారికి నాయకత్వమిచ్చి, సర్వకులములవారిని సమానముగ చూచి సర్వసమత్వమును బోధించెను. అందు వలననే యాతనికి నానామండలీకరగండ యను బిరుదు లభించినది. ఇతడు తన సుదీర్ఘ పరిపాలన (1198–1261) నంతరము వార్ధక్యముచే క్రీ శ. 1261 వ సం॥ రుద్రమదేవికి పట్టము గట్టి విశ్రాంతి తీసికొనెను. అనంతర మతడు ఐదారేండ్లు జీవించి ఆమెకు పరిపాలనా విషయములందు తోడ్పడి యుండెను.

## రుద్రమదేవి

ఈమె గణపతి దేవునకు జాయప సేనాని సోదరియు పట్టమహిషి యునైన సోమాంబ వలన కలిగిన సంతానము. ఈమె గణపతిదేవుని రాణి యని సాహిత్యవేత్తలు పొరపడిరి ప్రతాపరుద్ర యశోభూషణ వ్యాఖ్యాకారుడైన కొలచెల కుమారస్వామి సోమపీఠియునిట్లే వివరించెను. విదేశ యాత్రికుడైన మార్కో-పోలో కూడ నిట్లే పొరపడెను. రుద్రమాంబ గణపతి దేవుని పుత్రియనుటకు కొలనుపాక శాసనము నిర్ధారించుచున్నది. ఆ శాసనమందిట్లున్నది.

"జాతాతస్య పయోనిధేరివరమా శ్రీ రుద్రదేవీ సుతా
భాస్వర్భిక్షువ మౌళిరత్నవి వహైర్నీ రాజతాంఘ్రిద్వయా.

రుద్రమదేవి భర్త చాళుక్య వంశజుడైన వీరభద్రుడని యాక్రింది శాసనమే ఋజువు చేయుచున్నది.

"భాగ్యేవర్యేశ్వ, తస్యాః పతిరభవదధో వీరభద్రాభిధానః"

ప్రతాపరుద్ర చరిత్ర చోళాఖ్య తిలకుండగు వీరయ్య యను రాజ సుతునకు ముమ్మమ్మను వివాహము చేసినట్లు చెప్పుట ప్రమాదజన్యము.

రుద్రమదేవి భర్త వీరభద్రుడు వివాహమైన కొలది కాలమునకే (క్రీ. శ. 1266 సం॥) మరణించెను. గణపతిదేవుడు కూడ దీనికి సమీప కాలముననే మరణించెను. ఈ రెండు విషాదఘట్టములు రాణి రుద్రమ దేవిని దుఃఖమున ముంచినవి. సహగమనము చేయ యత్నించినది. అప్పటికే భవిష్యత్ సమ్రాట్టు ప్రతాపుడు పుట్టి యుండుటచేత అతనిని అనురాగముతో పెంచుటచేతను ఆ ప్రయత్నమునుమాని అతనికై ప్రాణములు నిలుపుకొన్నది.

ఈమె కాలమున ఒకటి రెండు విషాద ఘట్టములు జరిగినవి. ఆమె సవతి సోదరులైన, హరిహర, మురారిదేవు లామెపై తిరుగుబాటుచేసిరి. ఆమె వారిని నిర్దాక్షిణ్యముగ నణచివేసినది.

దేవగిరి రాజైన మహాదేవరాజు ఓరుగల్లుపై దండెత్తి కోటను ముట్టడించెను. అంత రుద్రమదేవి మహాదారుణ యుద్ధమున వాని నోడించి సైన్యముతో దేవగిరి నగరము వరకు తరిమికొట్టినది. ఈ మహాయుద్ధములో త్రిపురాంతక దేవుడు, రేచర్ల దామానాయుడు మున్నగువారామెకు తోడ్పడిరి. ఈ రెండు సంఘటనలు తప్ప ఆమె కాలము ప్రశాంతముగ గడచినది.

ఈమె యనేక సత్కార్యములు గావించెను. సత్రములను కట్టించినది. ఓరుగల్లు రాతి కోటను బలపరచి శత్రుదుర్భేద్యము చేసినది. బాటలు వేయించి వృక్షములను నాటినది. వైద్యశాలలను స్థాపించినది. ఆమెను 'అంబ' యని విశేషాదరముతో పిలిచెడివారు. ఆమె పేర నేటికి నొక

గ్రామము గలదు. ఈమె కుమార్తె మమ్మడమ్మ సుతుడే రెండవ ప్రతాప రుద్ర చక్రవర్తి.

## ప్రతాపరుద్ర చక్రవర్తి II

రుద్రమదేవి యనంతరము ఆంధ్ర చక్రవర్తులందు ప్రఖ్యాతుడైన రెండవ ప్రతాపరుద్రుడు సింహాసనమధిష్ఠించెను ప్రతాపరుద్రుని జన్మ వృత్తాంతమును గూర్చికూడ భేదాభిప్రాయములు కలవు. ఆనంద సంవత్సర చైత్ర శుద్ధ గురువారమునాడు మమ్మడమ్మకు పుత్రోదయమైనట్లు ప్రతాపరుద్ర చరిత్ర చెప్పుచున్నది. కాని యది నందన వత్సరమని సిద్ధేశ్వర చరిత్ర చెప్పుచున్నది. క్రీ. శ 1266–77 మధ్య కాలమున ప్రతాపరుద్ర జననమై యుండునని చారిత్రకుల అభిప్రాయము. యుక్తవయస్సున ప్రతాపరుద్రునకు రాజ్యాభిషేకము జరిగినది. రుద్రమదేవి మనుమనిని బాల్యముననే సర్వశాస్త్రము లందు సుశిక్షితుని గావించినది. యుద్ధ విద్య లందు, రాజనీతి యందు నాతడు మాతామహియైన రుద్రమదేవి వలన ఆరితేరినాడు. ఈమె ప్రతాపరుద్రునకు విశాలాక్షి మున్నగు కన్యలతో వివాహము గావించినది. రుద్రమదేవి తన తండ్రి శిక్షణలోనెట్లు పాలనాది విషయములందు సమర్థురాలై ప్రసిద్ధి నొందినదో అట్లే తన మనుమని గూడ పరిపాలన యందు సమర్థుడగుటకు సర్వ విధముల సుశిక్షితుని గావించినది. ఈమె పరిపాలనా కాలముననే ప్రతాపరుద్రుడు యువరాజ పదమునొంది పరిపాలనా విషయములను నిర్వహించినట్లు గణపవరము – మణూరు శాసనములు చెప్పుచున్నవి.

ప్రతాపరుద్రుడు సింహాసన మధిష్ఠించిన కాలమున విద్రోహులు చెలరేగుటచే దేశము సంక్షోభములో నుండెను. దుష్ట శిక్షణ శిష్ట రక్షణకు

బద్ధ కంకణుడైన మహారాజు శూరులైన వెలమ వీరులను రప్పించి పరిపాలన వారిచేత నుంచెను. గణపతి దేవుడు సర్వవర్ణముల వారికి రాచ కార్యములందు నాయకత్వ మొసగుట లోపముగ భావించి ప్రతాపరుద్రుడు పరిపాలనలో వెలమలకు నాయకత్వ మిచ్చెను. కాని యిది గొప్ప తప్పిదమని స్పష్టమయినది. తరతరములుగ కాకతీయ రాజ్యమునందితోధిక గౌరవ మర్యాదల నందుచున్న రెడ్డి వీరులకు, కాపు మన్నీలకు తదితరులకు నిది సహింపరానిదై క్రమముగ రాజ్యవిచ్ఛిత్తికి దారితీసెను ప్రతాపరుద్రుడు గొప్ప చక్రవర్తియేగాక పరిపాలనా దక్షుడు. ప్రతాపరుద్ర చక్రవర్తి రాజ్యారంభ సమయమున ఓఢ్ర దేశరాజులు సింహాచలమువరకు చొచ్చుకొని వచ్చిరి. కాని ప్రతాపరుద్రుడు వారిని అరికట్టి వెనుకకు నెట్టినట్లు కనబడుచున్నది.

ప్రతాపరుద్రుడు మునల్మానుల దండయాత్రలో చిక్కుకొనియుండగ పాండ్యులు కాంచీనగరముపై దాడిచేసి కాకతీయ సామంతుడైన వీరగండ గోపాలుని ఓడించి కంచి నాక్రమించిరి. ఇది తెలిసి ప్రతాపరుద్రుడు సర్వసైన్యాధిపతియైన ముప్పిడినాయకుని రేచర్ల ఎఱ్ఱదాసానాయని పంప, వారు పోయి పాండ్యుల నోడించిరి. దాసానాయని ఘన విజయమునకు చక్రవర్తి మిగుల సంతసించి 'కంచి కవాట చూరకార' అను బిరుదము నొందెను. దీనితో కాంచీ చోళరాజ్య మంతరించినది. ఈ సందర్భమున ప్రతాపరుద్రుడు దక్షిణ దిగ్యాత్ర గావించినట్లొ కశాసనము వల్ల తెలియుచున్నది. నేటికిని తిరుచునాపల్లిలో జంబుకేశ్వర దేవాలయములో ఈ శాసనము ప్రస్ఫుటముగ కన్పడుచున్నది.

తర్వాత ప్రతాపరుద్రుడు కేరళ దేశమును కూడ జయించినట్లు కంచి యందు అరుళాల పెరుమాళ్ దేవాలయము నందలి ముప్పిడి నాయకుని శాసనము వలన తెలియుచున్నది.

ప్రతాపరుద్రుని కాలమందు కూడ సామంతులు తిరుగుబాటు చేసినట్లు తెలియుచున్నది. పశ్చిమాంధ్రము నందు గంగయ సాహిణీ మేనల్లుడు అంబదేవుడు (క్రీ॥శ॥ 1272–1302) కాకతీయులను ధిక్కరించినట్లు కనబడుచున్నది. ప్రతాపరుద్రు డితని తిరుగుబాటు నణచి వేసినాడు. ప్రతాపరుద్రునిపై గండికోటలో రెడ్డి సామంతులు క్రీ శ. 1314 లో తిరుగుబాటు చేసినారు. చక్రవర్తియే స్వయముగ యుద్ధమున పాల్గొని రెడ్డి రాజుల నణచినాడు.

ప్రతాపరుద్రుడు చేసినన్ని ధర్మ కార్యములు కాకతీయులలో నెవ్వరును చేయలేదు. ఇతడు శైవ దీక్షాపరుడు. పెక్కు శివకేశవాలయములను కట్టించి తన పరమత సహనమును చాటెను. ఏకశిలానగరమున కీశాన్య భాగమైన ప్రతాపగిరి యను దుర్గమును నిర్మించెను. జగద్విఖ్యాతి చెందిన పాకాల చెఱువును త్రవ్వించెను. ఈయన కాలములో రాయల సీమలో అరణ్యములను భేదించి భూములను సాగులోనికి తెచ్చెను.

ఈయన కాలమున పెక్కురు మంత్రులు, విద్వాంసులు కవిపండితులు కలరు. ఈయనకు నాగయగన్న మంత్రి ముఖ్యమంత్రి. ఈ యమాత్యశేఖరుడు మిక్కిలి ప్రతిభా సంపన్నుడు. రాచకార్యములన్నియు నీతని చేతి మీదుగనే జరిగెడివి. కొన్ని సాహిత్య గ్రంథములందు చెప్పబడినట్లు యుగంధర మంత్రి యీయన కాలములో లేడు. బ్రాహ్మణ మంత్రి యొకడు కలడుగాని అంత ప్రసిద్ధుడు కాడు. శాఖవెల్లి మల్లిఖార్జున

భట్టు, భాస్కరకవి, గుండు భట్టు ప్రతాపభట్టు మున్నగు విద్వాంసు లీయన ఆస్థానమువారే.

కాకతీయులనాటి సాంఘిక సాంస్కృతిక పరిస్థితులు కొంతవరకు శ్రీనాధుని క్రీడాభిరామము వలన తెలియుచున్నది. దీనియందును చాల అతిశయోక్తులు కలవు.

కాకతీయులనాటి కళలను వర్ణించుటంత సులభసాధ్యముకాదు. ఈ శిల్ప విన్యాసములు వర్ణనాతీతములు. నేటికిని ఏకశిలానగరమున శిధిలావస్థ యందున్న దేవమందిరములు, గోపుర ప్రాకార కవాట పంక్తులు చూచు వారికి మహమ్మదీయుల దౌష్ట్యము కనుల గట్టినట్లుండును. ఓరుగంటి కోటలో నొక కోనేరున్నది. భగ్న శిలల దుఃఖాశ్రువులోడిగిల్లినట్లు జల మయమై యా తటాకము చూపరుల హృదయమును ద్రవీభవింప జేయును

ప్రతాపరుద్రుని కాలములో సాహిత్య వికాసము మూడుపూవులారు కాయలుగ వృద్ధినొంది యున్నది హుళక్కి భాస్కరుడు, పాలూరి సోమ నాధుడు మున్నగు తెలుగు కవులు ప్రధమాంధ్ర వచన కవి కృష్ణమా చార్యులు, రంగనాథ రామాయణ కర్త గోనబుద్ధారెడ్డి ఆనాటి ప్రసిద్ధ కవులు. విద్యానాధుడు మున్నగు సంస్కృత కవి పండితులు ప్రభు సభా లంకారములు.

కళాభివృద్ధితోపాటు సామ్రాజ్యము కూడ నీతని కాలమున దక్షిణ మున కేరళ వరకు ఉత్తరమున కటకము వరకు పశ్చిమమున దేవగిరి వరకు తూర్పున బంగాళాఖాతము వరకు వ్యాపించి విశేష ఖ్యాతిపొంది నది. ఈ విధముగ దేదీప్యమానముగ రాజ్యపాలన కొనసాగునపుడు

కాకతీయ సామ్రాజ్యమునకు విపత్తు ఉత్తరము నుండి మహమ్మదీయుల దండ యాత్రతో ప్రారంభమైనది. 1270–1309 మధ్య కాలములో ఢిల్లీ సుల్తాను ఓరుగల్లు మీదికి మలిక్ జూనా నాయకత్వమున దండయాత్రకు పంపినాడు. కాని యీ యుద్ధమున మహమ్మదీయులే ఓడిపోయినారు. 1307–1309 మధ్యలో మఱియొక దండయాత్ర జరిగినది. ఈయుద్ధములో ప్రతాపరుద్రుడు సంధిచేసికొని మలిక్ కపూరుకు పెద్ద యెత్తున ధనమిచ్చి సమాధాన పడినాడు. మరల 1318 లో మహమ్మదీయులు దండెత్తివచ్చిరి. ఈసారి కూడ సంధిచేసికొని వారిపీడ వదలించుకొనినాడు. ఇట్లు నాల్గయిదు సార్లు మహాయుద్ధములు జరిగిన తర్వాత కడపటి యుద్ధములో భోజారెడ్డి అను సేనాని మోసముచే రాజు మహమ్మదీయులకు పట్టుబడినట్లు చరిత్ర చెప్పుచున్నది.

ఇట్లు పట్టువడిన రాజును రామగిరి (కరీంనగర మండలము) మీదుగ ఢిల్లీ తీసికొని పోయిరి. చక్రవర్తి చివరి రోజులు ఎట్లు గడచినదియు మనకు స్పష్టముగ తెలియుట లేదు. ఇతడు యుగంధర మంత్రిచే విడిపింపబడినాడను మాట కట్టు కథ. ఢిల్లీనుండి గంగమీదుగ ప్రతాప రుద్రుడు యుక్తిచే కొనిరాబడినను వృత్తాంతము కూడ అసంగితమై చారిత్రక భౌగోళిక సత్యమునకు విరుద్ధముగ నున్నది. చక్రవర్తి రాయ బంది విమోచక బిరుదాంకితుడై యొక దండనాధునిచే విడిపింప బడినట్లు చరిత్ర వలన తెలియుచున్నది. ఆ రాయబంధి విమోచన కారుడే ముసునూరి కాపయ. ఇతడు చటుల విక్రమశాలి - సాహసాంకుడు - ప్రతాప రుద్రుని మరణానంతరము ఏకశిలానగరమును ముఖ్యపట్టణముగ చేసికొని ఆంధ్ర దేశమునంతటిని పాలించిన మహా పరాక్రమశాలి. ఇది యధార్థ చరిత్ర.

ఈ చరిత్రను మన సాహిత్య గ్రంథములు అభూత కల్పనలతో నింపి చారిత్రిక వాస్తవికతను కప్పిపుచ్చుచున్నవి. ఇంకను కాకతీయ చరిత్రను గూర్చి విస్తార పరిశోధన గావింపవలసియున్నది. అనేక శిలా శాసనములు భూగర్భమున కలిసినవి. వానిని వెలికిదీసి పరిశోధన చేయ వలసియున్నది. కాకతీయుల ఆలయములు, దుర్గములు, కట్టడములు శిథిల ములై వానిచరిత్ర అంతుబట్ట రాకున్నవి. ఇటీవల ఘనపురములో పొలము త్రవ్వకములో తీయబడిన శిలాశాసనము మీద నంది, శివలింగము — సూర్యచంద్రుల చెక్కడము ఉన్నవి. మఱియొక పొలము త్రవ్వకములో ఇటుక గృహము బయలుపడి దానిలో శిథిల శిలాశాసనము లున్నవి. వీనిని చారిత్రికులు పరిశోధనచేసి క్రొత్త విషయములు బయలు పరుపగల రని ఆశించుచున్నాను. ఇట్టి చారిత్రక ప్రదేశము లందలి నిక్షేపములను వెలికి దీసి పురాతత్త్వశాఖవారు, ప్రభుత్వమువారు చారిత్రిక పరిశోధనకు తోడ్పడగలరని మా యాకాంక్ష.

ఈ చారిత్రకాంశముల నాధారముగ తీసికొని హేతువాద దృక్పథ ముతో నేనీ నవలను రచించితిని. నవలా రచనలోనిది నా ప్రథమ ప్రయ త్నము. కాన విజ్ఞులు పరిశీలించి గుణ విమర్శచేయగలరని యాశించు చున్నాను.

రచయిత

గుడివాడ                విద్వజ్జన విధేయుడు

1-8-75                డా॥ త్రిపురనేని వేంకటేశ్వరరావు



గ్రంధకర్త

సాహిత్య సమ్రాట్టు

డా॥ శ్రీ త్రిపురనేని వెంకటేశ్వరరావు.

# మహాంధ్ర సామ్రాజ్య పతనము

అతిప్రాచీనకాలమున మన భారతదేశము ఫలపుష్ప సురభిశోభ వనంబులతోడను ధాన్యపేటులగు మైదానములతోడను, నిబిడమహోగ్రగహన దీర ఝరీ సరోవరంబులతోడను, గండోపలచ్ఛటాగండూషిత ప్రస్థ ఘన శిలామయ పర్వత పంక్తులతోడను
వేష్టిత సాగర తరంగములతోను సకల ఖండాళికి మేలుబంతియై మెలగుచుండెను. ప్రాక్తన కాలమున మనదేశము మహోజ్జ్వలమైన నాగరకత మహోదాత్తమైన సంస్కృతి మహోన్నతమైన సభ్యత ప్రపంచమును కబళింపగ జాలెడి మహా మేధావులను, ప్రజ్ఞా ధురంధరులైన విజ్ఞాన వేత్తలను అఘటన ఘటనాచణులైన రాజకీయ ధురంధరులను కలిగి ప్రపంచ సభ్యదేశములలో అద్వితీయముగ వెలుగొందుచుండెను

అట్టి భారతదేశమునకు పురాతనకాలములో హస్తినాపురము రాజధాని, చంద్ర ప్రస్తరసౌధములతోడను గోపుర ప్రాకారములతోడను కస్తూరీచందన కుంకుమాది నానావిధ పరిమళములతోడను, ధనధాన్యముల తోడను, వజ్రవైడూర్య మరకత మాణిక్యగోమేధికాది నవవిధరత్న రాసులతోడను హస్తినాపురము కురురాజ్యమునకు రాజధానియై ప్రసిద్ధి కెక్కినది. ఇది చరిత్రకందని గతకాలపుటితిహాస చరిత్ర.

అనంతకాల వాహినిలోబడి భారతదేశచరిత్ర కొన్నిశతాబ్దములు గడచినది. చార్వాక బౌద్ధజైన సాంఖ్య వైశేషికాది మత సంప్రదాయముల

తోను నానావిధ వైదికా వైదిక సంప్రదాయ సంఘర్షణలతోను చరిత్ర పుటలు గడచిపోయినవి.

ఏడవ శతాబ్దములో మహమ్మదు ప్రవక్త ఇస్లాము మతమును అరేబియాదేశమున స్థాపించెను. మతవ్యాప్తికై ఖడ్గము పట్టినను దోషము లేదని యీ మతసిద్ధాంతము. ఈ మత ప్రభావమువలన మధ్యాశియాలోని రాజ్యములన్నియు నొకటై వేర్వేరు తెగలన్నియు నొక జాతిగ రూపొందినవి. మతవ్యాప్తికై మహమ్మదీయులు భారతదేశము దండెత్తి వచ్చిరి. భారతదేశముపై మొట్టమొదటి దండయాత్ర సల్పినవాడు మహమ్మద్‌బిన్ ఖాసిమ్.

అతడు మొదట సింధుదేశముపై దండెత్తి దానినాక్రమించెను. సింధురాజును తన మతమును స్వీకరించవలసినదిగ నిర్బంధించి యాతని నీతి క్రూరముగ హింసించెను. హిందూస్త్రీలను మానభంగముగావించి మతద్వేషమును దేశీయులలో రేకెత్తించెను.

పదునొకొండవ శతాబ్దములో సర్దారైన సబక్తజీన్ కుమారుడు గజనీమహమ్మదు ఆఫగన్‌స్థానమునకు రాజయ్యెను. గజనీమహమ్మదు దభూత పరాక్రమశాలి. ధైర్యసాహసములు కలవాడు. మతోన్మాది. తన మతవ్యాప్తికై భారతదేశముపై పదునెన్మిదిమారులు దండెత్తెను. దేవాలయములను పడగొట్టెను గోపురప్రాకారములను విధ్వంసముచేసెను. పట్టణములను నాశనము గావించెను. స్త్రీలనక పురుషులనక పెద్దలనక పిన్నలనక నందరును హింసించెను.

సోమనాథ దేవాలయము భారతదేశములోనున్న దేవాలయము లన్నింటికంటె ధనవంతమైనది. గజనీ మహమ్మదా దేవాలయముపై దండెత్తి దానిని నేలమట్టము చేసెను. శివలింగమును విధ్వంసముచేసి దాని

యందున్న రత్నరాసులను తనదేశమునకు గొంపోయెను. ఈ దండ యాత్రలో పదవేలమంది రాజపుత్రవీరులు బలియైరని చరిత్ర తెలుపు చున్నది. ఈ దండయాత్రతో మనదేశము తీవ్ర సంక్షోభమునకు గురి యైనది.

గజనీ మహమ్మదు తరువాత మనదేశముపై మహమ్మదుఘోరి దండెత్తివచ్చెను. ఇతడతి క్రూరుడు - మతద్వేషి. హిందూమత మును నాశనము చేయవలయునని బద్ధకంకణుడైన మహమ్మదీయ రాజు లలో నగ్రగణ్యుడు. అన్యమత విధ్వంసము స్వమతవ్యాప్తి, వీనికొరకైన రాజ్యస్థాపనము నితని యాశయములు.

ప్రారంభమున పృధ్వీరాజుతో తలబడి పరాజితుడయ్యెను. సమైక్య ముగనున్న హిందూరాజులను జయించుట కష్టమని వారిని విభజించి వారిలో పరస్పర విరోధమును సృష్టించి జయచంద్రునిసాయముతో పృధ్వీ రాజునోడించెను. ఈ యుద్ధముతో భారతదేశము మహమ్మదీయ పరి పాలనలోనికి వచ్చెను. హిందువులకు మహమ్మదీయులకు ఘోరమైన మతయుద్ధములు జరిగినవి. భారతదేశమీయుద్ధములచే రక్తసిక్తమైనది, ఈ యుద్ధములలో ఎందరు వీరాధివీరులు మరణించిరో చెప్పశక్యముగాదు. ఢిల్లీనగరము కొరకు అనేక భయంకర యుద్ధములుజరిగినవి. ఈ నగరము ననేక పర్యాయములు మహమ్మదీయులుదోచుకొనుట, నాశనము చేయుటయు జరిగినది మతోన్మాదులైనవీరు నిర్దాక్షిణ్యముగ నిరపరాధులైన ప్రజలను ఊచకోత కోసిరి. కాలక్రమమున భారత ప్రజలు యవనపాలనమునకు అలవాటుపడి కష్టనష్టములను సహించుచు వచ్చిరి.

పదమూడవ శతాబ్దమునాటికి అల్లాయుద్దీన్‌ఖిల్జి ఢిల్లీ రాజధానిగ మన దేశమును పరిపాలించుచుండెను. ఇతనికి ఉల్లూఖాన్ అను నామాంత రము కలదు. ఇతడు తనకు కన్యనిచ్చి కన్నతండ్రివలెపెంచిన మామను

కూడ చంపిన మహాక్రూరుడు.

ఉల్లూఖానుని సామ్రాజ్యమునకు ముఖ్యపట్టణమైన ఢిల్లీనగరము పూర్వపు హస్తినాపురమువలెలేదు. నాటి దివ్యసౌధములు, గోపుర ప్రాకారములు, నిక్కుటములు, కోవెలలు, ప్రాసాదములు నేడు లేవు. నాటి ప్రభువులు ప్రజలు పట్టణములు, తన్నాగరికతా సభ్యతలు నేడులేవు. ప్రకృతి సృష్టివై చిత్రి వర్ణింపనేరితరము! అది అద్యంతములేని రస వత్తరమైన గొప్పనాటకమనదగియుండును. ఆ నాటకమును ప్రతివ్యక్తియు ననుదినమును సందర్శించి మహానందమును బొందుచు. ప్రతివస్తువు క్షణక్షణ పరిణామ శీలమైనది. ఇపుడున్నది రేపుండదు. దృశ్యపదార్థము నకు నిత్యత్వము కల్గించుట కల్ల పరిణామము ప్రకృతి స్వభావము. బంగరుపిచ్చికంబోలె నేడు సిరుల నలరు మనుజుడు రేపు బిచ్చ మెత్తు కొనువాడగును. సామాన్యమానవుడు సార్వభౌముడగును. రాజ్యములును వింతియ.

ఢిల్లీ దుర్గము సర్వజనులకు మహానందమొసగును. అనల్ప శిల్ప కళాసౌష్ఠవమున విలసిల్లు హర్మ్యములు, నగరలక్ష్మి నవ్యశోభ కల్పించు చుండెను. సామాన్య జనులకు వాసయోగ్యములైన భవంతులనేకములు కలవు, పుష్పవనవాటికలు దర్శనీయములు. పానయోగ్యములైన నీటిచే శోభించు సరోవరములు వేనకువేలు కలవు. ఆ సరోవరముల యందము అందలి పావంచల చందము, ఆందలి తమ్మిపూల బొకారము కనుగొని దిగ్భ్రమచెందని పాంథుడుండడు. దర్శన లాలసత్వము దిగ్భ్రమ జెందించుననుట కింతకంటె నిదర్శనమేమికావలెను?

భృంగగీతికారవమును మేళగించి చవులొలుకు పలుకుల గేలింతలు గొట్టు నా సరోవరములందలి జలవిహంగముల కలకలారవములు, నాపుష్ప వనవాటికలందలి కలకంఠకాకలీధ్వనులు శ్రోతల వీనులకు విందొనర్చు చుండెను.

# 5

ఢిల్లీయందేమందిరమున జూచినను నేప్రాంగణము వీక్షించినను నే కచ్చేరిని గనినను నే ప్రతోళికను పరిశీలించినను నేవంక తిలకించినను హిందూమత ద్వేషముట్టిపడుచుండెను. కుంచము నిండుగ కదుళ్ళను జొనిపినట్లు మహమ్మదీయులు ఢిల్లీ నగరమున క్రిక్కిరిసి కాపురము చేయుచుండిరి. ఆకాలమున సర్వరాజకీయ సాంఘిక సాంస్కృతిక కార్య కలాపములకు నా నగరము కేంద్రమై యలరారుచుండెను.

ఆ నగరమున నాంధ్రులు అల్పసంఖ్యాకులుగ నుండిరి ఎచ్చట చూచినను ఉర్దూ పారశీక భాషలు మిక్కిలి ప్రచారములో నుండెను. ఆంధ్రభాషకచట తావులేదు. అచటి ఆంధ్రులు హైందవ సంప్రదాయము లను నాచార వ్యవహారములను పాటించుచుండిరి. తమతమ యిండ్లయందు వారు స్వస్థాన వేషభాషాదికమును నిర్దుష్టముగ బోషించుకొనుచుండిరి.

ఆ దినములలో నా నగరమందొక పకీరు అనుదినము భిక్షాటనము గావించుచు నిగూఢవర్తనుండై బాహ్య జగత్తునకు వెలియైన సిద్ధునిం బోలె సంచరించుచుండెను. తురుష్క ప్రపంచమునకు పకీరులు గురువు లనుమాట సర్వవిదితమైనదే ప్రతి మహమ్మదీయుడు పకీరులంగని ప్రాణము వదలును. వారి భక్తి విశ్వాసము లనిర్వచనీయములు. గురూపదేశ వాక్యములను మహమ్మదీయులు తారక మంత్రములుగ మన్నింతురు.

మహాత్ములు గూఢవర్తనులై దేశరక్షణకు పెక్కు ప్రయత్నములు చేయుదురు ప్రచ్ఛన్న వేషములు వేయుదురు. ఖడ్గము కంఠము పై పడుచున్నను కార్యదీక్ష విడువరు అనుసరించుకార్యమును కడముట్ట నొనర్చుట వారిపని. వారికదియే గమ్యస్థానము.

ఒకనాటి ప్రొద్దుపొడుపున నా పకీరు ప్రాతఃకాలకృత్యములు దీర్చి తానున్నలోగిటి బయటి యరుగుపై ముదముతో నటునిటు పచార్లుచేయు చుండెను. ఆ లోగిలి పకీర్లుమాత్రముండుటకు నిర్మింపబడుటచే నందన్యు

లెవ్వరును కన్పడుచుండుటలేదు. ఆ భవనము పెద్దమసీదు ఆవరణలో నున్నది. ఆవసతిగృహమునందనేక గదులు కలవు. రెండు గదులు మాత్రము మన పకీరు స్వాధీనమునందుండెను. అందొకదానియందు తానుండెను. మరియొకదానియందాతని వస్తుసామగ్రి కలదు. పకీరు సింహాసంహానుడు గాకుండినను పదిమంది మెచ్చుకొనదగిన చక్కని పొందికలున్న దేహాపుష్టి కలవాడు. శోయగము కొంత లేకపోలేదు. ముత్తముమీద జనాకర్షణీయమయిన వర్చస్సు కలవాడు. కండలుదేరిన శరీరపుష్టికలవాడు అతని దేహమంతయు కావిరంగు లుంగీచే నాచ్ఛాదింపబడుటచే మొగముచూచి చామనచాయ మేని గలవాడని తలంప వచ్చును.

ఆనాటి ప్రొద్దుపొడుపు నీరెండకాంతి పకీరుకావిరంగు కంచుకమునకు మరింతశోభ నొనగూర్చుచుండెను. ఆతని కంఠమున లింగోడి పూసల తావళము గలదు. అందుకొలికిపూసగ గూర్చిన స్ఫటికము తళతళ మెఱయుచుండెను.

అట్లాతడు బయట యరుగుపై కొంతపచార్లుచేసి తనకుసలాములు చేసినవారికి సలాములు చేయుచు నరుగుదిగి భక్తిపురస్సరముగ మసీదు నకుబోయి నమాజొనరించి తిరిగి యందుండి వెడలి భిక్షాటన కాయత్త పడుచుండెను. ఆతని చేతులందు త్రిప్పునపుడు కిఱ్ఱుకిఱ్ఱుమను గుళ్ళ రాట్నమొకటియు సొరకాయదొప్ప యొకటియు కలవు దాని భావ ప్రచారమున కెందును నాటంకములేదు. అందువలన నిరాటంకముగ వెళ్ళగల ప్రాభవమును గడించెను. క్రొత్త యేమాత్రమునులేదు. నోరు మంచిదైన నూరు మంచిదికాకుండునా!

ఆ పురి బికారి మొదలు సుల్తానువరకు పకీరును అల్లాతో సమానునిగా భావించి పూజింతురు. జంకుగొంకులేక నాతడెల్లెడ తిరుగు

చుండును. ఆ గుణనిధి భావ ప్రపంచము నిరుపమానము. వ్యూహ నైపుణ్యము అనన్యము. "స్వదేహరక్షణాచ్ఛ్రేయః స్వదేశస్య చరక్షణమ్మను'' శ్లోకార్థమాయన మనోదర్పణమున ప్రతిబింబితమై యుండెను. వేయేల అతని శరీరమందలి ప్రత్యంగము ప్రతిజీవకణము దేశసేవకంకితమైయుండెను.

ఢిల్లీయందు రాజవీధి ప్రక్కనొక యోడల మఱ్ఱి కలదు. పది దుక్కుల వర్షము కురిసినను నందు చినుకుదిగదు, చలిదూరదు, ఎండ కాయదు. ఆ మఱ్ఱిచెట్టుక్రింద కొందఱు నిఱుపేదలు కలరు కట్టా కలిచే తొట్రిలు పిల్లలును, పిల్లల నోదర్చుకంపిల్లుదల్లులును, పిల్లల తల్లు లంగని చింతిల్లుచు చింపిరిగుడ్డలతో జోలె దగిలించుకొని తిరిపెమునకు వెడలు బిచ్చగాండ్రు నా చెట్టుక్రింద గలరు.

ఒకనాడు మన నకీరు కిఱ్ఱు రాట్నము త్రిప్పుచు నింటింట తిరిపె మెత్తుచు నందందు తిరిగి తిరిగి యా చెట్టుచెంతకు వచ్చి బక్కచిక్కిన డొక్కలు నూచకాళ్ళు నొదర పొట్టలు వెలవెలబారు మొగములుగల పిల్లలతో కట్టుగుడ్డ తినతిండిలేక నొక్కాకటపేమలమల మాడుచున్న దిక్కు లేని యా బక్కవారిని గాంచెను అంత పకీరుగుండె ఝుల్లుమనెను. జాలి చెందెను. కనులవెంట నశ్రుకణములు బొటబొట బడెను.

'అమ్మా! ఆకలి, బువ్వపెట్టుము' అని చిన్న కంచములు ముందు పెట్టి పోర్వెట్టు పిల్లల నోదార్చు తల్లుల మోములాయవి! అబ్బా! కత్తి గొట్టిన నెత్తురు రానట్లు వెలవెలబోవుచు దీనతగట్టి ఘట్టాడు చున్నది. పేరాకటచే తొట్రిలచున్న నా పిల్లలదల్లులెట్లోదార్తురు? వట్టియోదార్పుల వలన నాకలితీరునా? ఆ పిల్లల యవస్థగన్న గన్నవారికేగాక గన్నవారికెల్ల నుల్లము దల్లడిల్లక తొట్రువడకయుండునా? వారి యేడ్పుజెలుగుచెవింబడిన నెవరి మానసము తల్లడిల్లకుండును? పకీరు వారి సంకటములకు దుఃఖా

క్రాంతుఁడై నిట్టూర్చి యిట్లని తలపోసెను.

"అహో కష్టం, కష్టతరం క్షుదా" యనునట్లు ఆకలి కంటె మించిన కష్టము లేదుగదా! ఈశ్వరా! నీకీ పక్షపాతమెందులకు? పిల్లలు కలవారి కన్నము, నన్నము కలవారికి పిల్లలు లేకుండ జేయుటెందులకు? ప్రజ లందరు నీ కుటుంబములోనివారుకారా? యిది యన్యాయము కాదా? లేక నీకు స్వాతంత్ర్యము లేదా? ఆపదోద్ధారకుడవుగావా? దిక్కుమాలిన బీదల కష్టముల గనుచు నుపేక్షించుట నీకు ధర్మమా! నీ సనాతన బిరుదము లన్నియు నిష్ప్రయోజనములుగావా? నీపనిని భక్తులెట్లు సమర్థింపగలరు? వీరి యాపదలకు విముక్తిమార్గమును జూపి రక్షింపుము. కొంచెము విదారించి....

ఔరా! దీనిని తత్వవేత్తలు కర్మానుభవమందురు. ఈ కర్మ సిద్ధాంతము బహు విచిత్రమైనది. దాని స్వరూప స్వభావముల గుర్తింప వేధాంతులకే తరముగాదు. దుష్కరము. దుస్సహము. ఈ కర్మసిద్ధాంత ప్రధానసూత్ర పరిశోధన నొక హేతువాదియే చేయగలడు. కర్మచే ప్రజల కెట్టిగతి పట్టెననుమాట పిరికిపందల నెడిమాట. పూర్వజన్మ కర్మము ననుసరించి ఈ జన్మ జరుగుచున్నచో ప్రజలు క్రొత్తగ కర్మజేయుటెట్లు? కనుక ఆగామి - సంచిత - ప్రారబ్ధ కర్మలు అగ్రకులములవారు క్రింది కులాలవారి వాకట్టునకు తమ స్వార్థమునకు సృష్టించిన దుస్తంత్రమిది. ఈ సిద్ధాంతము దేశప్రజలయందు ఆత్మవిశ్వాసమును నిర్మూలించి వారిని నిర్వీర్యులను గావించుచున్నది. దీనిచే ప్రజలు జావిసలగుచున్నారు. వీరి దైన్యమును, అజ్ఞానమును నే సాంఘిక చైతన్యమో, ఆర్థిక విప్లవమో సాంస్కృతిక జాగృతియో నివారింపవలెనుగాని నావంటి యొక వ్యక్తి వలన నేమగును! అని కొంతతడవు విచారించి నిర్ఘాంతపడి వారి పుట్టు పూర్వోత్తరము లరసి బాధనొందు బిడ్డల బుజ్జగించి వారికి కొంతపైక మిచ్చి తిరిగి రాజవీధిని బోజొచ్చెను.

పకీరు హృదయము వెన్నకన్న సున్నితమైనది. వట్టిమాటలతో ప్రయోజనమేమి? సత్కార్మనుష్టానము సర్వోత్కృష్టమైనది. ప్రతి వ్యక్తికిని శీలము ప్రధానమైనది. దీనిమించిన ధర్మము ప్రపంచమునలేదు. వేయిమాటలేని నొక సత్కార్మకు సాటిరావు.

ఆ మహమ్మదీయ గురువట్లు కిఙ్ఞు రాట్నము త్రిప్పుచు పెనువీధి వెంటబోయి భిక్షాటనము చేయుచు నొక పేదయింటి గుమ్మముకడ నిల్చెను.

అంత పూర్ణచంద్రుడు బక్కచిక్కిన దేహముతో వంగిన నడుముతో, కఱ్ఱనానుకొని యోపికలేని అడుగులతో దగ్గుతో బారెడు దూరము నడచి బిచ్చము పెట్టుడని యడ్డుగు పకీరుచెంత నిలిచెను.

పూర్ణచంద్రు డాయింటి యజమాని. అతడు దారిద్ర్యముతోపాటు జరాకష్ట మనుభవించుచుండెను. వార్ధక్యము మిక్కిలి దుర్భరమైనది. అతని కనుబొమలుకూడ నెంసినవి. తల వణకుపటినది. వాని యొడలి నరములు ప్రస్ఫుటముగ కనవచ్చుచున్నవి. దేహమునందలి యెముకలను చక్కగ లెక్కబెట్టవచ్చును. ఆ ముదుసలిని గాంచి పకీరిట్లనియె.

పకీ:- అయ్యా! మీరెవ్వరు? మీ యిండ్లు వాకిండ్లు బీదతనమును సూచించుచున్నవి. కూడుగుడలేక పిల్లలు నలిగిపోవుచుండిరి. ఈ హైన్య దశకు కారణమేమి?

పూర్ణ:- అయ్యా మేమాంధ్రులము. తమ కనేక సలాములు చేయుచుంటిని. మా సంకటములగని జాలిపడ్డు తురకవారినిగాని, పకీరులనుగాని మేమింతపరకెఱుగము.

పకీ:- ఏమిది? మీరీనగరమున నెంతకాలమునుండి కాపురము చేయుచుండిరి.

పూర్ణ:- మేము చాలకాలమునుండి యిందున్నాము. మా తండ్రి కాల మున నిచ్చటికి వచ్చినట్లు వినియుంటిని. ఆయన పదెకరముల కొంత్ర సంపాదించి యిల్లు వాకిలి దొడ్డి కల్పించి తగిన యిస్తువస్తు వాహనము లేర్పరచి మమ్మ సుఖముగ పోషించెను. ఆయన హయాములో నేకష్టమును లేకుండ సుఖముగ బ్రతికితిమి. అప్పుడు మాజోలి కెవ్వరును వచ్చెడివారుకారు. ఆ కాలము వేఱు ఆ నవాబులువేఱు. ఆనాడు కులమత ద్వేషములు లేవు. హిందువులపాలిట మృత్యు దేవతలప్పుడు లేరు

పకీ:- తాతా; మతద్వేషములనుచుంటివి. ఉల్లాఖానుని పాలనలో మత ద్వేషములుకూడ గలవా. ఆ మత ద్వేషములబాధ నీవరకు వచ్చినదా?

పూర్ణ:- అబ్బో! మతద్వేష మింతని చెప్పుటకు వీలులేదు. తరతరాల నుండి కరడుగట్టిన యీ మతద్వేష మీ మహమ్మదీయులలో నర నరాలలో జీర్ణించుకొని పోయినది. ఆబాధ మీ కేమని చెప్పను? పెంటకుప్పల మొలిచెడి పుట్టగొడుగులవలె మాయదారి గడేకారుల జట్టు బయలుదేరినది. పదేళ్ళనుండి వారు హిందువులపట్ల చేయు నల్లరి, పెట్టెడి కజ్జాలు చెప్పదరముకాదు. ఆ! ....యని వారిని గద మాయించువారులేరు.. ఆ కొంటె కొయ్యలాడి నవేయాటలు పాడినవే పాటలు. వారి కాటంకములేదు.

పకీ:- మతద్వేషము పరాకాష్ఠ నందుకొన్నది. మతమనేడిది వట్టి మోసము. మతము మానవజాతి పురోగతికి అడ్డుగోడ. మతాలను సమూలముగ ధ్వంసముచేసినగాని మునవజాతికి వికాసము కలుగదు. మీ కష్టములతోపాటు ముదిమి కూడ ముదిరినది. మీకు చేతికందిన వారైన కలరా?

పూర:- బాబూ! మేమిద్దరమన్నదమ్ములము. ఆ వచ్చెడి రామచంద్రుడు

నాతమ్ముడు. మాకు పదిమంది పిల్లలు గలరు. కాని యిందొకడు దప్ప కై కందినవాడు లేడు.

పకీ:- అయ్యో! మీ పొలమందు పంటలులేవా?

పూర్ణ:- నాయనా! లేకేమి. కొలదిగ పండుచున్నవి. కాని పొలము పండినది యింటికి వచ్చుటగాని, యింటికి వచ్చినది అనుభవించుట గానిలేదు

పకీ:- ఎందుచేత?

పూర్ణ:- ఎందుచేత యందురేమి? పైన చెప్పిన కొంపెవెదవలచేతనే మా కొంపలు గుల్లలైనవి. పైగ జిజియాపన్ను-కత్తులపన్ను - ఒక టేమిటి! పన్నులచే కొంప గుల్లయగుచున్నది. ఈయదరుద్రాప్తి మాకు దీరినది, వీరిపొత్తున బ్రతకలేము. ఎక్కడకైనబోయి యేదో రీతిని జీవింపగోరుచున్నాము.

పకీ:- ఈ యరాచకములవల్ల ఈ పన్నులవల్ల మీకు కలుగుచున్న నష్ట కష్టములనుగూర్చి సుల్తానువారికి మీరు విన్నవించుకొనలేదా? అతడు మంచివాడేకదా!

పూర్ణ:- అతని మంచి మన్నైనది. అతనికున్నంత మతద్వేషమే సుల్తానుకునులేదు ఆయన సింహాసన మెక్కిననాటినుండి మాకీయాప దలు ప్రాప్తించినవి. మత ద్వేషములు విజృంభించినవి. పెక్కుసార్లు అర్జీలిచ్చుకొంటిమి. ఆలన పాలన లేదు.

పకీ:- ఉల్లూఖానున కాంధ్రులనిన యిష్టములేదా?

పూర్ణ:- ఇష్టమో గిష్టమో నేనెరుగనే. ఆంధ్రులపేరువిన్న భగ్గున మండును. ఆంధ్రులతని కంటికి బావిసలుగ కనపడుచుందురు. మా

జోటి మహమ్మదీయేతరుల నతడు పెట్టు కష్టాలు చెప్పశక్యముగాదు

పకీ:- ప్రభువైన ఉల్లాఖానునకు మతద్వేష ముండుట కేవల మన్యాయము. పాపము. మిమ్మతడు మిక్కిలి బాధపెట్టునట్లు తోచుచున్నది ఒకసారికాకున్న నొకసారియైన మిమ్మాదరించలేదా?

పూర్ణ:- ఆదరింపకపోయినమానె. పన్నెత్తి మంచిమాటకైనా నోచుకొననైతిని. అతని పరిపాలనయందు పరమత ద్వేషము మెండు.

పకీ:- మంత్రియభిప్రాయమెట్లున్నది?

పూర్ణ:- యథారాజా తథా మంత్రి, అందరొకబాటనే నడుచుచున్నారు. వారి కచేరీలు వారి సభలు, వారిపాన గోష్ఠులేమోగాని మనగొడవలేదు. ఆ కచేరీలయందు ఆంధ్రులడుగుపెట్టినదే తడవుగ తురక బంట్రోతులు పోపో అని వెన్నంటి గెంటుదురు. అంత గుడ్లనీరు గుడ్ల గ్రుక్కుకొని కచేరీలకు పోవుట తప్పని చెంపలు వేసికొను యిటబడి క్రుళ్ళిక్రుళ్ళి యేడ్చుచుంటిమి. మంత్రులకు సేనానులకు పట్ట పగ్గాలు లేకున్నవి. ఓరుగంటి మహారాజుగారిమీద లడాయికి కాలుదువ్వుచుండిరి. యుద్ధము త్వరలో రావచ్చును. నగరమల్లకల్లోలముగ నున్నది. సైన్యములు సిద్ధముగ నున్నవి.

పకీ:- పోనీ .. రాజకీయములు మనకెందుకు?

పూర్ణ:- అయ్యా! మీరు మంచివారు గనుక మీతో మనవి చేసితిని. ఎక్కడ వెల్లడి చేయకుడు. సభలు జరుగుచున్నవి. రస్తు గిస్తు తయారగుచున్నది వచ్చెడి సైన్యమునకు దిగెడి సైన్యమునకు అంతులేదు. సైనికులు కయ్యావుదుస్తులు దులుపుచు కత్తులు కటార్లు నూరుచున్నారు,

పకీ:- అట్లయిన తప్పక యుద్ధము జరుగును. ఈ యుద్ధ సమయ

మందు మీరిచట నుంకట క్షేమము కాదు.

పూర్ణ:- అందుకు సందేహము లేదు. మాగతి యేమి కానున్నదో.

ఃకీ:- ఈ సమయమందు మీరెక్కడను౦డి బ్రతుకలేరు. మీరు మహమ్మ దీయుల బారినుండి విముక్తినొందు మార్గము తెలిపెదను అంగీక రించెదరా?

పూర్ణ:- అంతకంటెమాకు బావలసినదేమి? క్షేమముగ బ్రతుకవలెనుగాని యెక్కడికైనను బోయెదము. ఈ కత్తులబోనునుండి తప్పించిన చాలును.

పకీ:- మంచిది గతించిన విషయములను గూర్చి చింతించిన ప్రయో జనము లేదు. మీ మాటల వలన మీ కష్టములన్నియు బోధపడి నవి. మీకు తగిన సదుపాయములను చేసెదను. మీరు ఓరుగంటికి వెళ్ళెదరా?

పూర్ణ:- అయ్యా! బ్రతుకుదును. అనుగ్రహించండి దారిఖర్చునకు చేత నొక కాసైనను లేదు తమదయ.

పకీ:- విచారపడవద్దు - దారిఖర్చులు నేనిచ్చెదను.

అని కొంత పైకమిచ్చి యాదరపూర్వకముగ కొన్ని రహస్యములు చెప్పి యొక యుత్తరమును వ్రాసియిచ్చి పకీరు తనదారిన బోయెను. పూర్ణచంద్రుడు తనవారితో నోరుగంటకి పయనమైపోయెను

స్వసుఖ వృద్ధికి నన్యుల స్వాస్థములను
భగ్నమొనరించి పొగరెక్క ప్రల్లదంబు
లాడు కుక్షింభరాళచర్యా విధాన
మార్యపుత్రక లోక విద్యంబుగాదె.

ప్రొద్దుప్రొద్దున లేచి జుట్టుదువ్వి బొట్లుపెట్టి క్రొవ్విన యెదళ్ళతో క్రొద్వేసములతో "జయ్‌సీతారామ్" అనుచు తుంబుర మీటుచు, హరి నామ సంకీర్తనము చేయుచు మరికొందరల్లాయల్లాయని స్మరించుచు పకీర్లయి కొందరు బహువేషములతో నూరూర నింటింట తిరిగి తిరిగి తిరిపెమ్మెత్తుకొను జావించు కుక్షింభరులు పెక్కుమంది నాడు కన్పించెడి వారు.

ఆ కుక్షింభరుల యందనేకుల కుండేలు బద్దలు మట్టియుండలు నాయుధములు. గూండ్లకేగు పిట్టల జంపుట వీరిపని త్రాగి గంతులు వేయుట వీరి యాచారము ఈ తాంత్రికులకు రక్షరేకులు వేయుట తాయెత్తులు కట్టుట మున్నగునవి ధనాకర్షణ మార్గములు, దయ్యములను వదలించెదమని సంతానము కల్గించెదమని రజ్జులాడి కల్లకపటమెఱుగని గృహస్థులవద్ద ధనము గుంజెడివారు విసూచి మసూచి మొదలగుకంటు వ్యాధులు వ్యాపించినప్పుడు క్షుద్ర దేవతారాధనతో వానిం పోగొట్టెదమని కల్లలుచెప్పి విత్తమార్జించుట వారి వృత్తి. ఊరడమ్మ, మారెమ్మ, మద్ద రామమ్మ. మైసలమ్మలకు జాతరలు చేయుట వారి ఆచారము. ఇవిగాక దేవునిపేరిట మతముమహత్తులపేరిటధనము గడించి భోగలాలసత్వమున కలవడి యుండిరి.

కాని మన పకీరట్టివాడు కాడు. యోగి, స్వార్థత్యాగి. దిక్కులేని బీదలకాతని కరుణ జీవగఱ్ఱు. సహృదయుడు. పౌరులెల్లరతని వాక్య మును ఖురాను వాక్యముగ భావించి గౌరవింతురు. మహైశ్వర్యవంతులు సైతమాయనకప్పనములిచ్చెదరు. అతడొకనాడు బిరబిరరాట్నముత్రిప్పుచు నొక రహస్య మందిరము ప్రవేశించెను. అందు తురక లెవ్వరునులేరు. ఇర్వురాంధ్రులు మాత్రము కలరు. వారిద్వరు పకీరొచ్చునని కాబోలు భోజనము సేయక అతని రాకకు ప్రతీక్షించుచుండిరి. పగలు రెండుజాము

లైనది అట్లు ప్రవేశించిన పకీరును చూచినంత మహోల్లాసముతో వానిని లోపలి గదిలోనికి తోడ్కొనిపోయి ఆసనముపై చి యందాతని నుపవిశింజేపి యిష్టాగోష్టి మాట్లాడజొచ్చిరి, అందిర్వురిలో నొకడు జనార్ధనుడనువాడు. ఇతడు కొన్నాళ్ళుగ ఢిల్లీయందు వర్తక వ్యాజమున నివసించుచుండెను. అశ్వరత్నముల రత్నముల క్రయవిక్రయాదు లొన రించుచు పెద్దపేరు గడించెను. ఆతనిని తురక లెల్లరు బేహారీ యని పిలుతురు. ఇతని వర్తకము విరివిగ సాగుటచే కొందరు మహమ్మదీయ ప్రముఖుల కప్పిచ్చుచు, కొందర్నుండి తాను గ్రహించుచు మిక్కిలి నమ్మకముగ మహమ్మదీయులకు తలలోని నాల్కయై మెలగుచుండెను. పకీరు జనార్ధను లిర్వురు గుణసంపన్నులు. దేశసేవా దురంధరులు!

అట్లు తన యింటి కతిథిగ వచ్చిన పకీరునుజూచి జనార్ధను డిట్లనెను. "ఆంధ్రుల యింటికి పకీరు లతిథులట, వచ్చి కూర్చుండి రట ఇంతకంటె చిత్ర మెచట నుండును. అంత పకీరు " మీవాక్య ములు భావగర్భితములు.

జనా;- పోనీ యికపై యుక్తి పుట్టుచునేయుండును. వీనికేమిగాని తమ నిజస్వరూపము పౌరులకు తెలియనున్నది?

పకీ;- తెలిసినవారు మీరుండిరికదా! కొదువ యేమి?

జనా;- అగునగు! నిశ్చయమే వేళ యతిక్రమించుచున్నది, భోజనానంత రము మాటాడవచ్చును.

లెండని వారిని తోడ్కొని జనార్ధనుడు భోజనశాలకు పోయెను. పిమ్మట వారుభయులు భోజనము గావించి యొక తిన్నెపై కూర్చుండి యిట్లుమాటాడదొడగిరి.

పకీ;- జనార్ధనా! ఉల్లూఖానునకు మతద్వేషము పెరిగి పోవుచున్నది. మొన్న మనమనుకొన్న మాటలు సత్యములే. ఇందు నివసించెడి

యాంధ్రులకు తటస్థించిన యవస్థలకెల్లను సుల్లాఖానుడు కారకుడు. వారి పొలముల పండిన పంటను దక్కనీయకుండుట, యింటగల వస్తువాహనములను తస్కరించుట మొదలగు తుంటరి పనులొనరించి చిక్కులబెట్టు దుండగీంద్రకు సల్తాను ప్రోత్సాహము కనదట. మరియు వారి విన్నపములు వినక మండిపడుచు పందలకొలది యాంధ్రులను తమ భూములనుండి వెడలగొట్టించినాడట. ప్రభువునకు మతద్వేషముంటకంటె వేఱొండు దుర్గుణము కలదా!

జనా:- అతనికా దుర్గుణము పూర్తిగా కలదు. హిందూమతద్వేషము నాతడుగ్గుపాలతో స్వీకరించెను. అదియింతకంతకు ముదిరి పాకమున బడుచున్నది.

ముదరనీ, ఎవరికేమి భయము?

పకీ:- భయమనికాదు, అతని యెత్తులు చాల విపరీతముగ తోచుచున్నవి. అవి యింకను క్రక్రమముగ తెలియదగియున్నవి.

జనా:- అందుకుగదా బేహారి నయితిని.

పకీ:- నేనుమాత్రమూరకే పకీరునైతినా!

అని యిట్లుభయులు సల్లాఖానుని మతోన్మాద చర్యలను దుర్గుణములను ప్రస్తావించి కొంత సమయము గడిపిరి, వారి సంభాషణల యందు కొన్ని రహస్యములు గలవు. పిమ్మట పకీరు జనార్దనుని యనుమతిగొని యా మందిరము వెడలి విపణివీధివెంట కొంతదూరము నడచి జనసమూహమునుదాటి నెమ్మదిగ మసీదు వీధికి వచ్చి తన విడిదియందు ప్రవేశించెను

పకీరు జనార్దనుని మందిరమునకు వెడలుటయు మరలుటయు కొందరు మహమ్మదీయులు చూచిరి. కాని యనమానపడలేదు. అప్పటికే

చీకట్లు క్రమ్మసాగివవి. వీరిర్వురి వర్తనము మహమ్మదీయ ప్రపంచమున నింకను అజ్ఞాతమే.

ఆంధ్రులతిప్రాచీనులు. వీరి ప్రసక్తి ఐతరేయబ్రాహ్మణమునందు కూడ కలదు. రామాయణ భారతాది మహాకావ్యములలోను, హరివంశాగ్న్యాది పురాణములందును వీరి శౌర్యపరాక్రమములనుగూర్చి వర్ణింపబడినది. మహాభారత యుద్ధములో ఆంధ్రులు సుయోధనుని పక్షము వహించి ఘోర సమరము గావించినట్లు మహాభారత కథనము. మహాభారత కాలమునాటికి వీరు యమునానదీ తీరమున నివసించియున్నట్లు చరిత్ర తెలుపుచున్నది. క్రీ॥ పూ॥ 700 సంవత్సరములనాటికి కొన్ని యాంధ్ర కుటుంబములు యమునానది తటమున సాళ్వదేశములో నివసించుచున్నట్లు ఆపస్తంభ గృహ్య సూత్రాలు జలద గంభీరస్వరముతో నుద్ఘాటించుచున్నవి.

క్రమముగ నాంధ్రులు దుర్భేద్యమైన వింధ్యపర్వత పంక్తిని వెనుకనెట్టి పంచాస్యలిన్యేభ సంకీర్ణప్రస్ఫురుద్దండ వనాళిదాటి ప్రావృట్సమారంభ బహుపయస్యంపూర్ణ దుర్లంఘ్య నిర్ఘరులతిక్రమించి దక్షిణాపథమున కాలిడిరి. బౌద్ధజాతక కథలుకూడ నీవిషయమును స్థిరపరచుచున్నవి.

దక్షిణాపథమునకు వచ్చిన యాంధ్రులు తత్పూర్వమే దాక్షిణాత్యులైన ద్రవిడ నాగ యక్షాదిజాతులతో సంబంధ బాంధవ్యములేర్పరచుకొని వారితో కలిసిపోయిరి. ఆంధ్రుల యాచార వ్యవహారములు దాక్షిణాత్యుల యాచారవ్యవహారములతో సమ్మిళితమయ్యెను. నేటి యాంధ్రనారీమణులునాగులచవితినాఁ పాముపుట్టలో పాలుపండ్లువిడుచుటయాచారమైయున్నది. ఇది నాగజాతినుండి మనకు సంక్రమించిన యాచారము. నాగులు బౌద్ధులు. సర్వసమానత్వము పౌరభ్రాతృత్వము మొదలైన

యుద్ధాత్త ధర్మములు వీరి లక్ష్యములు. వీరి జాతి చిహ్నము సర్పము.

యక్షులు సింహలాంఛనులు. యక్షరాజైన కక్షీరకు క్రీ॥ పూ॥ నాల్గవ శతాబ్దమున నాంధ్రదేశమేలినట్లు కొన్ని శిలాశాసనములు కలవు. యక్షులాదిమ జాతివారు. వీరును బౌద్ధులు ద్రవిడ జాతిలో ముఖ్యులైన తెలుగువారు ఆంధ్రులిచటకు రాకమున్ను తెలంగాణా ప్రాంతమున నివసించియుండిరి. వీరి మాతృభాష తెలుగు. ఆంధ్రులది ప్రాకృతము. ఈ రెండుజాతుల సమ్మేళనముతో నీరెండుభాషలు నేనాడో సమన్వయ మొందియుండవలెను. తెలుగుల నాగరికత హరప్ప - మొహంజోదారో నాగరికతను బోలియుండును. వీరు విజ్ఞానవంతులై నగర నిర్మాణము గావించియుండిరి. నౌకా నిర్మాణనిపుణులై సముద్రయానమొనర్చి యీజిప్టు రోము చైనా మలేషియా సుమత్రా జావా బోర్నియా మొదలైన దేశములతో వ్యాపారము సాగించియుండిరి. తెలుగులు శైవులు. వీరి యధిష్ఠాన దేవత భద్రకాళి. వీరి సాంఘికాచారములు బహు విచిత్రములు - సర్పము నెమలి - సింహము మొదలైనవాటి నారాధించెడివారు. గంగానమ్మ పోలేరమ్మ మద్దిరామమ్మ మొదలగు క్షుద్రదేవతల నారాధించెడివారు. ఇవి నేటికిని కన్పించుచున్నవి వీరియందు వర్ణభేధములు లేవు.

ఆంధ్రులు తెలుగుదేశముపై దండయాత్రచేయలేదు. వీరు నివసించు యమునాతీరమున నార్థిక సాంఘిక రాజకీయ సంక్షోభము చెలరేగగ తెలుగు దేశములకు గుంపులు గుంపులుగ వచ్చిరి. ఇట్లు గుంపులుగ వచ్చిన మొదటి తెగకు ఆంధ్రవిష్ణువు అధినాయకుడు. ఆంధ్రవిష్ణువు కృష్ణామండలములోని శ్రీకాకుళము రాజధానిగ కొంతకాలమేలెను. ఆంధ్ర విష్ణ్వాలయము శ్రీకాకుళమున నేటికినిగలదు. ఇతడు శాతవాహన వంశీయుడు కాడు. ఇది క్రీ॥ శ॥ నాల్గువందల సంవత్సరములనాటి చరిత్ర.

మౌర్యులుత్తర భారతదేశమేలునాటికే ఆంధ్ర శాతవాహనరాజ్యము ప్రసిద్ధిలో నున్నది. శాతవాహనరాజులలో మొదటివాడు శ్రీముఖుడు. తరువాత వారైన కృష్ణుడు - మొదటి శాతకర్ణి యంత ప్రసిద్ధులుకారు. వీరు ప్రతిష్ఠానపురము (పైఠాక) రాజధానిగ రాజ్యము చేసిరి. వీరిలో శాలివాహను డుత్తర భారతదేశమునేలుచున్న యుజ్జయినీప్రభువు విక్రమార్కుని జయించి శకపురుషుడయ్యెను.

శాతవాహన రాజులలో ముఖ్యుడైన కుంతలశాతకర్ణి పాటలీపుత్రము (పాట్నా) పై దండెత్తి యారాజునుజయించి పెక్కు సంవత్సరములు పాలించెను.

శాతవాహన రాజులు తర్వాత తూర్పున బంగాళాఖాతమునుండి పడమర నాసిక్ వరకును ఉత్తరమున పాటలీపుత్రమునుండి దక్షిణమున సింహళము వరకును నైదువందల సంవత్సరములు భారతదేశమును పాలించి యీరాజులఖండఖ్యాతి నొందిరి

శాతవాహనుల యనంతర మిక్ష్వాకులు తలయెత్తి నాగార్జునకొండ యొద్దనున్న విజయపురి రాజధానిగ నేబదేండ్లేలిరి. వీరియనంతరము క్రమముగ విష్ణుకుండినులు పల్లవులు బృహత్ఫలాయనులు సాలంకాయనులు నాంధ్రదేశము నేలిరి.

వీరి తర్వాత చాళుక్యు లాంధ్రభూమి కధిపతులైరి. వీ రాంధ్రదేశీయులు - వీరిలో మొదటివాడు కుబ్జవిష్ణువర్ధనుడు. వీరికాలములో లలిత కళలు సాహిత్యము విస్తారముగ నభివృద్ధి నొందినవి. వీరికాలమున నాంధ్రులందరొకజాతియను భావము సాహిత్య రూపమున స్థిరపడినది. రాజరాజనరేంద్రుడు చాళుక్యులలో సుప్రసిద్ధుడు. ఈయన కాలమున సంస్కృతభారతము నన్నయచే తెనుగున కనువదింపబడినది. బౌద్ధమతము నశించి హిందూమతము విజృంభించినది. శైవము ప్రసిద్ధికెక్కె

నది. సాంస్కృతిక సమైక్యమునకు ఆంధ్రమున పునాదులేర్పడిన దీ యుగముననే. నన్నయ వంటి కవిమార్గ కవితననుసరించి మహాభారత రచన గావించుట వలన తత్పూర్వమే గద్యపద్యరూపముననున్న దేశి కవితా ప్రభావము తగ్గినది

చాళుక్యుల యనంతరము తెలుగు చోడులు రాజ్యమునకు వచ్చిరి. వీరిది మొదట రాయలసీమ. క్రమక్రమముగ వీరు తెలంగాణము సాగ రాంధ్రము నాక్రమించుకొనిరి. వీరి రాజధాని గుంటూరు మండలము లోని చందవోలు. చోడుల మూలపురుషుడు మల్లవర్మ.

ఈ చోడుల కాలముననే పల్నాటి యుద్ధము జరిగినది, ఈ యుద్ధ మునకు ముఖ్యకారణము రాజ్యకాంక్ష. ఈ యుద్ధములో తెలుగుజాతి కపార నష్టము వాటిల్లినది. ఇది శైవ వైష్ణవమత సంఘర్షణమనికూడ చెప్పవచ్చును. ఇట్లు మతయుద్ధముల చేతను, అంతఃకలహములచేత పరరాజుల దండయాత్రలచేతను నాంధ్రదేశ మపార నష్టమునకు గురి యైనది. సాహిత్యములో లలిత కళలలో నభివృద్ధి కుంటుపడినది.

వేంగిచాళుక్యుల పరిపాలన తర్వాత కాకతీయ రాజులే సుప్ర సిద్ధులు. కృష్ణా గోదావరీ మధ్య ప్రదేశమున దండకారణ్యము కలదు. ఈ దండకారణ్యమున నీశాన్యభాగమున హిండింబాశ్రమమొకటి గలదు. దీనికి క్రోశద్వయదూరమున హనుమగిరి (హనుమకొండ) కలదు. హను మడు - కొండడు నను నిర్వురు హనుమగిరి సమీపమున నొక కోటను నిర్మించిరి. వీరు శ్రీశైలారణ్యానివాసి యగు నొక కిరాతకరాజు సుపు త్రులు ఈ కిరాత రాజుపేరు యెఱుక దేవరాజు. వీనిని జయించి మాధవవర్మయను రాజొక రాజ్యము స్థాపించెను. ఇతడే కాకతీయులకు మూలపురుషుడని చారిత్రకుల యభిప్రాయము. ఇతని పుత్రుడు పద్మ సేనుడు వీరికి కులదేవత కాకతమ్మ. అందుచే వీరికి కాకతీయులను

పేరు కల్గెను కాకతీయులు దుర్జయ వంశ సంభవులు. వీరిలో చరిత్ర ప్రసిద్ధుడు మొదటి బేతరాజు. ఇతని రాజ్యమున కనేక బాలారిష్టములు వచ్చినవి. విరియాలవారి సహాయముచే దుర్బలస్థితియందున్న కాకతీయ రాజ్యము పునరుద్ధరింపబడెను. కాకతీయ రాజ్యమింకను ప్రారంభ దశ లోనే యున్నది. ఈ బేతరాజునకు భువనైక మల్లుడను తనయుడు కలడు. భువనైక మల్లుని కాలమున కాకతీయ రాజ్యమున గొప్పమార్పు లేవియు లేవు, ఇతడు పెక్కేండ్లు రాజ్యమేలి కటక పర్యంతము సామ్రాజ్య విస్తరణ జేసెను. ఇతడుమిక్కిలి పరాక్రమవంతుడు. పల్లి సాయర మండలము (కరీనగర జిల్లా) నాక్రమించుకొనెను. ఈ విధ ముగ కాకతీయ రాజ్యమతని కాలమున పశ్చిమోత్తర దిశలకు వ్యాపిం చెను. ఇతడు పెక్కు ధర్మకార్యములు చేసెను. ఇతడు తటాకోద్యాన దేవాలయ నిర్మాత. ప్రజల దారిద్ర్యమును పోగొట్టి కన్నబిడ్డలవలె నాదరించెను. కడుపులోచల్ల కదలకుండ పాలించెను. మహాకవి నన్నె దేవుడితనిని 'దారిద్ర్యవైరి' యని బహుగా ప్రశంసించెను.

ఇతని కొడుకుకాకతి ప్రోలరాజితని యనంతరము రాజ్యమునకు వచ్చెను. ఇతడు పిన్ననాడే రాజ్యాధికారమును స్వీకరించెను. ఇతడు బాలుడగుటచే నితని సేనాపతి జగద్దేవ దండనాధు డనుమకొండను ముట్ట డించి విఫలుడయ్యెను. ఇతడు చాళుక్య తైలపుని మంత్రకూటాధిపతి యైన గుండరాజును వీరుడైన గోవిందరాజును శూరుడైన జగద్దేవుని జయించి యాంధ్ర సామ్రాజ్యమును విస్తరింప జేసెను. ఇతడు మహా యుద్ధ ప్రియుడు. శిల్పము వాస్తువు ఇతనిచే పోషింపబడెను. అనేక దేవాలయములను కట్టించెను. ఓరుగల్లుకోట (ఏకశిలానగరము) నిర్మాత యితడే. బహు తటాక నిర్మాత. శివపూజా దురంధరు డయ్యును వైష్ణవ జైన మతస్థులను సమముగ జూచెను. వెలనాటిరాజుతో యుద్ధము

చేయుచు వీరమరణము నొందెను. ఈ విధముగ పశ్చిమ చాళుక్యరాజుల నోడించి కన్నడ సామ్రాజ్యమును ధ్వంసముచేసి తెలంగాణము నంతటిని యాక్రమించి మహాంధ్రసార్వభౌమత్వ స్థాపనకు కారకుడయ్యెను.

కాకతిప్రోలుని యనంతర మాతని తనయుడు ప్రభుత్వమును స్వీకరించెను. ఈ రుద్రమదేవునకు మొదటి ప్రతాప రుద్రుడను నామాంతరము కలదు. ఈతడు తన తండ్రి ప్రారంభించిన దిగ్విజయ యాత్రను ద్విగుణీకృతము గావించెను. కళ్యాణ కటకరాజును, దొమ్మ రాజును, మేడరాజును మేలగిదేవుడు మొదలైనస్థానికరాజులను జయించి విజయ దుందుభి మ్రోయించెను. పానుగల్లు-కందూరు-వర్ధమనాది దుర్గములను స్వాధీనపరచుకొని కాకతీయ సామ్రాజ్యమును విస్తరింపజేసెను. కందూరు రాజైన యుదయచోడుని తనయ పద్మావతీదేవిని వివాహ మాడెను. తన తండ్రి వెలనాటియుద్ధములో మరణించుటచే నందుకు ప్రతీకారముగ తనజైత్రయాత్రను వెలనాటిపైసాగించివిజయలక్ష్మి కనుగ్రాహి యయ్యెను. ఈభూపతి సంగ్రామమార్తాండుడయ్యును కరుణామయుడు ఇతని కాలములో కవిత్వము, సంగీతము, శిల్పము మొదలైన లలిత కళలను, వాణిజ్యము నభివృద్ధి చెందినవి. అనుమకొండను తీర్చిదిద్ది సర్వాంగ సుందరముగ జేసెను. అచట వేయి స్థంభముల దేవాలయమును నిర్మించెను. బహుతటాక నిర్మాతయై ఆంధ్రదేశమును సస్యశ్యామలము గావించెను ఇతడు నిరతాన్నదాత - విద్యారాజీవభవుడు. సంస్కృతమున నీతిశాస్త్ర గ్రంథము వ్రాసెనని సుకృత శతకకర్తయైన బుద్ధభూపాలుడు పేర్కొనెను. ఇతడు సంతాన హీనుడు. తుదకితడు మహావీరుడయ్యు దేవగిరి రాజైన జైతుగి చేతిలో వీరమరణము నొందెను. రుద్రదేవరాజు సోదరుడు మహాదేవరాజు దేవగిరి రాజుపై దండెత్తియు సోదర మరణము వలన ప్రతీకారమును సాధింప లేక

పోయెను.

మహాదేవరాజు పుత్రుడైన గణపతిదేవుడు కాకతీయ రాజులలో నగ్రగణ్యుడు, సుదీర్ఘకాలమా మహాప్రభువు మహా వైభవముతో కాకతీయ రాజ్యమును పాలించెను. ఇతని కాలములో సామంతరాజులెదిర్చిరి. వీరినణచి సామ్రాజ్య విస్తరణకై జైత్రయాత్ర చేసెను. దానిని సైనిక బలముతోనేగాక వివాహ సంబంధ బాంధవ్యములతోకూడ దృఢ తరము గావించెను. తన ప్రథమ పుత్రిక రుద్రమాంబను వేంగి చాళుక్య వంశజుడైన వీరభద్రరాజునకిచ్చి గోదావరీ ప్రాంతమును తన రాజ్యములో కలుపుకొనెను. కమ్మనాటి ప్రభువైన జయపసేనాని సోదరీ మణులను వివాహమాడి కృష్ణా మండలమును తన స్వాధీనము చేసికొనెను. జయప సేనానిని గజసైన్యాధ్యక్షునిగ నియోగించెను. మదిర ప్రాంత రాజైన రుద్రరాజునకు తనసోదరియైన మేలాంబిని నిచ్చి వివాహము చేసి యా ప్రాంతమును తనరాజ్యములో కలుపుకొనెను. రాయలసీమపై దండెత్తి గంగయసాహిణియనునా ప్రాంతపురాజు నోడించి యాతనిని సామంతుని గావించెను. గండికోట, రేనాడు, పలికినాడు పొత్తపినాడు మొదలుగ మొత్తము రాయలసీమనంతటిని తన స్వాధీనము చేసికొనెను. కళింగముపై దండెత్తి యా రాజునోడించి కటక పర్యంతము తన రాజ్యమును విస్తరింపజేసెను ఇట్లు శాతవాహనుల తర్వాత యావదాంధ్రభూమిని జయించి యేకచ్ఛత్రాధిపత్యము వహించెను అప్పుడే యావదాంధ్ర భావనాపీఠిక యాంధ్రుల నుజ్జ్వాత లూగించినది. కనుకనే దీనికి వాగ్రూపమిచ్చిన తిక్కన "ఆంధ్రావళి మోదముంబొరయ" నని భారత పీఠికలో సూచించినాడు. తిక్కన తనరాజు మనుమసిద్ధి జ్ఞాతులచే పోరున పరాజితుడు కాగ గణపతి దేవుని సాయముచే శత్రువుల నోడించి మనుమసిద్ధికి రాజ్యాధికారమిప్పించెను.

ఇతడు గొప్ప విజేత మాత్రమేగాక నిర్మాత కూడ. ఏకశిలా దుర్గనిర్మాణ మీతని కాలమున పూర్తియైనది. శిలా ప్రాకారమునకు లోపల నొక యిటుక గోడను కట్టించి కోటను దుర్భేద్య మొనర్చెను. ఈ కోటలో వెనుకభాగమున గొప్ప రాజ ప్రాసాదమునుగూడ నిర్మించెను నెల్లూరున నొక మహా తటాకమును నిర్మించెను. అనేక గ్రామములను స్థాపించెను. పెక్కు సుందర దేవాలయములను కట్టించెను. రామప్పదేవాలయ మిట్టివానిలో నొకటి ఈ యాలయమును పరిశీలించినచో కాకతీయ శిల్పకళాశైలి ప్రస్ఫుటమగును ఇతడు గొప్ప న్యాయబుద్ధి కలవాడు. దోషులైన శైవులను సైతము కార్ధాక్షిణ్యముగ దండించెను. గొప్ప సంస్కర్తయై సాంఘిక విప్లవమునకుమార్గము చూపెను. అన్నికులాల వారితో వైవాహిక సంబంధము లేర్పరచుకొనెను. జయపసేనాని కమ్మ వంశీయుడు. బేతరాజు తెలగ కులాలంకారుడు. రేచర్ల రుద్రుడు రెడ్డికుల భూషణుడు. ఆయుధజీవులై విక్రమశీలురైన వేర్వేరు కులముల నడుమ సహపంక్తి భోజనములకు ప్రోత్సహించెను. పరిపాలనలోకూడ వీరికి తగిన ప్రాతినిధ్యమిచ్చి నానామండలీకరగండ యను బిరుదము వహించినాడు. ఇట్టి మహా ప్రభువు దీర్ఘకాల మాంధ్రభూమినేలి తన పుత్రికయైన రుద్రమదేవికి రాజ్యాభిషేకము గావించెను.

తండ్రికాలముననే యీ వీరవనిత పురుషవేషమున యువరాజ పదవి నధిష్ఠించి కొన్నేండ్లు రాజ్య పరిపాలనానుభవమును గడించి రాజనీతి కోవిద యయ్యెను. ఆయినను నీమె తండ్రి పరోక్షమున రాజ్యమునకు వచ్చినది తడవుగ స్త్రీ పరిపాలన సహింపలేని కొందరు సామంతులు తిరుగుబాటు చేసిరి. సవతి కొడుకులైన హరిహరుడు మురారి దేవుడు యాదవులతో కుట్రపన్ని రుద్రమదేవిపై దండెత్తి వచ్చిరి. శౌర్యాటోప చండ ప్రచండులైన సేనానులచే వీరి నోడించెను. యాదవసైన్యములను

దేవగిరివరకు వెన్నంటి తరిమికొట్టి గడ్డిగగిపించెను, రుద్రమదేవి విజయ స్థంభముల నెలకొల్పి సైనికులకు బహుమతి ప్రధానము చేసెను.

ఈ రెండు సంఘటనలు దక్క ఈమె కాలంలో ప్రశాంతముగనే గడచిపోయెను. ఆమె అనేక ప్రజాహిత కార్యములు గావించెను. ప్రజా సౌకర్యమునకు బాటలు వేయించి దాని కిరుదెసల చల్లగ నుండుటకు ఛాయా వృక్షములను నాటించెను. సత్రములను కట్టించెను. పెక్కు గ్రామములనునిల్పి ప్రజల కితోధిక సాహాయ్యముచేసెను. ప్రజ అందరు నామెయందనురక్తులై యామెనంబాయని పిలిచెడివారు. ఈమె నిర్మించిన దేవాలయములకును త్రవ్వించినవాపీకూప తటాకములకును లెక్కలేదు. రాజధానియైన ఏకశిలానగరము ననేక విధముల సంస్కరించెను. అగడ్తను త్రవ్వించి కోటగోడలపై అనేక బురుజులను కట్టించెను. ఈ నారీరత్నమాంధ్రదేశము నంతయు నసమాన ధైర్య సాహసములచే పాలించిన యీ ఘట్టము మన చరిత్రలో నపూర్వమైనది.

## 2

రుద్రమ దేవికి పురుష సంతతి లేనందున ఆమె తన కూతురైన ముమ్మడమ్మ పుత్రుడును, తనదౌహిత్రుడునైన ప్రతాపరుద్రుని రాజ్యాభిషిక్తుని జేసెను. అతని విద్యాబుద్ధుల విషయమున రుద్రమదేవి శ్రద్ధ వహించి వివిధాయుధ విద్యలయందు పారంగతుని గావించెను విస్తార సాహిత్య పరిజ్ఞానము కల్గుటకు కావ్యాలంకార నాటక పరిచయము నొనగూర్చెను. రాజనీతియందు నిపుణునిగా జేసెను.

ప్రతాపరుద్రు డభిషిక్తుడైన వెంటనే గొప్ప విప్లవము నెదుర్కొన వలసి వచ్చెను. సామంతుడగు మనుమగండ గోపాలుడెదురు తిరిగి స్వతంత్రించెను. తన సైన్యముతో నితనినోడించి పాదాక్రాంతుని

గావించెను. గండికోట, సబ్బిమండల సామంతులు, కళింగాధిపతి మొదలైనవారు తిరుగుబాటుచేసిరి. కాకలుదీరిన తన సేనాపతులనుపంపి వారిని లొంగదీసుకొనెను. గోదావరి నుత్తరించి రామేశ్వరము వరకు గల తమిళ దేశమును తన వశము గావించుకొనెను మళయాళమునేలు కుంతలాదేవి నోడించి పదునాల్గువేల సువర్ణ టంకములను కప్పముగ గ్రహించెను. ఆమె సేనాసహాయముచే కేహణకొంకణ బానెళ్ళిక భూము లను గెల్చి పదిలక్షల బంగారు నాణెముల స్వీకరించెను పశ్చిమ దేశా ధీశ్వరుల గెల్చి వారిని తన యాజ్ఞ శిరసావహింపజేసి ఏబది లక్షల నిష్క ములు కప్పముగ పుచ్చుగొనెను. గుజరాష్ట్రి మహారాష్ట్రి దేశాధీశ్వరుల నోడించి వారిచే కప్పనముల గొనెను. ఈ విధముగ దక్షిణదేశ విశ్వం భరనొక గొడుగుక్రిందకి తెచ్చి కాకిచే కబురంపి కప్పముల దెప్పించి దండెత్తివచ్చిన మండలేశ్వరులనెల్లఁ బూరికెడి దాకా పొడిచి దుష్ట శిక్షణము శిష్టరక్షణము చేసి ప్రజానురంజకముగ పాలించెను.

రుద్రభూపాలుడు కళాపారంగతుడు మహాపండితుడు, విజ్ఞాని, లలితకళా పోషకుడు. కత్తి చేబట్టిన ఆంధ్రవీరులు కలము చేబట్టి సాహిత్యరంగమున ననితరసాధ్య విజయమును సాధించిరి, చిత్రలేఖన శిల్పకళారంగములందును వేదాంత జ్యోతిషాది శాస్త్ర విషయములందును వారనన్య సామన్య వైదుషీవిభవమును ప్రదర్శించిరి.

నిరోష్ఠ్య రామాయణము నుదారరాఘవము మున్నగు గ్రంథము లు రచించినశాఖ వెల్లి మల్లిఖార్జునభట్టు, ప్రతాపరుద్ర యశోభూషణ కర్త విద్యానాథుడు. బాలభారత రచయిత యగస్త్యుడు, మహాభారత మును నాటకీకావించిన గంగాధర కవి, కాదంబరీ నాటక కర్త నరశింహ కవి, సౌగంధికాపహరణ రచయిత విశ్వనాథుడు, జితేంద్ర కళ్యాణాభ్యు దయము వ్రాసిన జైనకవియగు నప్పనార్యుడు ప్రేమాభిరామము రచించిన

త్రిపురాంతకుడు - క్రీడాభిరామము వ్రాసిన వినుకొండ వల్లభాచార్యుడు మార్కండేయ పురాణము వ్రాసిన మారన, రామాయణము వ్రాసిన భాస్కరుడు ప్రతాపరుద్ర చరిత్ర వ్రాసిన యేకాంబరుడు నీ కాలమువారే.

ప్రతాపరుద్రుని ధర్మకార్యములు మిక్కిలి ప్రసిద్ధములు. పాకాల చెఱువును త్రవ్వించెను. మౌద్గల్యక్షేత్రమున రామేశ్వరాలయము కట్టించెను. దీని శిల్పకళా నైపుణ్యము సుప్రసిద్ధము. ఈ దేవాలయముపై సంగీత సభలు నృత్యకళా భంగిమలు చెక్కబడినవి జయపసేనాని నృత్తరత్నావళి యందలి నాట్యభంగిమచే యిందు శిల్పింపబడినవని పండితుల అభిప్రాయము.

ప్రతాప రుద్రుని జీవితము మిక్కిలి క్రమశిక్షణతో కూడికొని యున్నది ఇతడు బ్రహ్మ ముహూర్తమున మంగళ గీతికారవముతో మేల్కాంచి కాల్యముల నిర్వర్తించి పన్నీటజలకమాడి రమ్యాలంకృతుడై కొల్వునకు విచ్చేసెడివాడు. రాజదర్శనమునకై శాఖవెల్లి మల్లిఖార్జున భట్టు మొదలైన విద్వాంసులు, భాస్కరాది కవివతంసులు సమస్త కళా రాజీవభవులైన పండితోత్తములు, వివిధ దుర్గాధ్యక్షులు, దేశాధిపతులు, సర్వసేనాపతులు, డెబ్బదియేడు పద్మనాయక ప్రముఖులు రేదారరాజు, కేదారరాజు మున్నగు సాహస విక్రమార్కులను వీరీక్షించెడివారు. శివదేవయ్య శరభాంకుడు మల్లిఖార్జునుడు సూరప్ప మొదలైన మంత్రులతో రాజకీయాలు ముచ్చటించి కొల్వు సాలించెడివాడు. రాజ బంధువులతో నానా దేశాధిపతులతో పద్మనాయక ప్రముఖులతో సోదరుడు అన్నమదేవునితో కూర్చుండి వివిధములైన వంటలతో షడ్రసోపేత భోజనము గావించెడి వాడు.

తిరిగి మధ్యాహ్నము కొలువుకూటమునకేగి వ్యాఘ్ర భల్లూక గజ యుద్ధములను, మల్లయుద్ధమును, తిలకించెడివాడు. సరసకావ్య నాటకా

లంకార శబ్దాదిశాస్త్ర ప్రసంగములను, విజ్ఞాన ప్రసంగములను నవధరించెడి వాడు. విదూషక జనపరిహాస వాక్యముల నాలించెడివాడు. వారాంగనా నృత్యగీతవినోదముల దర్శించిడివాడు.

సాయంవేళ సమస్త పరివార జనముతో జ్యోతిర్మయమైన శంభు లింగమును దర్శించి పిమ్మట నగరి కేతెంచి ప్రజలకు దర్శనమిచ్చెడివాడు. అందు వారిన్యాయాన్యాయ విచారణ నడిపి పెద్ద తలారియైన విశ్శంక వల్ల భుడు మున్నగువారితో కొలువుగావించి తదనంతర మభ్యంతర వర్తి యయ్యెడివాడు.

ఈ రీతిని రాజభోగముల ననుభవించుచు కళా వినోదములతోను కేళీవిలాసములతో నుచితరీతిని కాలము గడుపు ప్రభువొకనాడు గోదావరీ సమీపస్థమైన మహారణ్యమునకు రుద్రుడు వేటకుబోయెను. వేటబృందము వీరి ననుసరించిరి. అందుకొందఱునిపుణులు ఉచ్చులు నురులు మున్నగు సాధనములతో ముందు నడచిరి. వారివినోదము వర్ణనాతీతము. ఆసమయ మున నెచట గాంచినను వేటకుక్కలే. ఏ యెడ చూచిన పదాతి వర్గమే. రుద్ర భూపాలుడు తురంగమునెక్కి మహోల్లాసమున ముందు నడచు చుండెను. అతని కిరుప్రక్కల నీటెలు-బల్లెములు తుపాకులు పట్టినవారు తెగలుతెగలుగ నడచుచుండిరి. ఒకనాటి మధ్యాహ్నవేళ నొక కారడవి జేరిరి. కొందరు దట్టమగు చెట్లనీడల నాశ్రయించిరి. తన నిమిత్తము నిర్మితమైన పట కుటీరమునందు ప్రభువు విశ్రమించెను.

ఆదినశేషము గడపి మరునాడుదయమున రాజపరివారమా యరణ్య వీధులెల్ల నాక్రమించి జాగిలముల నుసిగొల్పి, పందుల జంపి, తోడేళ్ళగొట్టి దుప్పుల రొప్పి, కణుజులకూల్చి పిట్టలగాల్చి సలువలంకుల మృగయా వినోదులై చెలరేగిరి. తిరిగితిరిగి రారా, 'హోహో' హోయెహోయె నను హెచ్చరికలతోను ఉస్సులు గొట్టుచు, నవ్వుచు, పెడబొబ్బలిడుచు నం

దందు స్వేచ్ఛా విహారము సాగించిరి.

పిల్లికిచలగాట మెలుకకు ప్రాణసంకటమన్నట్లు యరణ్య మృగములకు సంభవించిన ప్రాణభీతి, మరణావస్థ గాంచిన నెట్టి పాషాణ హృదయునకైన నొడలు కంపమొందక మానదు.

ఈసె పోట్ల సహింపనేరక తల్లడిల్లి యటునిటు పర్విడు నడవి మెకముల కాళ్ళరేగు దుమారము పొగవలె నలుదిక్కుల వ్యాపించెను. ఆ పొగయందు శ్వాపదము లాపదలకులోనై గిరికీలువెట్ట వేటకుక్కలకు జిక్కి నిలుగ్రుడ్లతో నిట్టూరుల్పతో సందుగొందుల వెనుక జొచ్చినవి. ఇలడ్డ పుంజుల మాడ్కి చెవులంబట్టి వ్రేలాడు చిఱుత కుక్కల తప్పించుకొన నోపికలేక పై ప్రాణములతో సంకట పడుచు కొన్ని నిలచి యున్నవి.

బల్లెపుపోట్లవెంట ప్రేవులు వేలాడ వేడిరక్తమున తడిసిన యొడల్లతో తమ్మెదిరించిన వారిని బూకరించుచు శరవేగమున చిల్లర మెకములు వందలకొలది పలుత్రోవలపర్వెత్తుచుండెను. పదములంగూలిన కాఱేన్నుల ఘీంకారము లురుములుగ మింటనంటిన ధూళి మేఘపటిలిగ, పిట్టల కండ్ల నుండి కారెడి క్రొన్నెత్తురు వర్షధారలుగ ముహూర్తకాలమున వనాంగనకు వర్షకాల భుజంగ సమాగమ సంప్రాప్త మయ్యెను. అందందు రక్తదారల దడిసి కలయంపి జల్లిన ముంగిళ్ళనా నాకాననంబు విచిత్ర శో (క్షో) భా స్ఫురిత మయ్యెను.

సింగములా గణనమందేకొండగుహల నుండెనో చెప్పలేము. వాని గర్జలు నిర్జరుల భయపెట్టుచున్నవి ఆ ప్రదేమంతయు శబ్దమయ మయ్యెను. ఆ ధ్వనియు కోలాహలమును కర్ణపుటభేద్యమనుటతిశయోక్తి గాదు. బోనులంజిక్కి గాండ్రించు బెబ్బులులను, క్షతములై రక్తసిక్తములై ప్రాణములను విడువనున్న జింక, దుప్పి మున్నగు క్షీద్ర మృగ

ములను గన్నవారు భయకంపితులు కాకుందురా.

ఈ మృగయా వినోద నాటకమునకు సూత్రధారుడు రుద్రభూపతి, ఆతని యీ వినోద విహారము కడు శ్లాఘ్యము. అతని తత్తడి బహుజవము, సలక్షణము కలది. దాని అందచందములు, వల్గనము వర్ణనాతీతములు దానికి తగిన రౌతు రుద్రుడు, అతనికిదాయశ్వము.

ఎక్కడి గుఱ్ఱ మెక్కడివేగము! ఋతుపర్ణుని రథమువలె రుద్రుని యశ్వమా వనమందు మెఱపువలె దూసుకొనిపోయెను. ఆ వేగము గాలికి లేదు. రెండు గడియలకాల మెక్కడ చూచిన నా ప్రదేశమున నాఘ్రుటిమే కన్పించెను. దాని స్వారిగాంచి వింతపడనివారు లేరు. ఇట్లు కాంతారమున గుఱ్ఱమును దుమికించుచు తిరిగితిరిగి తుదకొక జింకవెంటపడి దానిని తరిమితరిమి కడుదవ్వేగి బడలి వోయిపోయి భూపాలుడొక సరస్సుజేరెను.

అట్లుచేరి గుఱ్ఱము దిగి మడుపుజొచ్చి జలపానంబొనరించి తత్తర మున నొక రసాలముక్రింద చక్కని చలువరాతి పాన్పున విశ్రమించెను. తెమ్మెరపిల్లడు వీవనచే విసరినట్లు తేనిమేని చెమ్మటలార్చి పథశ్రాంతి నపనయించెను. ఆ తెమ్మెరల కమ్మదనము నా సరస్సు చక్కదనము నా నళినీ కోకనదముల సౌరభ్యము వర్ణనాతీతము. ఇట్లా రుద్రభూపాలుడు కొంత తడవు విశ్రమించి వేట బడలికచే నిద్రాగతుడయ్యెను ప్రకృతి యంతయు నిశ్శబ్దమును వహించెను. మధ్యందిన భానుమండల కరావళి హావళిచే గ్రీష్మ ఋతుప్రభావముచే గాబోలు వేడిగాడ్పులు విసరికొట్టు చుండెను. సర్వ ప్రాణకోటియు విశ్రాంతి ననుభవించుచున్నది యుండోలె నా విపిన భూమియంతయు మిక్కిలి ప్రశాంతముగ నుండెను.

ఆ సరోవర ప్రాంతారణ్యము సువిశాలమై తరులతానికుంజముల చేత క్రిక్కిరిసియుండెను. అందు సండ్రి, వేప, మద్ది, టేకు, జువ్వి,పనస,

వెలగ, కరక, యుసిరి. పొన్న, పొగడ, బిల్లుడు, కుంకుడు, ఇప్ప, ఏగిస, కోసంగి, ముషిణి, వసంతగుండ, కడంబ, గుమ్ముడు, దిరిసెన నేరేడు, మారేడు, ఒడిసె, రంగరావి, గంగరావి, గన్నేరు, అడవిమలగ, నిమ్మ, దబ్బ, కమల, నారింజ, జంబీర, అశోక, సహకార, మున్నగు వృక్షములును, గచ్చ, గోరింట, చిట్టీత, రక్కెన, నాగజెముడు, పట్టుతీగె, యురిమిడి, యాలదొండ, జతరేణి, పల్లిగి, గల్లారి, జంపనార, రుద్రాక్ష మొదలగు లతానికుంజములును, పరద, యేత్రింత, టిట్టిభను, గోర్వంక, చిలక, కోయిల, యడవికాకి, గ్రద్ద, పిచ్చుక, దేగ, గువ్వ, కౌజు మున్నగు పక్షి సంతానముచేతను, ఇట్టి, దుప్పి, ఎలుగ, ఎనుము, సివ్వంగి, చెవుల పిల్లి. కస్తూరి, అడవిపిల్లి, కొర్నపందు, దుమ్మలగొండి, గోహగూల, లులాయ సూకర, ఖండాల, శార్దూల, ఖడ్గమృగాది వివిధ జంతు సమూహ భీలమై యేపుమీరి పకృతికాంతకు ముఖద్వారమై చెల్వారు చుండెను.

కమలాకరమున కనతి దూరమున నొక పర్ణశాల కలదు. అందు మేధావియనురాజనీతిజ్ఞుడైన ఒకమహామనిషికలడు. అతడు గొప్పమేధావి. కూలంకషప్రతిభాశాలి. అతని ప్రజ్ఞావిశేషమెట్టిదో గంభీరమైన అతనిముఖ వర్చస్సుననే గ్రహింపవచ్చును. ఇతడు మధ్య వయస్కుడు. విశాలమైన ఫాలము పృధువక్షో దెశముగల్గిన దర్శనీయుడితడు. జటాజూటముతో వక్రభ్రూరేఖతో, అరుణరేఖారాజితమైన నేత్రాంచలములతో, కొనదేరిన నాశికతో, ధనురాకృతి నొందిన యధిరోష్టముతో నాతడొక మహా పురుషుడని చూచువారికి తోచును. అతనికి నాటి రాజకీయములు కొట్టిన పిండి. ఆతని శరీరమంతయు హిందూమతాభిమానమే. ఇతడు వనవాసి యయ్యును రుద్రభూపతికి మంత్రి మండలికి విపత్కర పరిస్థితులలో మంత్రాలోచన మొసంగెడివాడు.

ఇతనికి చారుమతియను పుత్రికారత్నము కలదు. కాని యామె

ఇతని కన్నకూతురు కాదు. ఈమె జన్మ వృత్తాంతము నిగూఢమైనది. కాని పవిత్రమైనది. ఆబాలిక మేధావి యింట శుక్లపక్ష శశిరేఖవలె దినదిన ప్రవర్ధమాన మగుచుండెను. ఆమె అందాలరాశి. ఆమె కప్పటికి పదునారేండ్ల ప్రాయము. ఆకారరేఖా విశేషముల యందును విద్యావినయ సంపత్తులందును ఆమెకెవ్వరును సాటిరారు. ఆ బంగరుబొమ్మ మేని సోయగము పసిడికాంతులను వెదజల్లుచున్నది. ఆమె క్రాల్గన్నులకు తమ్ములు తమ్ములే. మోము సర్వజనాహ్లాదకరము. ఆమె కృశోదరి. ఆమె జడ జటాసర్పభ్రాంతికి స్థానమగుచున్నది. ఆమె కంఠము శంఖమునకు సాటివచ్చును. ఆమె గమనవైఖరిని గనిన తాపసికైనను చిత్తవిభ్రమము కలుగమానదు.

ఆమె ప్రతిదినము సరోవరమునకేగి జలములు కొనితెచ్చును. నాడును యథాపూర్వకముగ జలాహరణ నిమిత్తమై పాత్రను కటిసీమ నలంకరించి యాడుచుపాడుచు, దిక్కులు పరికించుచు వనసౌందర్యమును కనులతో నాస్వాదించుచు, పూలమొక్కల నెడ నెడ పరామర్శించు చుండెను. వృక్షాగ్రముల కేరింతలాడు బహువిధ శకుంత సంతాన కలస్వనములు వీనులవిందుజేయ నాసరోతీరమును జేరెను. అట్లొయ్యారమునజేరి ఘటమును జలముల ముంచు సమయమున నా ధ్వనికి నికటనికుంజమున నున్న పురిటి బెబ్బులి కలవరపడి తనపై లంఘింప నుంకించి దిక్కు లదరునట్లు భయంకరధ్వని గావించెను. ఆమె భయార్తయై పులిపులి యని కేకవైచెను. ప్రక్కనే పొన్నగున్నక్రింద నిద్రించు రుద్రభూపతి చటుక్కున మేల్కాంచి తత్తరపడి ఖడ్గపాణియై ఆవ్యాఘ్ర శిరమును తాళ ఫలమువలె తెగవేసెను. భయసంభ్రమయైన నామెను సమీపించి రుద్రుడిట్లు ప్రశ్నించెను.

రుద్రు:- తరుణీ! నీ వెవ్వతెవు? నీపేరేమి?

**ఆమె:- సిగ్గిలి తలవంచుకొని కొంతసేపటికి 'చారుమతి' యనెను.**

రుద్ర;- నీ వెవరి కన్యవు?

ఆమె:- మేధావి పుత్రికను.

ఈ సమాధానముతో ప్రభువునకు మేధావి రూపము శక్తిసామర్థ్యము చటుక్కున స్ఫురించెను. అతనికీమె కుమార్తె యా! అదెట్లు సంభవము అనుకొనుచు నాలోచనా నిమగ్నుడయ్యెను. ఇంతలో నామె కన్నెత్తి రెప్పలార్పక రాజును పరికించెను. అట్టి స్ఫురద్రూపిని, ఉత్తమ పురుషాకృతిని ఇంతకు పూర్వమెన్నడును చూచియుండలేదు. ఆతని పలుకులు మిక్కిలి గంభీరములు. ముఖము వీరశృంగారములకు నిలయమైయున్నది. ఇతడొక ప్రభువై యుండునేమో - ఏమోయననేల ఓరుగంటి పురాధీశ్వరుడైన రుద్రదేవచక్రవర్తి కావలయును అని యామె మానసమున నూహా తరంగములు చలరేగెను.

పర్ణశాలయందున్న మంజరియను చెలికత్తె చారుమతి తిరిగివచ్చుటకు కాలాతీత మగుచున్నదని ఆమెను వెదకుకొనుచు తత్సరోవరమును డాసెను. ఆసమీపమున పడియున్న శార్దూలమును, కొంతదూరముననిలిచి యొకరాజపురుషునితో మాటాడుచున్న చారుమతిని గాంచెను. ఆమెమిక్కిలి భయభ్రాంతయయ్యెను. చారుమతీ ప్రతాపరుద్రులామెను గాంచిరి. మంజరి వినయవిధేయతలతో రాజునకు నమస్కరించి జరిగిన వృత్తాంతమును తెలిసికొనెను. కృతజ్ఞతా పూర్వకములైన దృష్టులతో మంజరి రాజును చూచి పర్ణశాలయందు తమ యాతిథ్యమును స్వీకరింప వేడినది. ప్రతాప రుద్ర చక్రవర్తినిగూర్చి మేధావివలన వినియుండుటవలన మంజరి యాతని నా ప్రభువై యుండునోపునని యనుమానించినది.

రుద్రుని దృష్టు లామె లావణ్య జలధిలో దేలియాడుచుండెను. ఆమె మనోహర రూపము రాజు వీక్షణపంక్తి కమృతాభిషేకము గావించెను. చారుమతి మానసము కూడ నామె వీక్షణముల చాంచల్యములకు

పాటివచ్చినది. పరస్పరానురాగమనిన నదికాబోలు!

రాజు తేరుకొని మంజరితో నిట్లు సంభాషించెను.

ప్రతా:- మంజరీ! మేధావి యాటజమున నుండెనా!

మంజరి:- లేరు.

ప్రతా:- ఎవటికి వెళ్ళిరి?

మంజరి:- తెలియదు ప్రభూ!

ప్రతా:- చారుమతిని క్రీగంట వీక్షించుచు 'పెళ్ళికుమారుని వెదకుటకు వెళ్ళిరేమో!

మంజరి:- కావచ్చును. ఎదిగిన బిడ్డలకు వరుని వెదకుట తండ్రులకు తప్పదుగదా! అయినను వెదకితెచ్చిన మనువు లనురాగ ప్రదమలు కాకను పోవచ్చును.

ప్రతా:- కన్యలే స్వయంవరమున ప్రియుల నెన్నుకొనుట సమంజసము.

మంజరి:- మా 'చారుమతి' మనస్సెట్లున్నదో యెవరికితెలియును? సింగపు పిల్ల కురంగమునభిలషింపదుగదా! అనర్ఘ రత్నమునకు స్వర్ణసంయోగము కాకుండునా?

అని సాభిప్రాయముగ మంజరిమాటాడినది. చారుమతికి యొడలం తయు సిగ్గుల ముగ్ధయైనది.

ఇంతలో దూరమునుండి వచ్చు వేటకాండ్ర అలజడి వారి చెవుల బడినది. 'మా వేట బృందము వచ్చుచున్నారు' అనునంతలో మంజరి 'ప్రభూ! మా చారుమతిని విపత్తునుండి బ్రతికించుకొంటిరి. మీకు సదా కృతజ్ఞులము' అనినది. ఇంతలో తనను కలియవచ్చు పరివారముతో వేట కుటీరమునకు వెడలెను. చారుమతి రాజు పోవుమార్గమును కన్నార్పక చూచుచు దిగులుపడుమానసముతో వెనుదిరిగి రాజునుగాంచుచు మంజరితో పర్ణశాల చేరెను.

రుద్రభూపాలునకు ప్రజ్ఞాధురీణులు, అకుంఠిత దీక్షాదక్షులు, దేశభక్తి పరాయణులు శూరాగ్రేసరులు, మేధస్సంపన్నులు, వీరశిఖామణులు నగు పలువురు మంత్రులు సేనాపతులు కలరు. సింహాసనమధిష్ఠించినవారు స్త్రీ యైనను, వసమర్థుడైనను, తంత్రజ్ఞుడు కాకున్నను వీరు రాజ్యపాలనలో నిపుణులై కార్యకలాపములను నిర్విఘ్నముగ కొనసాగించు దక్షులు. వీరు ఆంధ్రసామ్రాజ్యము విచ్ఛిన్నము గాకుండ కాపాడుచుండిరి. సామ్రాజ్య విస్తరణ శత్రురాజ్య వశీకరణాది తంత్రము లొకయెడ సాగుచుండ వేరొక వంక లలిత కళల ప్రాచుర్యము బహుశాస్త్రవిద్యావికాసములు దేశమం దెల్లడల నభివృద్ధి చెందుచున్నవి. రుద్రుని కాలమునగూడ దేశక్షేమమే తమక్షేమముగ భావించి నిర్విరామకృషి నల్పు రాచకార్య దురంధరులు, మహామంత్రులు, వాహినీపతులు పెక్కుమంది కలరు. అందు నాగయ గన్న మంత్రి అగ్రగణ్యుడు.

ఇతడేకశిలా నగరాధ్యక్షుడు. దేశభక్తి రూపము దాల్చినవాడు విస్తార లోకానుభవముచే కాకలు దీరినవాడు. చెదరని లక్ష్యము బెదరని మనస్సు గల కమ్మవీరుడు. స్థిరసంకల్పుడు. నిరంతరోత్సాహి. ప్రతిభా వంతుడు. పద్మపురాణ కృతిపతియైన కందనమంత్రి పితామహుండైన గణపతి మంత్రి సోదరుడు. బహుకావ్యములకు కృతినాథుడైన మహామనిషి. రుద్రభూపాలునకు కడుంగడు నాప్తుడు. దేశముయవనోపద్రవ పరిస్థితియం దున్నదని యొక రహస్య సమావేశ మేర్పరచెను.

ఏకశిలానగరమునకుత్తరదిశగ భూగర్భముననొకయపు రూపమంది రము కలదు ఆ మందిరము సువిశాలమైనది. కుడ్యములు హరినీలవర్ణ శోభితములు, ఆ కుడ్యములపై కాకతీయ నృపుల చిత్రము లలంకరింప

బడినవి. ఆభవనము శ్రేణీకృత బహురత్నదీపికా సమాలంకృతము. సహస్రాధిక రమ్యాసన పరిశోభితము. తదాసనశ్రేణి పురోభాగమున నొక విశాలమై సమున్నతమైన శిలావేదిక కాననగును. వాయుప్రచారమునకు.

ఆచోటికి నిర్ణీత సమయమునకు మంత్రులు సేనాపతులు మండలేశ్వరులు సామంతరాజులు వచ్చి యుచితాసనముల నలంకరించిరి. ప్రధానామాత్యులు నాగన్నమంత్రి ప్రవేశించుచుండ ఆసనస్థులైన ప్రముఖులు గౌరవసూచకముగ లేచి నిలబడిరి. మంత్రిశేఖరుడాసనమునలంకరించిన తదుపరి సభ్యులు తమస్థానములందాసీనులైరి.

నాగయగన్న మంత్రి మిక్కిలి స్ఫురద్రూపి. తేజోరాశి. విశాలవక్షుడు. మెలివెట్టిన మీసములతో నాతని ముఖము సహజ గంభీరము. ఆనాడతని మోము దుర్నిరీక్ష్యముగ నున్నది. కనులు క్రోధారుణదీప్తి నొందియున్నది ఆతని వైఖరినిబట్టి యేదో రాజకీయోపద్రవముసంఘటిల్లినదని సభ్యులు సందేహించి కలవరపడుచుండిరి.

అంత గన్నయమంత్రి యీ క్రిందివిధముగ ప్రసంగించెను.

ఆంధ్రమహావీరులారా!

మనదేశము చాల విపరీత విపత్కర పరిస్థితులందున్నది. రుద్రభూపాలుడూరలేడు. మహమ్మదీయు లిదియదనుగాజూచి మనదేశముపై దండెత్తనున్నారని చారులవలన విని రహస్య సమావేశ మేర్పరచితిని. నేడొక రహస్యలేఖకూడ అందినది. ఈ లేఖయందలి యంశములనుమీరు వినగోరెదను. అంతట సన్నిధానవర్తి యొకడు లేఖనిట్లుచదివెను.

దోర్విక్రమ పరాక్రమవంతులు, అనుపమాటోప సాహస విక్రమార్కులు, రణరంగధీరులు, ఓరుగంటి రాజ ప్రధానామాత్యులు అయిన నాగయ్యగన్న మంత్రిశేఖరులకు సాష్టాంగ దండప్రమాణములు గావించి వ్రాయునది—

ఉభయకుశలోపరి. ఢిల్లీ సుల్తాను ఉల్లూఖానుని మతద్వేషము మితి మీరినది - ఇచటి యాంధ్రులను పలువిధముల బాధించుచున్నాడు. వేయేల ఆంధ్రులనిన మండిపడుచున్నాడు. యుద్ధసన్నాహములు గావించుచున్నాడు. పరదేశముల నుండి పెక్కుసైన్యములువచ్చి ఢిల్లీ చేరుచున్నవి. పదిలక్షల కాల్బలములతోడను, పదివేల యశ్వికులతోడను, రెండువేల గజముల తోడను, ఏకశిలానగరమును ముట్టడించుటకు సిద్ధముగానున్నాడని గ్రహించితిని. మహమ్మదీయ సైన్యములు రెక్కలు వచ్చిన చందమున నెగురుచున్నవి. దేవగిరి, హోయసల గజపతి రాజులతోడ్పాటీతనికి గలదు ఈ స్థితిలో దండోపాయమే మనకు మార్గము. తగిన యత్నమున నుండ గోరెదను.

ఇట్లు
కాకతీయరాజ్య శ్రేయోభిలాషి

ఈ యుత్తరము విన్నంతనే సర్వసైన్యాధిపతి లేచి "మన సైన్యములు సిద్ధముగనే యున్నవి. మహమ్మదీయ సైన్యములు త్రిలింగదేశము రాకమున్నే ఢిల్లీపై యుద్ధప్రకటనజేసి కోటను ముట్టగించుట సముచితమని నా యభిప్రాయము. అంతట గన్నయ మంత్రి తొందర వలదు. రాజూరలేదు. మన విద్యానాధుని రహస్యముగ ఢిల్లికిపంపి యితడు తిరిగి వచ్చిన యనంతరమే దండయాత్ర విషయమును ఆలోచింపవచ్చును" అని పలికెను. అంతట సభ్యులు మంత్రిశేఖరుని యాలోచనతో నేకీభవించిరి అంతట విద్యానాధుడు ఢిల్లికి పయనమయ్యెను.

అదియొక పుష్పవనవాటికా దృశ్యము. అది సువిశాలమైన ప్రదేశము. గరుడపచ్చలుకూర్చినట్లు చిలుకధంగు తివాసీ పరచినట్లు మిసిమి

కొంతుల లీనుచు చూచువారికి కనువిందైయొప్పు ప్రదేశమది. అందొకచో శిలామయవేదికలు వేరొకయెడ పల్వురు కూర్చుండి నసువైన విచిత్రాసనములు-మఱియొకదెస శీతలచ్ఛాయా పరివృతములై పుష్పమనోజ్ఞములైన లతామండపములును, వేరొండుదరి తోటమాలి చాతుర్యముచే మలచబడిన వల్లీమతల్లికా శోభిత గృహములు చెదరి చెదరియుండెను. ప్రతిదినము వేనకువేలు మహమ్మదీయులు సాయంకాలము చల్లగాలికచటికి వచ్చుచుందురు. పండుగలందు పబ్బములందు గుఱ్ఱపు పందెములు, వినోద క్రీడావిశేషములు నచటి యాకర్షణీయాంశములు.

ఒకనాటి యపరాహ్ణవేళ చల్లగాలికి చల్లగనచటి కనేకులు వచ్చిరి. వారిలో కొందరు షికార్లు చేయుచుండిరి. కొందరు శిలామయమైన సోఫాలపై (వాలి హుక్కా పీల్చుచు నిషాతో నూగుచుండిరి. కొందరు హాస్యముపై హాస్యమును దొరలించుచు పొంగిపోవుచుండిరి. కొందఱు తములపాకు చుట్టలు నమలుచు సరస సంభాషణలతో వినోదించుచుండిరి. వచ్చుపోవు జనమునా ప్రదేశము క్రిక్కిరిసియుండెను. అందరు కుళాయిలు ధరించినవారే. అందరును సాహెబులే. ఇన్నూటికి మున్నూటికి నొకడాంధ్రుడు కనపడజొచ్చెను. అందొకయువకుడా గుంపులో జొరబడి యందందు తిరుగుచుండెను. అతనిచూపు లెవరికొరకో వెదకుచున్నట్లు కనబడుచుండెను. తనకెదురైన వారిని తురుష్కభాషలో పృచ్ఛచేయుచు వారి ప్రత్యుత్తరములకు తలయూపుచు చేనున్న బెత్తమునానుకొని నిలువబడి గుంపును పారజూచుచు సాగిపోవుచుండెను.

అతడు సామాన్యపు ఎత్తున్నవాడు. ఎఱ్ఱని దేహచ్ఛాయ గలవాడు. ముఖమున చురుకుదనము కొట్టవచ్చుచున్నది. చూపులందు నిశితత్వము కనబడుచున్నది. శిరమున జరీపనిగల శిరోవేష్టనము చెవులకు మకరికా కుండలములు చేతుల బంగరు సింహతలాటములు. వేళ్ళకు వజ్రాంకుర

శోభితమైన అంగుళీయకములు కలవు. భుజములకిరుచక్కని ముందునకు వ్రేలాడు దుశ్శాలువతో బిళ్ళగోచి పోసిన పంచతో, ఫాలమున శీలించిన త్రిపుండ్రములతో మెడలో రుద్రాక్షర మాలతోనతడొక శ్రోత్రియపండితు డని చూచువారికి స్ఫురింపక మానదు.

ఇంతలో నతనికి తాను వెదుకుకొను మిత్రుడు కన్పింపగ నానంద ముతో కౌగిలించుకొనెను. ఆ శ్రోత్రియుడు జగత్ప్రసిద్ధుడైన విద్యానాథ పండితుడు అభినవాగతుడు జనార్ధన మంత్రి.

విద్యా:- జనార్ధనా! యేమి విశేషములు.

జనా:- ఏమిచెప్పను! నీవు వినలేదా. అంతయు సంక్షోభముగ నున్నది.

విద్యా:- కారణమేమి?

జనా:- కారణ మేమున్నది? తురకల దౌష్ట్యాలయమందలి గంట మ్రోగు టయే.

విద్యా:- సరి! సరి! ఆ గంటధ్వని మనచెవులబడనిదెపుడు? ప్రస్తుతమున ఉల్లూఖానునకు యుద్ధపు కైపెక్కించునిదెవడు?

జనా:- నాడు మల్లిన్ తైమూర్. అతడు ఓరుగంటి సామ్రాజ్యలక్ష్మిపై కన్నిడిన పాదుషా క్రోధాగ్నిని ప్రజ్వరిల్లజేయు మొనగాండ్రయందగ్ర గణ్యుడు. దుష్టుడు.

విద్యా:- జనార్ధనా! తైమూరు మాటలునమ్మియా ఉల్లూఖానుడు మిట్టిపడు చున్నది? అతనికింతలో నావేళ జ్వరము పుట్టునని తలంచనైతిని. సుల్తానుగాని తైమూరుగాని యాంధ్ర వీరాగ్రేసరుల పరాక్రమం బెఱుగరు!

జనా:- ఎఱుగకేమి? వారిర్వురిలో మూఢత్వము మూర్తీభవించినది. విమ ర్శన జ్ఞానము శూన్యము. క్రొవ్వి తారతమ్య జ్ఞానములేక మహామ్మ

దీయ వీరులు పల్కోడి పౌరుషాహాపముల నమ్మి యెడలెంఱుగక కల
హమునకు కాలుదువ్వుచుందురి.

విద్యా:- కానిమ్ము కావలసినది కాకమానదు. పాదుషా ప్రజాపరిపాలనా
పద్ధతు లెట్లున్నవి?

జనా:- అవిమాత్రము సక్రమముగా నుందునా?

విద్యా:- అట్లనకుము. ఈ సమయమున సక్రమముగనేయుండును.

జనా:- యుద్ధపురోజులనియూ నీ యభిప్రాయము?

విద్యా:- అవును.

జనా:- సైన్యములన్న మిక్కిలి ప్రేమతో నుండును.

విద్యా:- అది యుండదగినదే.

జనా:- ఏదియెట్లయినను యుద్ధము సిద్ధముగాక మానదు.

విద్యా:- కానిమ్ము భయయేమి జైనులీతరుణమున యవనులకు సాయము
చేయకుందురా?

జనా:- అబ్బా; అందించక మానుదురా? వారుపరమనీచులు. పాముకాశ్రిత
రులకు కానబడినట్లు వారిప్రచార మొరులకెఱుకపడదు. వారిప్రయో
గములభేద్యములు. వారి మాటలు తేనెపూసిన కత్తులు. అందు కుశీలు
డనువాడు సార్థకనాముడే. అతని కృత్రిమ కుద్యములు పడగొట్టుటకు
సత్వర యత్నమావశ్యకము.

విద్యా:- జనార్ధనా! మన ప్రధానామాత్యుడే కొంచెలనొకకంట కనిపెట్టియే
యుందురుగదా!

జనా:- అవును. ఎవరు కనిపెట్టిననేమి? ఎన్నిసార్లు శిక్షించిననేమి? తేలు
నకు కొండెమాడించుట సహజమైనట్లు జైనులకు ప్రాణగొడ్డపు

పనులొనరించుట సహజము. సత్వరముగ వారి వంశవృక్షములు కూకటి వ్రేళ్ళతో పెగల్చకున్న తప్పక మన జాతీయ గౌరవమునకు ముప్పు వాటిల్లును.

విద్యా:- అవును.

జనా:- మాటల సందడిని మనము ప్రొద్దు చూడకుంటిమి. చీకట్లు క్రమ్ముచున్నవి పిట్టలు గూళ్ళుచేరుచున్నవి. మనచుట్టునింతదనుక కూర్చున్న తురుష్కులెల్లరు లేచి గుంపులుగుంపులుగా వెడలుచుండిరి. ఆలస్యము చేయవద్దు - విడిదికి వెడలుదము రండు.

విద్యా:- మంచిది.

అనియింక నేమేమోమాటాడుకొనుచు వారుభయులు నుల్లాసముతో విడిదికేగిరి.

ఆ విడిది లోగిటియందు వారుభయులు పెందలకడ భోజనమొనరించి యొక గదిలో సుఖాసీనులై గ్రంథమ్ములను వేయుచు మహమ్మదీయ యుద్ధయాత్రను గూర్చి మాటాడుకొనుచుండిరి.

అంత కొంచెము ప్రొద్దు పోయినది. గస్తీ తిరుగువారందందు మెలగజొచ్చిరి, చాటుమాటున చీకటిపనులకేగు జారచోరులకు తలచిటచిటలాడించు బజారు లాంతరుల దీపములు చుక్కలవలె వెలుగుచున్నవి.

మరికొంతసేపటికి కొంత సందడి తగ్గినది. తొలియామము గడచినది. దీపకాంతి సన్నగిల్లినది. క్రమముగ నూరుమాటుమణగినది. కాటుకపిట్టల నిరసించు కారుచీకటి దట్టపడినది. ముందున్న వస్తువునేవి గుర్తింపవీలులేకుండెను.

అత్తరి నాయింటికి కూతవ్రేటు దూరముననున్న నొక మసీదు ముంగిట నొక వ్యక్తి నడయాడ దొడగెను. ఒరుల కంటబడకుండ నెచటికో వెళ్ళ

వలెనని యాతని సంకల్పము. అటునిటు పారజూచి సమయోచితమైన నడకతో నిశ్శబ్దముగ బయలు వెడలి యావీధిని సరాసరిపోయి పాతచుట్టము వలె రివ్వున నా విడిది గృహమున ప్రవేశించెను. అంతట జనార్ధన విద్యానాధు లిర్వురు మహోల్లాసమున దిగ్గునలేచి వానిని కౌగిలించుకొనియున్నతాసనముపై కూర్చుండజేసిరి. వారిముందు చలువరాతి మేజాబల్లయు బల్లపైనున్న దీపపు లాంతరు, దాని సమీపముననున్న తాంబూలపు పళ్ళెరమును దప్ప నాగదియందేవియులేవు. ఈ ముప్వురునుదప్ప నందొరు లెవ్వరును లేరు.

ఆముప్వురిలో విద్యానాధుడు తన ప్రక్కనున్న స్నేహితునివంకకు కొంచెము వ్రాలి వెనరుచూడ్కి నిగుడింపుచు నాదరమున నిట్లనియె.

విద్యా:- మిత్రమా! నీ చిరకాల సందర్శనము నాకత్యంతానందము కలిగించినది. ప్రచ్ఛన్న వేషముచే నీయాకారముపూర్తిగ మారినదిసుమా; చిరపరిచయముగల నేను నీకంఠస్వరమునుబట్టి గుర్తింపగల్గితినేగాని లేకున్న నిన్ను తెలిసికొనుటసాధ్యమయ్యెడిది.

ఇంతకుమున్ను మన జనార్ధనుడు నీవు ఫకీరు వేషమున నిందుంటివని చెప్పియుండెను. మనసమావేశమింత శీఘ్రకాలమున నిందుజరుగుననితలంచనైతిని. నీరూపసదృశమై నీవర్తనము సమాలోచనముగూడ నిగూఢతరముగ నుండవలెను. నీ ప్రయత్నమభేద్యమై ఫలించవలెను.

ఫకీ:- అయ్యా! వెదకెడి తీగె వ్రేలికి చుట్టుకొన్నట్లు అప్రయత్నముగ మీ సందర్శనమయ్యెను. నీరాక రాకాచంద్రునివలె మానయన చకోరములకానందమొనరించినది. మీ పొగడ్తకు నేనుతగను. మీకందని యూహగాని, యుక్తిగాని లోకమున నుండునా? గాలిలో దీపముపెట్టి దేవుడా! నీమహిమ! యనుటకంటె పురుష ప్రయత్నమువలన కార్యములు సఫలములగునని నాయభిప్రాయము. శక్తివంచన లేక దేహ ప్రాణములను

దేశసేవకర్పించి చేతనైన పనులొనరించెదను. ప్రతిమానవునకు దేశసేవ కర్తవ్యము- అది పవిత్ర కార్యము - రాజభక్తి సమన్వితమగు దేశసేవ దేశాంతర విఖ్యాతిని తెచ్చును. దేశసేవాపరాయణుని కీర్తి కన్య వరించును. గౌరవాంగన వానిముందు నడచును. అతని పేరు ప్రఖ్యాతులు వర్ణనాతీతములుగదా! అతని పవిత్రనామము దేశమెల్లెడల స్మరింపబడును. అతని విజ్ఞానము దేశపురోగతికి మార్గదర్శకమును చైతన్య శీలమునునైనది. దేశభక్తి తరంగితమైన యాతని హృదయ సాగరమనంతము కడు గంభీరమును, శితశతఘ్నులు ప్రేల్చిన, గంధ సింధురములు త్రొక్కిన, నీరధిని నెట్టిన, నురికంబమున గట్టిన నాతని హృదయాంతర జ్ఞానజ్యోతి చల్లారదు. అతని యాదర్శములు ఆచార్య ప్రవచనములవలె మానవ సంఘమున కవశ్యానుష్ఠేయములు. వాని విజ్ఞానరేఖలు దశదిశా వ్యాప్తములై మూఢ విశ్వాసాంధకారములను పటాపంచలు గావించును. అతని సత్యవాక్కు మనన జలధినుండి వెలికివచ్చిన చింతామణి.

అతని నైతిక ప్రవర్తన నిత్యనూతన ధవళకాంతి శోభితము. దుష్కాలప్రభావమున మహమ్మదీయుల సంస్థలు, వ్యవస్థలు నిరాటంకముగ సాగుచున్నవి. వారి యభిప్రాయములు, నిర్ణయములు నొక న్యాయపద్ధతినిలేవు. ప్రతిక్షణము మార్పుచెందుచున్నవి. క్రమవిరుద్ధమైన శాసన ప్రకటన, న్యాయాన్యాయ విచక్షణలేని యోచన తురుష్కులకు సహజము. కాలపరిణామ మతివిచిత్రముగ గోచరించుచున్నది. కొండెములు చెప్పువారిదే రాజ్యముగ నున్నది.

విద్యా:- మహమ్మదీయ మంత్రుల యాలోచనలు, వారి భటుల యుద్రేకములు, పాదుషా యభిప్రాయములు పూర్తిగ మన జనార్ధనునివల్ల వింటిని. వారు ధర్మయుద్ధమునకు రారు వచ్చిన జయము పొందలేరు.

మనము వారితంత్రములను నుచ్ఛేదింపవలసియున్నది. తురుష్క వాతా వరణమునకు చలింపక కొండవలె నిలచి వారి రహస్యముల నెప్పటి కప్పుడోరుగంటికి తెలుపుచుండవలెను.

పకీ:- మంచిది.

విద్యా:- నేనిటనాలస్యముచేయుట శ్రేయముకాదు. సత్వరమోరుగంటికేగి ప్రధానామాత్యునకు సహాయపడవలెను.

జనా:- అవును. మంత్రిసత్యమునకు కార్యభారమధికము. మీరు వేగ మోరుగంటికేగుట మంచిది. ఆలస్యము వలదు.

విద్యా:- జనార్ధనా! మీరిర్వురిందుటచే కార్యసాధనయందెట్టి కొఱతయు కలుగదు. మీ పద్మవ్యూహము నెవ్వరును భేదింపలేరు. మీకు తిరుగు లేదు. సత్వరము నే నోరుగంటికి పయనమయ్యెదను.

పకీ:- ఇప్పుడే ప్రయాణమా!

విద్యా:- అవును.

జనా:- ముక్కున నూపిరాడునంతవరకు దేశరక్షణకై పాటుపడుట మన విధి.

ఇట్లు వీరి సుధీర్ఘ సంభాషణతో నర్ధరాత్రి గడచెను. పకీరు వారి యొద్ద సెలవుగైకొని విడిదికి వెడలెను. ఆవేకువను విద్యానాధుడోరు గంటికి పయనమయ్యెను. జనార్ధనుడు కర్తవ్యాంశములను గూర్చి యాలో చించుచుండెను.

# 5

భారతదేశమున పుట్టిన యవైదిక మతములలో జైనమొకటి. క్రీ॥ పూ॥ తొమ్మిదవ శతాబ్దమున నున్న ఋషభరాజీమతస్థాపకుడు. ఇతనినే ఆదినాధుడనియు చెప్పుదురు. ఈ మతబోధకులను తీర్ధంకురు

లందురు వీరిలో మహావీరుడు మిక్కిలి ప్రసిద్ధుడు. వీరు మొత్తమిర్వది నలుగురు. ఇందు స్త్రీలును గలరు. ఇందువరుసలో పందొమ్మిదవ తీర్థంకరి 'మల్లినాథ' యను మహిళ. మహావీరుడు క్రీ॥ పూ॥ ఏడవ శతాబ్దము లోనివాడు. ఇతడు చాల వత్సరములు తపమాచరించి 'జిను' డని పిలువబడెను. ఇతడు చరిత్ర ప్రసిద్ధుడు. ఇతనివలననే యీ మతము జైనమనిపించుకొన్నది. ఇతడు దిగంబరుడు. పార్శ్వనాధుని వరకుగల యీ మత బోధకులు శ్వేతాంబరులు. ఎందువలననో మనదేశమున బౌద్ధులు వ్యాపించినట్లు జైనము వ్యాపించలేదు.

జైనసిద్ధాంతములువేఱు. హిందూమత సిద్ధాంతములువేఱు. ప్రపంచమునకు మూలద్రవ్యములారని జైనుల విశ్వాసము. వీనితో ప్రపంచనిర్మాణము జరుగునని వీరి సిద్ధాంతము. ఈ పదార్థ సంయోగము దేవునివల్ల జరిగినదని, అదృష్టమువలన జరిగినదని కొన్ని యాస్తిక మతముల యభిప్రాయము. కాని యాంత్రిక చలనమువలన రెండు పరమాణువులు సంయోగము పొందునని జైనుల యభిప్రాయము. ఇది యా కాలమునకు గొప్ప విషయము. కనుక నిది ఈశ్వరకృతముకాదు! ఇంతగొప్ప విషయమును చెప్పిన జైనులు ఆత్మయొక్క అస్తిత్వమును విశ్వసింతురు. చార్వాకులు బౌద్ధులు అనాత్మవాదులు. జడపదార్థములలో సైతము ఆత్మయుండునని జైనుల నిశ్చితాభిప్రాయము. కాని యాదిలో వీరు నాస్తికులు. విగ్రహారాధనకు వ్యతిరేకులు. యజ్ఞయాగాదులకు విముఖులు. అందుచే పేద ప్రజ లీమతమును విస్తారముగ నవలంభించిరి. కులవర్గ విభేదములను పాటించనందున కూడ నీ మతము సర్వజనాకర్షకమైనది. సర్వసమానత్వము వీరి ధ్యేయమగుటచే స్త్రీ లీ మతము నవలంబించుటకవకాశ మేర్పడినది.

జైనులకు హిందువులకు నెడమొగము - పెడమొగము. జైనులు

కూడ హిందువుల ద్వేషమునకు గురియైరి. జైనాలయములను హిందువులు పడగొట్టించిరి. అట్లే జైనులు హిందూదేవాలయములను నాశనమొనర్చిరి. గుజరాతులో చాలమంది వ్యాపారి లీమతస్థులు. తపస్సు యోగసిద్ధి వీరి సాధనలోని యంశములు. మౌర్యుల యాస్థానములో వీరికి చోటుండెడిది. కుమారంభట్టు విమర్శనకు తట్టుకొనలేక మగధను కళింగమును విడిచి గుజరాతు, రాజస్థానము, ఆంధ్ర మొదలైన ప్రాంతములకు తరలిపోయిరి.

కాకతీయులు మొదట జైనము నవలంభించిరి. జైనులు తమమత ప్రచారముకొరకనేక మార్గముల నవలంబించిరి. హిందువులందలి దుష్ట మతాచారములను, మూఢ విశ్వాసములను ఖండించి యున్నత కులము వారిని, మేధావులనుసైతము తమ మతములోనికి త్రిప్పుకొనిరి. కులవర్గ తత్వములను రేకెత్తించి క్రిందికులమువారినాకర్షించుటకై యనేక పద్ధతుల నవలంభించి తమ మతమునభివృద్ధి చేసికొనిరి. కొన్నిసాంఘికాదర్శముల చేత మనదేశములోని రాజులు రాణులు నాకర్షింపబడిరి. రాజుల సాయ ముచే హిందూ దేవళములను పడగొట్టించి వానిస్థానమున విహారములు, ఆరామములు చైత్య గృహములు మహాశిల్ప విన్యాసములతో కనులు చెదరునట్లు నిర్మింపజేసిరి. సర్వసమత్వాది యుదార సిద్ధాంతముల బోధించి రాణులను తమ మతములోనికి ద్రిప్పుకొని రాజ కుటుంబములో గృహ చ్ఛిద్రముల రేకెత్తించి తమ మత వ్యాప్తిని గావించిరి. రాజులమనస్సును నెమ్మదిగ వశమొనర్చుకొని ప్రజలలో విస్తారముగ మత ప్రచారము చేసిరి. వర్ణాశ్రమాచార వ్యవస్థను, వేదప్రామర్యమును, ఆస్తికత్వమును హేతువాం పటిమచే విమర్శించితమ మతసిద్ధాంతములను వాప్తిలోనికి తెచ్చిరి. ఈవిధముగ దేశమున వైదిక ధర్మ స్థానమున జైనధర్మ మును నెలకొల్ప యత్నించిరి.

మహామండలేశ్వర కాకతిప్రోలరాజు జైనమతమును పరిత్యజించి హైందవమును స్వీకరించెను. మొదటి కాకతీయరాజులు జైనమతమునకు

పట్టుగొమ్మలు. ఆదిశంకరుని కాలముననుగూడ హిందూమతము కాకతీయ రాజ్యమున నడుగుపెట్టలేదు. అట్టిపరిస్థితిలో కాకతిప్రోలరాజు శైవమతావ లంబియగుటచే జైనులకు మతులు చెడినవి. తమ మత సిద్ధాంతములు సంప్రదాయములు ధ్వంసములగునని భయపడిరి. తమ శిల్పము - సాహిత్యము నశించునని వెఱచిరి వారు కాకతిప్రోలునకు ప్రతీకారము చేయ దొడగిరి. కాని ప్రయోజనము లేకపోయెను. అప్లే వారికదను దొరికినప్పు డెల్ల గణపతి దేవునకు, రుద్రమదేవికి నపకారము తలపెట్టుచు వచ్చిరి. నేడు ప్రతాపరుద్రునిపై శత్రుభావము వహించియున్న మహమ్మదీయ రాజులతో కలసి యోరుగంటి సామ్రాజ్య విచ్ఛిత్తికి తిరుగుబాటును లేవదీయుటకు తమ యావచ్ఛక్తిని ధారబోయనుండిరి. జైనులు తమ రహస్య కార్యనిర్వహణము జరుగుటకు హిడింబాశ్రమ సమీపమున నొక పాతాళ గృహము నేర్పరచుకొనిరి.

ఈ పాతాళ గృహమంత పెద్దదిగాక చిన్నదియుగాక సామాన్యముగ నుండును జైనులు ప్రతిమాసమున నిచట సమావేశమగుచుందురు. దీని యందు కత్తులు, కటార్లు, తుపాకులు, విల్లంబులు మొదలైన యాయుధ ములు కలవు. జైనులిచట కసరత్తు చేయుట, ఖడ్గవిద్య, విలువిద్య మొద లగు నాయుధ విద్యలభ్యసించుట వారికి నిత్యకృత్యములు - వీరు కాకతీయ సామ్రాజ్యమును నాశనమొనర్చి తమ మతమును వ్యాప్తిచేయ సంకల్పించిరి, దానికి మహమ్మదీయరాజులు సాయముకూడ వీరికి కలదు.

నాడు జ్యేష్ఠ మాసము. నిండు పూర్ణిమ. పాతాళ గృహమున జైనులు సమావేశమైరి. ఈ జైనుల జట్టుకు కుశీలుడు నాయకుడు. అత డొక మృగచర్మముపై నాసీనుడైయుండెను. జైనులాతనిముందు కూర్చొని యుండిరి. అంత కుశీలుడీవిధముగ ప్రసంగించెను.

మిత్రులారా!

మనము మిక్కిలి గడ్డుదినములలో ఉన్నాము. రాజు మన మత

మనిన కంటగించుకొనుచున్నాడు. ఇట్టిపరిస్థితులందు మనమతము క్షీణించు నని భయమగుచున్నది. మన విహారములన్నియు నశించిపోవుచున్నవి. మన దేవాలయములు శిథిలములగుచున్నవి. మన మతగ్రంథములపై ప్రజలకాదరణకూడ సన్నగిల్లుచున్నది. ఇట్టిపరిస్థితిలో మన కర్తవ్యమేమి? నాకొకటి తోచుచున్నది. ఇతర రాజుల నాశ్రయించి కాకతీయ రాజ్యమును విచ్ఛిన్నము చేసి మన మతవ్యాప్తికి పాటుపడ వలెను. మనకు మహమ్మదీయరాజుల, దేవగిరి యాదవరాజుల తోడ్పాటుగలదు. ఈ విషయమున మీరొసంగు నాలోచనలను స్వీకరించి వానిని కార్యరూప మిచ్చుటకు ప్రయత్నింతము. అని కూర్చుండెను.

ఇదివిని సభలో నాగసేనుడను జైనుడు లేచి యిట్లనెను. 'సమ యోచితమైన మీ యాలోచనము మిక్కిలి కార్యకారియనుటకు సందేహము లేదు. మనకీస్థితిలో స్వమత రక్షణకు మార్గాంతరములేదు. మనమిన్నాళ్ళు స్వమత వినాశనమును చూచుచు నూరకొనవలసివచ్చినది. సోదరులీ విష యమును గ్రహింపవలెను. నాకొక యాలోచన తట్టుచున్నది. మహమ్మ దీయ రాజులు, దేవగిరిరాజులు మనకు మిత్రులుగదా! వారికి లేఖలువ్రాసి విశ్వాసపాత్రులైన మిత్రులవలన నిచటి పరిస్థితులను తెలియపరచుదము. రాజిపుడు వేటవ్యామోహియై యున్నాడుగనుక మనప్రయత్నములకిదిమంచి యదను. మన యాలోచనలను వెంటనే కార్యరూపము ధరింపజేయుటకు తగిన ప్రయత్నములు చేయవలెను. అని పల్కెనమీదట జైనులందరు నీతని ప్రతిపాదనమునకు హర్షామోదములను తెలియపరచిరి. ఇట్లురహస్య సమావేశము సమాప్తమయ్యెను.

# 6

తెల్లవారినది. లెండులెండని యినుని రాకనుదెల్పు భటులవలె పిట్టలు గూళ్ళనుండి కూయుచుండెను. ప్రతివ్యక్తి చెవులు వీనిధ్వనులతో

గింగురుమనుచున్నవి. పల్లెల గృహములందు దినప్రారంభ కృత్యములు ప్రారంభమైనవి. క్రొత్తకోడండ్లు ప్రాచిపనులు చేయుచుండిరి. గొడ్లకాపరి కుఱ్ఱలు కండ్లు నులిమికొనుచు గోష్టముల కరుగుచుండిరి. కమతీలుచెండు కోలలు జాడించుచు నెడ్లనదలించి కోచేళ్ళ తోలికొని మెట్టపొలముల సమీపించిరి. కర్మిష్ఠులు కొల్లాయిలు ధరించి ప్రాతఃకాల స్థానములకు త్వర పడుచుండిరి. అల్పాహార విక్రేతలు తమ కార్యకలాపములయందు నిమగ్నులై యుండిరి. గయ్యాళి యత్తలు తొలికోడి కూయకమున్నే లేచి ప్రాచి పనులుసేయు కోడండ్రపై తప్పులువెదకి కసరికసరి తిట్టుచు పెరుగు గిల కొట్టుచుండిరి. ఈ గయ్యాళులకు లోకజ్ఞానము శూన్యము. సహనము సున్న. తమ కూతురొకయింటి కోడలనుమాట వీరికి జ్ఞప్తియుండదు. కోడలెంత మెత్తదైన అంతయొత్తిడి గల్గింతురు. ఎదురు మాటాడు కోడలైనచో వీరు కుక్కిన పేనువలె అణగియుందురు. ఈ రాకాసులకిది తగినశాస్తి.

ఈ పిశాచముల బారింబడి లేఁబ్రాయపు ముద్దరాండ్రు ప్రియులనెడబాయలేక లోలోన పొక్కుచుండుట మనమెఱిగినదేగదా. ప్రత్యూష పవనాంకురములు వికృత గవాక్షములంబోలు నవదంపతులను మేల్కొలుపు చుండెను.

రవి పూర్వగిరి సంధ్యారాగ లతాగ్రమున గురివెందపూగుత్తి నా పొడసూపి సహస్రకిరణముల నిగిడించి జగమెల్ల ప్రకాశింపజేయుచుండెను. తమ్మిమొగ్గలు జవరాండ్ర మొగమ్ములవలె వికసించు చున్నవి. భ్రమరపంక్తి ఝుంకారముసేయుచు తమ్మిగద్దెలనెక్కి యుల్లసిల్లజొచ్చెను. ఇట్లు జగమెల్ల సర్వకార్య ప్రారంభమై నెగడుచుండ నొకముహూర్తము గడచెను. రెండవముహూర్తము కొంతవరకు గడచినది, రాజోద్యోగులు భృత్యులముందునడువ తమ కచేరీలకు పోవుచుండిరి.

నాడు ఢిల్లీలో రాచకార్యములను ముగించుకొని బయలుదేరిన విద్యానాధుడు నేటియుదయమున నేకశిలానగరము ప్రవేశించెను. కొంతదూరము గడచిన తదుపరి యితడాశ్వీక శకటమునుదిగి యొక రమ్యసౌధమును ప్రవేశించెను. అది సామాన్య ప్రజలకు చొరరానిది. మంత్రుల మంత్రాలోచనలకు రాజపురుషుల సమావేశములకు నర్హమైన మందిరమది. విద్యానాథుడు రాజకీయ మంత్రాంగములందొక ప్రముఖుడగుటచే నాతని భవన ప్రవేశమునకు నాటంకమెద్దియుజరుగలేదు. ఇతడు కక్ష్యాంతరములుగడచి లోనికి ప్రవేశించెను అచట ప్రధానామాత్యుడైన నాగయగన్నమంత్రి యున్నతాసనాశీనుడై యుండెను. విద్యానాధుడాతనికి నమస్కరింప, గన్నమంత్రి యాతని నాదరపూర్వకముగ నుచితాసనమునను పవిష్టునిజేసెను. ఆ మందిరము ప్రశాంతముగనుండెను. ప్రాతర్మందానిలములా మందిర గవాక్షమునుండి వీచుచు వారికాహ్లాదమును గొల్పుచుండెను. ఆలోచనా నిమగ్నమైయున్న మంత్రివర్యునిమోము విద్యానాధుని రాకతో వినూత్న కాంతిని పొందెను. విద్యానాధుడు నాగయగన్నమంత్రికన్న వయసున చిన్నవాడు. కనుక నాతని పితృతుల్యునిగ భావించును. ఆ యిర్వురకు సంభాషణమిట్లు జరిగెను.

గన్న:- మీరు సమయమునకు వచ్చితిరి. మీరేగినపని యెంతవరకు వచ్చినది? ఢిల్లీ విశేషములేమి?

విద్యా:- ఢిల్లియందు నేనొక రాత్రియే యుంటిని. మన జనార్ధనునితో మాటాడితిని. వకీరుతో సమావేశ మారాత్రియే జనార్ధనుని మందిరమున జరిగినది. వారిసంభాషణలవలన తురకలకుట్రలు, మనపై యుద్ధ సన్నాహములు, భేదోపాయ తంత్రములు గ్రహించితిని. అద్యతన భావిలో యుద్ధసూచనలు కన్పించుచున్నవి.

అని యిట్లు వీరు సంభాషణమును సాగించుచుండ మంత్రి యను మతి వడసి మేధావి మందిరము ప్రవేశించి వారిసంభాషణలో పాల్గొనెను.

మేధా:- మహమ్మదీయ సేనాపతులయుద్రేకమునకు ఉల్లూఖానుని రణాభిలాషకు కారణము విచారింపవలసియున్నది.

గన్న:- మీ యభిప్రాయ మేమి?

మేధా:- రాజద్రోహులగు జైనులు వారికి జతపడుటచే నిట్టి వ్యాఘాతములు కలుగుచున్నవని నాయభిప్రాయము.

మంత్రి:- అగును. జైనులైంద్రజాలికులు. వారియండను జూచియే పాదుషా యుద్ధసన్నాహములు మిన్నుముట్టుచున్నవి. ఆ నీచుల మాయ విజృంభణ మంతకంతకు మితిమీరుచున్నది. గోటితోపోవు వీరి విషయము గొడ్డళ్ళకు పని కల్పించుచున్నది. ఇక జైనుల గర్వమణగునట్లు తగిన శిక్ష విధింపకున్న ప్రయోజనములేదు. వీరు విపక్షపక్షావలంబులై క్రిందుమీదెఱుగక యెవరిని లక్ష్యపెట్టక తిరుగుచుండిరని చారులవలనతెలిసియు కొన్నికారణములచే వారినుపేక్షించుట నాదేతప్పు

విద్యా:- జైనుల దేశద్రోహచర్యలు పెచ్చరిల్లుటకు మీయుపేక్షాభావమే హేతువనలేము. మొదటినుండియు వారి స్వభావములు బహు వక్రములైనవి. ఇప్పకైన వారిని శిక్షించుట మన కర్తవ్యము. ఉల్లూఖానుని సమర సన్నాహము జైనుల తోడ్పాటుపై నాధారపడి యున్నది. లేకున్న తురుష్కులీ యచిరకాలములో నింతగ కయ్యమునకు కాలుదువ్వరు. ఉల్లూఖానుడు సోదరతురుష్కరాజ్యములనుండికూడ సైన్యములను సమీకరించుచున్నాడు. వాడు కర్తవ్య వ్యగ్రుడై తనచారులవలన నోరుగంటి విశేషముల నెప్పటికప్పుడు సేకరించుచున్నాడు. మన కర్తవ్యమును నిర్ణయింపవలసియున్నది.

మేధావి:- జైనులత్యల్ప బుద్ధులు. వారిని శిక్షించుట కిన్నాళ్ళుపేక్షచేయనేల? త్వరపడుట మంచిది. ఈ సంక్షోభమునందు పురపరిజనులలో ప్రతి

కూల వాయువులు వీచినచో శత్రుసర్పములు యథేచ్ఛగ తలలెత్తి యాడక మానవు.

గన్నా:- మీ యూహ సరియైనదే. కాని శాతృవులుపైగొన్న యీతరిని మనము జైనులను శిక్షించినచో నాంతరంగిక విప్లవము చెలరేగును. ఇది మన యుద్ధప్రయత్నములకు విఘాతమును కల్గించును. ఇంతకు మనము భావించినదొకటి జరిగినది మరొకటి. కాకతీయ ప్రభువులు మతవిషయమున మొదటినుండియు సమభావమునే చూపుచువచ్చిరి. జైనుల మత కార్యకలాపములకు ప్రభువులు భూరివిరాళములను, మడి మాన్యములనిచ్చుచు నాదరించిరి కాని వీరికి చేసిన సాయము-పాము నకు పాలుపోసినట్లయినది. వీరికి హిందూ సాంప్రదాయములపై నెన లేని ద్వేషము బయలుదేరినది. ఇక వీరినుపేక్షింపరాదు. వీరి దేశ ద్రోహము క్షంతవ్యముకాదు. కాని సమరభేరి మ్రోగునపుడు స్వజను లలో నెట్టి తుంటరులను, కంటకులను కఠినముగ శిక్షించుటవలన పడదు. అది రాజనీతికాదు. మనమెట్టి నిర్ణయమును గైకొనుటకైనను రాజనుమతి కావలెను. ప్రభువు నగరము చేరినతదుపరి తుదినిర్ణయము గావింపవచ్చును.

విద్యా:- మనకు వ్యవధి తక్కువ - కనుక ప్రభువునకు పరిస్థితి వివరించి వారు వేటనుండి నగర ప్రవేశము చేయునేర్పాట్లు గావింప గోరెదను.

గన్న:- అట్లే చేయుదము.

వారి మంత్రాలోచనమిట్లు ముగిసినది. మహామాత్యులు సమర్థులైన భటులను ప్రభువున్న వనప్రదేశమున కొక లేఖనిచ్చి పంపి రాజును రప్పించుటకేర్పాట్లు చేసెను.

# 7

ఒకనాటి సాయంసమయమున జైనులు రెండవ సమావేశమును రహస్యమందిరమున నేర్పరచుకొనిరి. ఆనాడు జైనులు ద్విగుణీకృతోత్సాహముతో వచ్చిరి. జట్టునాయకుడైన, కుశీలుడు ముందుగనేవచ్చి సమావేశమునకు వలసిన యేర్పాట్లనన్నిటిని చేసెను. జైనులు తత్సమీప ప్రదేశమున కత్తిసాములు, విలువిద్య-ద్వంద్వయుద్ధము, గదాయుద్ధము మొదలైనవి నేర్చుకొనుచుండిరి. కొంతసమయము గడచినపిమ్మట నాగసేనుడు తదాయుధ విద్యాభ్యాస ప్రదేశమునకు వచ్చెను. కుశీలుడు నాగసేనునిదూరముననేగాంచి యింతయాలస్యమునకు కారణమేమియని యడిగెను.

నాగ:- ఆలస్యమునకు క్షమింపగోరెదను. జైనులనందరిని సమావేశపరచుటకింతతడవైనది.

ఇట్లు వారిరువురు మాటాడుకొనుచు రహస్యమందిరమున జొచ్చిరి. అంతట నాగసేనుడు కుశీలునకు పుష్యరాగ స్థగితమైన యంగుళీయకమొకదానిని వానిచేతికిచ్చెను.

కుశీ:- ఈ యుంగరము చక్కగనే యున్నది. ప్రస్తుతస్థితిలో నీ యాభరణముదేనికి? మనముయుద్ధకార్యములందు నిమగ్నులమైయుంటిమిగదా!

నాగ:- దీనిని మన కావలివాడైన వసంతునకు చేయించితిని. మీరాదేశించిన ప్రకారము నేనీయుంగరమును వసంతునకు బహూకరించుటకు చేయించితిని.

కుశీ:- వసంతుడు మిక్కిలి నమ్మదగినవ్యక్తి. చారులవలన మనకువచ్చిన యుత్తరములను రెండవకంటబడకుండ రహస్యముగ మనకందజేయుచున్నాడు. బహుగుణవంతుడు, అతని మనస్సొకటి - మాటయొకటి

కాదు. ఉత్తరమేకాదతనికేమియయిన నియ్యవచ్చును. ప్రాణముపోవు స్థితివచ్చినను రహస్యములు బయటబెట్టడు. అతని స్వభావము నేను పూర్తిగ నెఱుగుదును. మీ చేతియందున్న యుత్తరమెక్కడిది?

నాగ:- ఇది యతడిప్పుడే యిచ్చినాడు. విలాసము మీపేరనేయున్నది.

కుశీ:- మనమందరము నొకటియేయని యాతడెఱుగును. లేకున్న నాత డీయడు.

నాగ:- ఊరక యిచ్చినాడా? ఎన్నియో నమ్మకములు చెప్పవలసివచ్చినది. నాచేత ప్రమాణము చేయించినాడు. తనకెట్టులో నమ్మకము కుదిరి యుత్తరమును గోప్యముగ గుర్తులతో భద్రపరచి, చేతిలో చేయి వేయించుకొనిఎట్లో యివ్వలేక యిచ్చినాడు.

కుశీలుడా భద్రపరుపబడిన లేఖను వెలికిదీసి తదేకముగ పఠింప దొడగెను. అతనిమొగమంత దర్శనీయమైనది గాకున్నను, జాబునందలి యొండు రెండు పంక్తులు చదువుకొన్నతడవుగ మోము కళకళలాడజొచ్చెను. కనుల యానంద భాష్పములు క్రమ్మెను, మేనుపొంగెను. ఆ క్రొత్తయుల్లాసము నాగసేనుడు గ్రహించి తమరినేదియో విశేష మాకర్షించియుండవలెను. సంతోషముతో నుబ్బితబ్బిబ్బగుచున్నారు. ఏదీ? యొకసారి యుత్తరమిటులిండని తటాలున దానిని లాగికొని యత్యాసక్తితో చదివెను వానిదేహము నానబెట్టిన సెనగగింజవలె నుబ్బెను. 'నమ్మిన తురక దొరలనే నమ్మవలెను'. ఆ యిర్వురు నుత్తరమును మఱిమఱి చదువుకొనుచు తురుష్కమంత్రిని ప్రశంసించుచు నిష్టమీదేరెనని చక్కలు గొట్టుకొనజొచ్చిరి. ప్రారంభించిన కార్యములు ఫలోన్ముఖములగునెడ నెవ్వరికేని యిట్లుండుటసహజము.

ఆ యుత్తరమునందలి విశేషములివి.

జైనమతోద్ధారకులైన కుశీల మహాశయులకు ఢిల్లీ పాదూషావారి

యాంతరంగిక సచివుడు అసఫ్‌ఖాన్‌ను డనేక సలాములచేసి వ్రాయులేఖా ర్థములు.

మిత్రవర్యా; మీరు రహస్యముగ చారులవలన పంపిన యుత్తరము చేరినది. సంగతులు విశదమైనవి. పాదుషావారితో నాలోచించితిని. మీరు కోరిన ప్రకారము దేశము నలుమూలల నైదుగ్రామములు - ఒకలక్ష దినారములు, గజాశ్వరాజములు నింకను ననేక ధన కనక వస్తువాహన ములు మీకీనాముగ నిచ్చుటకు పాదుషావారు సంతోషముతో సమ్మతించిరి. మీ ప్రతిజ్ఞలను శీఘ్రకాలమున నెరవేర్చవలెను. ఏక్షణమున నెంతసైన్యము నెచటకు పంపుడనిన పంపుటకు సిద్ధముగా నుంటిమి. రుద్రుని పట్టియిచ్చు భారము మీయందున్నది. జవాబత్యావశ్యకము.

ఇట్లు

(పాదుషా మొహరు) పాదుషావారి యాంతరంగిక సచివుడు

ఈ యుత్తరమునకు తగిన సమాధానమును పాదుషాసన్నిధికివ్రాసి విస్రంభ పాత్రులైన వేగులవలన దానిని ఢిల్లీకి పంప నిశ్చయించి నాటికి సభ చాలించిరి.

# 8

జగతి వార్తయందు వర్ధిల్లుచున్నది. వార్త తెలియనినాడు సమస్త జనులు తమతమ కార్యముల నడపుకొను వెరవులేక చిక్కుల బడవలసి యుండును. కాన ప్రతివ్యక్తియు వార్తనభిలషించును. బహుకార్య ధురంధరులైన చక్రవర్తులు వార్తలు నిర్వహించుటకు విశేషప్రాముఖ్యమునిచ్చెదరు. కనుకనే 'వార్త నిర్వహింపవలయు పతికి' యని మహాభారతము వక్కాణించుచున్నది.

వార్తానిర్వహణము చారులపై నాధారపడియున్నది. వారు పరన్య

పాల రంధ్రాన్వేషణము నగ్గుపాలతో నేర్చియుందురు. ప్రచ్ఛన్న వేష ములు వేయుటయందగ్రగణ్యులు. బహుభాషా నిపుణులు. భావప్రచారమతి గుప్తముగ నుండును. చారులవలన భూభర్తలు సమస్త సాహితిక విషయ ములను గ్రహింతురు. భూపతులకు చారచక్షువులని నామము సార్ధకమగు చున్నది. రాజుల సమస్త విజయములను వీరినాశ్రయించియుండును, గనుక వీరు రాజభక్తి పరాయణులు, దేశహితైకాభిలాషులునై యుందురు. దేశో పద్రవ సమయములందును కాకతీయ దండయాత్రల సందర్భమునను వీరి సాహాయ్యము ప్రభువునకెంతేని యావశ్యకము.

కాకతీయ చారబృందము కడు సమర్థులు, వివేక నిధులు, ధైర్య సాహసోపేతులునై దేశరక్షణకు సహస్రనేత్రులై దివారాత్రములు పని చేయుచుండ, ఢిల్లీయందలి తురుష్క చారసమూహముకూడ ఉల్లూఖానుని కనుసన్నల మెలగు బహు సమర్ధముగ తమ విధుల నిర్వహించుచుండిరి.

నాడు ఢిల్లీలో నుల్లూఖానుని దర్బారు జరుగుచుండెను. దర్బారుకు నుండవలసిన ప్రముఖులందరు నుండిరి. పాదూషా యెదుట మల్లిక్ తైమూరు, మల్లిక్ తగీన్, మల్లిక్ అఫ్ఘన్, మల్లిక్కాఫరను సైన్యా ధ్యక్షులు బంగరుటాసనముల నలంకరించిరి. మంత్రి సామంతాదులు పరివే ష్టించియుండిరి. ఉల్లూఖానుడు సమున్నత చంద్రశిలావేదికపై రత్నఖచిత సింహపీఠినాసీనుడై చారుల రాకను నిరీక్షించుచు హుక్కా మెల్లమెల్లన పీల్చుచుండెను. అతనికిరుపక్కలు వింజామరలు వీవబడుచుండెను. వాని నుండి పుట్టిన పిల్లగాలులచే నారవి బొమిడికయందు పచ్చకెంపు తురాయి కుచ్చు కదలుచుండ తత్కారితేచ్ఛ కొల్వుకూటము క్షణక్షణ చాంచల్యమున బహువర్ణ కిమ్మరితమై భాసించును. ఆ మూర్తి మొగమున చూడ్కులు నిగుడించి హోమరావులు సావధానముగ నుండిరి. అతనియజ్ఞమెట్టిదో చీమయైనచిటుక్కుమన్న నవ్వడీ లేదు. పేరోలగము వింజమూకిడినయట్లున్నది.

అంత సర్కారు లిద్దరు చారుల వెంటనిడుకొని సుల్తాను సమక్షమునకు వచ్చిరి. చారులు తలపాగలుతొలగించి మోకరిల్లి సలాములుచేసి చేతులు కట్టుకొని యెదుట నిలచిరి. అంత తురుష్కమంత్రి వారినిచూచి యిట్లనియెను.

తు:- మీరేపట్టణములవీక్షించితిరి. ఏయేవిశేషముల గ్రహించితిరి. త్రిలింగ రాజ్యముయొక్క వర్తమానస్థితులెట్లున్నవి? ప్రతాపరుద్రుని పరిపాలనా విధానము, ప్రజానురాగమునుగూర్చి మీరు గ్రహించిన విషయములను విస్పష్టముగ పాదుషావారికి నివేదింపుడు.

చారు:- చిత్తము - ప్రభువువారియాజ్ఞ తలదాల్చి మారువేషములతో రహస్యముగ పల్లెలనక పట్టణములనక త్రిలింగరాజ్యము నందందు తిరిగితిరిగి పోయినతోవపోక వచ్చినదారినరాక యిచ్చమై వలుచోట్ల తిరిగి పెక్కు సంగతులు తెలిసికొనివచ్చితిమి. ఆంధ్రరాజ్యము సోయగములకు నిలయమై, సౌఖ్యములకు పుట్టినిల్లై సుభిక్షముగ నున్నది. దర్శనీయములైన రమ్యస్థలములనేకములు. సెలవైనచో వారియభ్యుదయమును విన్నవింతుము.

తురు:- వలదు వలదు ప్రభువువారా విశేషమును పూర్వమే వినియున్నారు క్రొత్త సంగతులు కావలెను.

చారు:- చిత్తము.

ఓరుగల్లు కన్నార కంటిమి. కొన్నాళ్ళుందుంటిమి. శిల్పకళాసౌందర్యమందలి ప్రతిగోపురమున స్తంభమున ముద్దులు మూటగట్టుచుండును. మదపుటేనుగులునటులను నృత్యముగరపునట్లుండును. తురంగములువీధుల బోవు దృశ్యము దర్శనీయము. ఇట్లు రాజపథము బహు సమగ్ర ఘటిక శకటికాభటసంకులము. నగరశృంగారము, వైభవము, యంత్రనిర్మాణ సౌష్ఠవము వర్ణింపనలవికాదు. ఆ ప్రజల భాగ్యమే భాగ్యము. ఆ నగర

దర్శన లాలసులై ప్రజలు మక్కాకుపోవు మహమ్మదీయుల వలె పోవుదురు.

తురు:- మంచిది. రుద్రభూపతి సైన్యమెంత? సేనానుల సమర్థత యెట్టిది? రాస్త్రవస్తుసామగ్రి యెట్టిది?

చారు:- తెలుగురాజునకు యుద్ధప్రవీణులైన వీరభటులు తొమ్మిది లక్షలు కలరు. వారికి యుద్ధమనిన పండుగ. శూరత్వము, దేహదార్ఢ్యము వారి సొమ్ము. సముద్రము నీదమనిన, నగ్నియందు దుముకమనిన వారు వెనుదీయరు. గుఱ్ఱపుదళము వారికి మిక్కుటము. అవసరముకొలది సైన్యమును పెంచుటకవకాశమున్నది. కోట బురుజులయందు శత ఘ్నులు నింపబడియుండును. యుద్ధసామగ్రి నుత్పత్తిచేయు కర్మాగార ములు నిరంతరము పనిచేయును.

తురు;- ఆంధ్రమంత్రుల సామర్థ్యమెట్టిది?

చారు:- మంత్రివర్గమున ప్రధానపీఠము నలంకరించిన ప్రముఖుడు నాగయ గన్నమంత్రి. అతని మంత్రాలోచన మభేద్యము వాని మేధాసంపత్తి భావగాంభీర్యము, దేశరక్షణకు పెట్టనికోట. అతనికి దేశమునగల గౌరవము ప్రభుతుల్యమైనది. ఇతనికి తగిన ప్రభువు రుద్రభూపతి. ఆరాజునకు తగిన మంత్రిశేఖరుడు నాగయగన్నమంత్రియని అచటి ప్రజల భావము. మంత్రి గుణవిశేషములు బడిపిల్లలకుకూడ సుపరి చితమైనవి.

తురు:- వారి సేనాపతుల పరాక్రమెట్టిది?

చారు:- వారియుత్సాహము చెప్పనలవికాదు. వారియందు బేతాళనాయకు డగ్రగణ్యుడు. శాత్రవ వనవీతిహోత్రుడు. మహమ్మదీయులపేరు వినిన మ్రండిపడును. కయ్యమునకు కత్తిదూయును. ప్రతాపుని యధి కార వర్గమునందగ్రగణ్యుడితడు. కమ్మకులాలంకారుడు. తరువాత

పేర్కొనదగిన సేనాధ్యక్షుడు ఇదులూరి యన్నయ. గన్నమంత్రికి ప్రియపుత్రుడు. మహా శౌర్యరాశి. యోలూరి రాజులనుగెల్చి 'రాయ చౌహత్తమల్ల' బిరుదమును పొందెను. పెక్కు దుర్గములను జయించి "స్థలగిరి వనదుర్గ జలకోటమల్ల" బిరుదము గలవాడు. ఇతడైదు లక్షల కాల్బలమున కధినాథుడు. కళింగ గజపతులీతని శౌర్యాగ్నికి వెరిచి పరభూములపాలైరి పిమ్మట చెప్పదగిన వాహినీపతి ఇందు లూరి రుద్రుడు ప్రతాపరుద్ర సేనాపతులలో నితడొకడు. కొలని ప్రతాపరుద్రుడుగ సుప్రసిద్ధుడు. త్రిలింగసామ్రాజ్య దీక్షాదక్షుడు. దక్షిణ దేశమును జయించి 'ఖాహత్తరి దుర్గనాయక' బిరుదశోభితుడయ్యెను. బహువిధాయుధ విద్యాచార్యుడు. బ్రాహ్మణుడు. ఆంధ్రుల గజబలము మిక్కిలి పటిష్టమైనది. మహావీరుడు జయప సేనాని కాలమునుండియు వీరి గజబలము నిత్యనూతన సంవర్ధితమైనది. ఈనాడుకూడ వారి గజ బలము శత్రుదుర్భేద్యమై జెండపూడి యన్నయమాత్యుని నాయకత్వ మున వర్ధిల్లుచున్నది. ఇతడు ప్రతాపరుద్రుని కుడిభుజము. వీరకంపిల రాయని జయించిన మహావీరుడు. ముప్పిడి సేనాపతియొకడు దక్షిణ దిగ్భాగమును జయించి యిచట ప్రతాపునకు రాజప్రతినిధిగ ప్రఖ్యాతి వహించెను. వారియాశ్వికదళముకూడ సురక్షితమైనది. దానికి సర్వాధి కారి సాహిణి మారుడు. ఆంధ్రదేశమున శౌర్యసంపదలకు పేర్కొన దగినవారు రేచర్ల పద్మనాయకులు. వీరు చేవల సేనాపతులేగాక రాజా శ్రయమునొంది రాజప్రతినిధులైరి. రాజు వీరికి 'పంచపాండదళవిశాళ కంచికవాట చూరకారాది బిరుదములను ప్రసాదించెను. పైనుదహ రించిన సేనాధ్యక్షులేగాక యింకను కాయస్థ సేనానులు, భోజారెడ్డి సోమయ వెంకన్న, బమ్మనాయనింగారు, రుద్రనాయకుడు మున్నగు పెక్కురు సేనానులుండిరి. వీరందరును ప్రభుభక్తి పరాయణులై

యుద్ధ సన్నాహములు చేయుచున్నారు.

తురు:- అచటి మంత్రాలోచనా సామర్థ్యమెట్టిది?

చారు:- మనయాలోచనలెట్లో యచట పొక్కినవి. మన సన్నాహములను గూర్చి యావీరముఖ్యులందరికి తెలిసినట్లున్నది. దేశము నలుమూలల నుండి దళవాయులను, వివిధ సేనల నోరుగంటికి సమీకరించు చున్నారు.

తురు:- గోడలకు చెవులుండునా యేమి? మన రహస్యములు వారికి తెలి యుటా? మన తీర్మానములుకూడ వారికి తెలిసియుండునా? నగరమున శత్రువుల గూఢచారులుండిరేమో విచారింపవలసియున్నది.

చారు:- చిత్తము.

తురు:- వారి రహస్య సమావేశ తీర్మానములేమైనా తెలిసినవా?

చారు:- యుద్ధమునకు ప్రతియాంధ్రుని సంసిద్ధుని చేయుటయే వారి మొదటి తీర్మానము. కానియొక రహస్యము; అదేమన యీ సంరంభమంతయు రాజుతో నిమిత్తములేకనే నడచిపోవుచున్నది.

తురు:- అదెట్లు?

చారు:- రాజు పరోక్షమునగూడ నిట్టి ప్రధానవిర్ణయములుజరుపుట ఆంధ్ర నాయకుల విశేషము. రాజు వేటకేగి కొన్నిదినములైనది.

సుల్తాను:- (మహోల్లాసమున ముందుకువంగి) వహ్వా! ఇది మంచి యవ కాశము. ప్రతాపరుద్రుని వనములోనే బంధించి పగదీర్చుకొనుటకు మంచి యదను దొరికినది.

సుల్తానంతట తగిన రీతిని వారిని బహూకరించి కొలువుసాలించిన పిమ్మట నేకాంతముగ మంత్రినిట్లు రహస్యముగా సంభాషించెను.

ఉల్లూ:- మంత్రి సత్తమా! ఓరుగంటిరాజు సామర్ధ్యమెంతటిది? నాగయ గన్నమంత్రి మంచిశక్తిగలవాడు. ఆకసమును మూటగట్టగలడు. రాజు వేటపిచ్చిబడి కానకదురుగుచుండ తాను దండుగూర్చి మొగరమున కొగ్గుచున్నాడట. కలహమనిన నతనికి పికరులేదు.

మంత్రి:- సర్కార్ తమరన్నట్లు నాగయమంత్రి యట్టివాడే. అతని బంధమున మన సమస్య పరిష్కారమగును. అయినను యుద్ధమునసూటిగ నెదిరించి వానిని జయింపలేము. ఉపాయాంతరమైన దానమో లేదా భేదమో ప్రయోగించవలెను. లేకున్న జయము సమకూరదు.

ఉల్లూ:- శత్రువును లొంగదీసికొనుటకు సామము, దండము నేడు కుదరదు. ఇక దానభేదములలో నొకదానిని ప్రయోగించవలెను భేదోపాయమునకు మంచియవకాశము కలుగవలెనుగదా!

మంత్రి;- చిత్తము. భేదమునకిపుడు మంచిమార్గమేర్పడియున్నది.

ఉల్లూ:- ఏమది?

మంత్రి:- ప్రతాపరుద్రుని విషయమున జైనులకు ద్వేషము మిక్కిలిగ నున్నది. అది మతవిషయమైనది. అది దినదిన ప్రవర్ధమాన మగుచున్నది. మతిద్వేష మన్నిటికంటె బలవత్తరమైనదిగదా! జైనులలో కుశీలుడతి సమర్ధుడు. వాని సమాలోచనము-నిష్కళంకము-నిర్దుష్టము. వాని మైత్రితో త్రిలింగదేశము వరకు వశమగునని నా నిశ్చితాభిప్రాయము.

ఉలూ:- మంచిది అట్లయిన నా కుశీలుని స్నేహమునేల సంపాదింపలేదు? ప్రయత్నహీనుడేకార్యమును చేయలేడు. ఎవ్వరినిసాధింపలేడు. సత్వర ప్రయత్నమావశ్యకము.

మంత్రి:- కుశీలుని మైత్రినిదివరకే సంపాదించితిని. మన సేనానులను

కలిసి కార్యాలోచనచేసి యుద్ధయత్నము జేయుచుంటిని. కుశీలునిలో నుత్తర ప్రత్యుత్తరములు జరుగుచున్నవి. ప్రయత్నము తురుష్క సామ్రాజ్యమున కనుకూల పడుటయేగాక శీఘ్రకాలమున త్రిలింగ రాజ్యము తమకు వశమయి తీరును.

ఉల్లూ:- సెహబాస్! జైనుల యూహాపోహాలు గమనించి కార్యసాఫల్య మొనరింపదగును. ఇంతకు కుశీలుని కోరికయేమి?

మంత్రి:- అతనిమైత్రి అత్యంతకాలమున మహత్తరమైనలాభము కల్గింప గలదు. ఆంధ్రదేశమును తురుష్కరాజ్యము చేసెదననియు రుద్రుని పట్టియిచ్చెదననియు కుశీలుని దీక్ష. ఆతడు క్రియాదక్షుడు. అతనిమైత్రి అభిలషింపదగినది కత్తి పట్టకయే విజయమును పొందవచ్చును

ఉల్లూ:- మంచిది. ఒక సామాన్య కుటుంబమున పుట్టిన కుశీలుడిట్టి రాజకీయ తంత్రమును నిర్వహింపగలడా!

మంత్రి:- సంశయింప జనదు కుశీలుడు జైనులకు రాజకీయ నాయకుడు. మిక్కిలి శక్తిసామర్థ్యములు గలవాడు. జైనుల నందర నేకతాటిపై నడుపుశక్తిగలవాడు. జైనులకు యుద్ధవిద్యలనునేర్పి యోధులనుగ తయారుచేయుచున్నాడు. మనకు వీరి సహాయ్యము తప్పక కలుగును. అదియునుగాక వీని స్వాధీనమున కొంత యాటవిక సైన్యము గూడ కలదు. ఆమీదట ప్రతాపరుద్రుని సేనాపతులలో నొకడైన భోజారెడ్డి తో నితనికి గాఢమైత్రి గలదు.

ఉల్లూ:- ఆమైత్రి మనకెట్లు ప్రయోజనకారి?

మంత్రి:- మనవిసేయుదును తెలుగువారిలో కులద్వేషములు కలవు. అవి లేకున్నచో వారిని మనము తేరిచూడగల్గెడివారముకాదు. అచటి రెడ్లకు వెలమలకు - కమ్మకాపుకులములకు పరస్పరద్వేషములున్నవి. ముఖ్య

ముగ ప్రతాపుడు కమ్మ వెలమ వీరులపై విశేషాదరాభిమానములను చూపుచుండెనని రెడ్లకు రాజుపై ద్వేషము పెరిగినది. ఈ కులమత ద్వేషములే వారి రాజ్యము బలహీనమగుటకు కారణములగుచున్నవి.

ఉలూ:- ఇప్పుడు నీవుచెప్పిన విషయాలు పరస్పరము అతుకుచున్నవి. నీ భేదోపాయతంత్రమును ప్రయోగించి వారినందరిని నీవు స్వాధీనము చేసికొనవలెను.

ఇట్లు నాడు ముఖ్య రాజకీయములను గూర్చి సుదీర్ఘ చర్చ గావించిరి. ఆ తురుష్క ప్రభువునొద్ద సెలవుగైకొని మంత్రి తన కార్యములందు నిమగ్నుడయ్యెను.

దండకారణ్యసమీపమున నిర్వురు ముసల్మానుల వేషములు ధరించి శరీరమున ముచ్చెమటలు గ్రమ్ముచుండ నశ్వారూఢులై మహా వేగమున బోవుచుండిరి వారు వనమునందున్న రుద్రభూపతికొక రహస్య లేఖను గొనిపోవుచుండిరి. వారు చూచుటకు సామాన్య వార్తాహరులవలె లేరు. సుశిక్షితులైన సైనికులవలెనున్నారు. వారు మహాందోళనలో నుద్విగ్న మనస్కులై యున్నారు. ఇట్లు పోయిపోయి యా యశ్వములు రుద్రభూపతి విడిదిచేసిన పటకుటీర సమీపమున నాగినవి. ఆభటులశ్వావరోహణముగావించి లోనికి జని రాజును దర్శించిరి. తలవంచి నమస్కరించి నాగయగన్నమంత్రి లకోటా వేసియిచ్చిన లేఖను నృపునియెదుట బల్లపైనిడిరి. ప్రక్క కోసరిల్లి కైయోడ్పులతో నిలిచిరి. రాజు వారి ముఖమున తాండవించు నాందోళనమును గ్రహించెను ఇది యత్యవసరలేఖ యని గ్రహించి యన్యప్రసంగములుమాని దాని నామూలాగ్రముగ నిట్లు చదువుకొనెను.

శ్రీమన్మహా మండలేశ్వర, రాజాధిరాజ, రాజపరమేశ్వర కాకతీయ వంశోద్ధారక! శ్రీశ్రీశ్రీ ప్రతాపరుద్ర మహాపతి సన్నిధికి విధేయుడు నాగయగన్నమంత్రి వందనపూర్వకముగ విన్నవించు ముఖ్యవిశేషములు

రాజేంద్రా!

ఢిల్లీసుల్తానుల్లూఖానుడోరుగంటి ముట్టడిని తలపెట్టి సైన్యముల నాంధ్రదేశపు నలుదెసలకు పంపుచున్నాడు మల్లిక్, ధగీర్, మల్లిక్‌అఫ్గన్ సేనాధ్యక్షులు పదిలక్షల సేనతో బయలుదేరినట్లు వేగువలన తెలియవచ్చినది. మల్లిక్‌కాఫర్ కొంతసైన్యముతో తమను బాధీకృతుని చేయుటకు దండకారణ్యప్రాంతమునకు వచ్చుచుండెను. తాము మృగయావినోదమును మాని శీఘ్రము నగరప్రవేశముగావింప ప్రార్ధితులు లేనిచో విపరీత పరిస్థితులేర్పడవచ్చును.

తమ దర్శనార్థమై యెదురుచూచు—
నాగయగన్నమంత్రి.

మంత్రి మొహరు.

రుద్రభూపతి ప్రతివిషయమును స్వయముగ పరిశీలించును కనుచో గ్రుడ్డితనమును వినుచో బధిరత్వమును నాయనకు లేవు. అనుక్షణము ప్రజాపాలనమున నప్రమత్తుడై యుండువాడు.

ఈ లేఖయందలి నొండు రెండుపంక్తులనుచూచి క్రోధారుణనేత్రుడయ్యెను. భృకుటీనటనా కఠోరుడయ్యెను. క్షణములో నాతడు కోపము రూపుదాల్చినట్లయ్యెను. ఆరూపము రుద్రరూపము అదిశత్రుసమూహసంతాన హేతువు - ఈ యాకస్మికపరిణామమునకు తత్సన్నిహితులు భయసంభ్రమవశులైరి. వారు గుసగుసలుపోయిరి. వారికి కారణము పాలుబోలేదు. రాజంతట వేటకార్యక్రమము నుపసంహరింపజేసి కొంతపరివారము నట నుండి నాజ్ఞాపించెను. సన్నిధానవర్తియైన నొక భటునకు తనవేషముల

మార్చి, తనకై కొనిరాబడిన నశ్వరాజమునెక్కి తక్కుంగల పరివారముతో వనభూమిని నిష్క్రమించెను. ఆతడతిరహస్యముగ నగరముచేరి రాజప్రాసాదమును జొచ్చెను. ఈ వృత్తాంతమంతయు రహస్యముగనిర్వహింపబడెను.

# 10

పొడువుకొండను వెల్గు నభోమణియన
నిద్దపు పసిండి సింగపు గద్దెపైన
తేజరిలు జగన్మోహన దివ్యమూర్తి
కాకతీయాన్వవాయ సుధాకరుఁడతండు.

ఆ కొలువుకూటము రమ్యాలంకృతమైనది. కుడ్యములు పసిడి మలాము చేయబడి నీడలు తేరుచున్నవి. వానిని వీక్షించువాడు తిలకమును దిద్దుకొనవచ్చును. దూలములు చందన తరుకాష్ఠ నిర్మితములు. స్థంభములు బహురత్న ద్యుతిమేదురములు. గవాక్షములు చిత్రవర్ణభూషితములు. ప్రధానద్వారము నాటి కాకతీయ శిల్పశైలికి ప్రత్యక్ష ప్రమాణముగ నున్నది. భవనమున మార్పబడిన దేవీదేవతా విగ్రహములు బహురమ్యములు. పూర్వాంధ్రవీరుల వర్ణచిత్రములు కుడ్యములపై నలంకరింపబడియున్నవి. ఆ మందిర శోభ వర్ణనాతీతము. ప్రభువాసీనుడగు సింహపేఠి స్వర్ణమయమై బహువిధ రత్నస్థగితమైనది తత్కాంతిచ్ఛటలు కనుల మిరుమిట్లుగొల్పుచుండెను.

ఆనాటి సమావేశము మిక్కిలిరహస్యమైనది. దానికి మంత్రులు సేనాపతులు, మండలాధిపతులు, సామంతరాజులు రాజ బంధువులు విచ్చేసిరి. మంత్రి దండనాధుడిట్లు ప్రభువుతో ముచ్చటించిరి.

మంత్రి:- ప్రభువర్యా! మీరు నగరమునలేని సమయముచూచి గోహంతకు

లైన మహమ్మదీయులు మనపై దండయాత్ర సేయ యత్నించు చున్నారు. అయిననేమి? క్రౌర్యపు గొఱ్ఱె కొండనుఢీకొనిన నేమగును? వారియాట కట్టించెదను. ఓరుగల్లు ప్రవేశించు దుర్గ ద్వారములకు సుశిక్షితులైన సైన్యములు కలవు. కయ్యమునకు కాలుదువ్వు మ్లేచ్ఛావు లెటుపోగలరు?

ప్రభువు:- దుర్గద్వారముల రక్షణ ప్రధాన విషయము. ఇంకను చేయదగిన కార్యములయెడ జాగరూకత వలయును.

సేనాపతీ! చోముసమూహము లైకమత్యమున నుండెనుగదా!

భేతా:- సైన్యములందు, సేనాపతులందు భేదభావములేక అందరు నొక్క త్రాటిపై నడుచుచున్నారు.

ప్ర:- దేశరక్షణకు సైన్యమే ముఖ్యాంగము సైన్యమభివృద్ధి గావించుట మన కర్తవ్యము.

మంత్రి:- ప్రభువునకు భటవర్గమునకు నన్యోన్య రక్షణముండి తీరవలెను. లేనియెడల పరస్పరావగాహనముండదు. దేశాభిమానము రాజభక్తికిగల సైన్యమును విజయలక్ష్మి వరించును కనుక సైన్యమును కన్నబిడ్డల వలె సమాదరించుట మన విధ్యుక్త ధర్మము.

ప్రభువు:- సైన్యమునందు భేదాభిప్రాయములులేక ఐక్యముగ నుండునట్లు చూచుట సేనాపతి ధర్మము.

భేతా:- సైన్యమునందు సేనాపతులందు నరపొరలులేవు. యువజనులతో సైన్యసంపద విస్తరించినది. రక్తోదకముచే దేశమాత కాళ్ళుకడుగుటకు యువజనులు సిద్ధముగా నున్నారు. మహమ్మదీయుల నెదుర్కొనుటకు సైన్యములో మహోల్లాసము చెలరేగుచున్నది.

రాజు:- అనుమకొండసైన్యము దిగినవెంటనే మంచివసతినేర్పరచి భోజన పదార్థములను నగరమున నిలువచేయవలెను.

భేతా:- ప్రభూ! సర్వము సిద్ధముగ నున్నవి. శతఘ్నులు కోటలో పుష్కలముగ నున్నవి. వివిధాయుధ విద్యలలో నారితేరిన వీరభటులు తొమ్మిది లక్షలకుపైగ నున్నవి. దుర్గరక్షకులై విక్రమోపేతులైన మైలారుభటులు వేలకువేలు దివారాత్రములు దుర్గ రక్షణ గావించుచున్నారు. సైన్యమునకు భోజన సామగ్రి యక్షయముగ నున్నది.

బేతా:- ఈ ముక్కిడి పకీరుల నుక్కడిగించుట యెంతపని? తమసెలవైన యుత్తరక్షణముననే విజయధ్వజమెత్తించెదను.

మంత్రి:- వీరాగ్రణీ! చిన్నపామునైనను పెద్దకఱ్ఱతో కొట్టవలెను. వాక్శూరత్వముకంటె కార్యశూరత్వమావశ్యకము. నీవు నిరంకుశ ప్రతాపశాలివి. కర్తవ్య పరాయణుడవై దేశరక్షణ గావించి చరితార్థుడవు గమ్ము.

బేతా:- చిత్తము.

ఇంతలో నొకవిచిత్రవ్యక్తి రాజానుమతితో సభలో ప్రవేశించి యిట్లు ప్రసంగించెను.

"జైనులు చెలరేగి మనకననుకూల శత్రువులుగ నున్నారు. వారిని శిక్షించినగాని మనకు విజయము చేకూరదు. వారిని సాధారణ పౌరులుగ, మతాచార పరాయణులుగ నుపేక్షచేయుట తగదు. ఇప్పటికే వారి దేశద్రోహ చర్యలు ప్రుతిమించినవి.

ప్రతా:- (కనుబొమలు చిట్లించి) - దీనికి తార్కాణమున్నదా?

క్రొత్తవ్యక్తి:- ఉన్నది ప్రభూ! నేను చారులవలన పెక్కు రహస్యము

లను గ్రహించితిని. నిన్న జైనులు పాదుషాకు వ్రాసిన యుత్తరము నాచేజిక్కినది.

అని లేఖను రాజసమ్ముఖమున బెట్టెను. రాజు దానిని తిలకించి యుగ్రుడై కుశీలుడు మొదలైన జైననాయకులను, కారాగారబద్ధులజేయుట కాజ్ఞాపించెను.

ఆ నూతన వ్యక్తి ఎవరోకాదు - చారుమతి తండ్రియైన మేధావి. రాజ్యరక్షణలో నిరంతరము శ్రమించు దేశభక్తుడతడు.

అంతట రహస్య సమావేశము సమాప్తమయ్యెను.

# 11

కాలుడను చిత్రకారుడు తొగరు రంగును చిత్రించిన సాలభంజికల వాడ్పున తీరులతాగుల్మములు లేఁజిగుళ్ళతో నలరినది. ముడువుల నీళ్ళె నటి నీళ్ళపోల్కి కళపెళ క్రాగదొడగినవి. చేపజెల్లల జీవనములు జీవన ములతో నింకుచున్నవి. కాకములతికి యతకవి ముక్కులతో తమ పిల్లల వెంటనిడుకొని కంఠస్వరము కూరిన కోయిలపాపలకు గూటిని జోటివ్వక తరిమితరిమి పొడవదొడగినవి. జారిణీజార సంబంధ మిట్టిదేగదా! తమకు లొంగియున్న కూరిమి, లేకున్న క్రోధము వెలిబుచ్చుచుందురు. ఆనెయ్యావు నైజమట్టిది.

ఓరుగంటి విపణివీధులందు పసిడిబంతుల క్రీడించుచు మామిడి పండ్లు గుమగుమలాడు పరిమళములతో కనువారి హృదయముల నాకర్షిం చుచున్నవి. శ్రీమంతులు పడగాడ్పుల తీవ్రతతోడి మంచిగంధపు మైపూత లతో ప్రమదావన విహారమున కరుగజొచ్చిరి. ఎడనీళ్ళతో దాహశాంతిని పొందజొచ్చిరి. గ్రీష్మ మోరుగంటి నిండుగ వ్యాపించినది.

ఓరుగంటినొక పుష్పవాటికమధ్య సైన్యాధిపతి భోజారెడ్డి సౌధము గలదు. ఆ సౌధము కొత్తదిగ వెల్లవేసినది. దానిగవాక్షరముల వట్టివేళ్ళ తడికలుకట్టి చిమ్మలగొ్రివులతో శీతలజలములను చల్లుచుండిరి. కమ్మ తావులు నలుదిశల వ్యాపించుచుండెను. ఆ ప్రాసాద ప్రాంగణము సువి శాలమైనది. దానికభిమార్గముగ శిల్పాభిరామమైన కేళాకూళి కలదు. అవి గ్రీష్మతాపము నపనయించునదివోలె జలభరితమైన జలేజమాలికాదర్శనీయ మై తదావరణమునకు శోభను కల్గించుచున్నది. ఆసౌధమునుండి అశ్వీక శకట మొండు నాటి యుదయముననే బయలుదేరి మహావేగమున నగర పరిసరముల దాటి దండకవనాభిముఖముగ పోజొచ్చెను. అది యరణ్యము లను పుష్పవనవాటికలను నదీనదములను పర్వతముల నతిక్రమించి సాయం సంధ్యాసమయమునకు మేధావి యా కుటీరిట ముంగిట నిలిచెను. బండి యవనికలచే నాచ్ఛాదింపబడియున్నది. అందు నల్వురు విక్రమోపేతులైన వీరులాశీనులైయుండిరి. ఆ యశ్వద్వయము కండలుతేరి సమున్నతములై నవి. సుదీర్ఘ పయనముచే నాసికాముఖద్వారముల నురుగువులు గ్రక్కు చున్నవి.

ఆశ్రమము ముంగిట నిర్వురు చెలికత్తెలు పూలమొక్కలకు నీరు పోయుచుండిరి. బండితోలునతడు వారిముందుకు వచ్చి మేధావి యునికిని గూర్చి ప్రశ్నించెను. అతడాశ్రమమున లేడనియు. వారి జాడలు తమకు తెలియదనియు పరిచారికలు చెప్పిరి. బండియందున్న వీరభటులీవార్త విని యాశాభంగము నొందిరి. పరిసరములను కలయజూచి వారు మేధావిని బంధింపలేనందులకు విచారించి మరల నొక క్రొత్త దారిని పట్టిరి. కొలది దూరముననే సరోవరమునుండి జలకుండికను కటిపై గీలించి వయ్యార ముగ వచ్చుచున్న చారుమతిని గాంచిరి. మేధావిపైగల పగను సాధించు టకు మార్గాంతరములేక వారామెను బలవంతముగ రథముపై నిడుకొని

పోజొచ్చిరి. ఆమె తద్భయంకర స్థితికి నిశ్చేష్టయై మూర్ఛాగతమయ్యెను. ఇట్లారథము మహావేగమున నుత్తరదిశగా పోయెను.

ఆనాడు శుక్లపక్ష తదియ. సందె చనిన వెంటనే చారుడు మాయమయ్యెను. చీకట్లుక్రమ్మెను. తమాల పల్లవ సమూహములు తదంధకారమున రాజ్యము జేయుచుండెను. పిట్టపల్లము లొక్కటియయ్యెను. మతోన్మాదమువలె, హేతురహితమైన మూఢవిశ్వాసమువలె వెలుగు స్పర్శలేని కారుచీకట్లు దిశలావరించెను. ఆమె మూర్ఛనుండి తేరుకొని దుఃఖింపదొడగెను. ఆమె ఏకాకి. ఆమె మొరాలించువారు లేరు! మింట చుక్కలు దివ్వెటీలవలె ప్రకాశించుచుండెను. ఆతారల గుడ్డివెలుగులో వారు ముందునకు సాగుచుండిరి ఇట్లా శకటము సుదూరము పయనించి యొక గుడారము ముందాగెను. చోదకుడు శకటము దిగి గుడారములోనికేగి జరిగిన విషయమంతయు వివరించెను. చోదకుడెవరోకాదు, జైనుల నాయకుడైన కుశీలుడు. ఆ భటులు ఆయుధవిద్యలయందారితేరిన జైన ప్రముఖులు. గుడారమునందున్న మహమ్మదీయులు మేధావి పట్టుబడనందుకు మిక్కిలి విచారించిరి.

కుశీలుడు మహమ్మదీయ నాయకునితో "మీరుకోరినట్లు మేధావిని బంధింపలేకపోయితిమి. మేముగొనివచ్చినది ఆతనిముద్దులపట్టి చారుమతి. ఈమెను బంధించుట యనగ మనము మేధావిని చేజిక్కించుకొనుటయే సుమా! జాగ్రత్తగ వ్యవహరింపుడ"ని హెచ్చరించి చారుమతిని వారి కప్పగించి రహస్యముగ జైనులు తమదారిన శకటారూఢులై పోయిరి. ఆమె మఱునాటికి ఢిల్లీరాజప్రాసాదమునకు గొనిపోబడెను.

# 12

దొడ్డి బందించి కొట్టిన దొంగగొడ్డు
కొద్దియో గొప్పయో వీలుకుదిరినపుడు
చేనుబడక గొడ్లకాపరిచేత దెబ్బ
బడక యుండునె తన యలవాటు మాని.

కారాగృహమనిన ప్రతిప్రాణికిని జుగుప్సా భయములు కలుగును. శిక్షాపాత్రులకది స్థానము - కారాగృహవాసమవమాన భాజనము - దుర్భరము నసహ్యముగ నందరు భావింతురు. శిక్షితులు స్వజనులైన బంతిల్లుటయు పరులైన వేళాకోళమాడుటయు వెక్కిరింతలొనర్చుటయు చాల మందికలవాటు.

ఓరుగల్లున పశ్చిమముఖముగ నొక బంధనాలయము గలదు. అది ఖైదీలు తప్పించుకొనుటకు వీలుగాకుండ తగిన కట్టుదిట్టములతో నిర్మింపబడియుండెను. దానినొక గవాక్షరమైనను లేదు. పట్టపగలేని వెలుతురుండదు. రాత్రియందు సైతము దీపముండదు. అందు అంధకార భూతము దివారాత్రములు రాజ్యముచేయుచుండును. అందని రేణువునేని గాలి కదల్ప లేదు. అహర్నిశలు దోమలసంగీతము వినబడుచుండును. ఈగలు నిరంతరము మునురుకొనియుండును. అంతపెద్దచెఱసాలకొకే యొక ద్వారము కలదు. దాని తలుపులు ముక్కలచే నమర్పబడినవి. ఆ చెఱసాలయందు చిన్నచిన్న గదులున్నవి. ఖైదీలీ గదులలోనే యుందురు. ఆశౌచముచే నా గదులు దుర్గంధభూయిష్టములైయుండెను. అనారోగ్య మెల్లెడల తాండవించుచుండెను. ఆ బంధనాలయము నలువైపుల పెద్ద కోటవంటి ప్రహరీయున్నది. ప్రహరీపై ముళ్ళతీగెలు తాపితములైనవి. లోనికి పోవుటకెవ్వరికి సాధ్యపడదు.

అట్టి జైలులో రాజద్రోహులైన జైనులు బంధింపబడిరి. జైనులు ఇనుపకడ్డీల నమర్పబడిన ద్వారదేశమున నిలబడి గంపెడాసతో తమవా రెవ్వరైన కనబడుదురేమోయని త్రోవలరయుచు లోలోన దుఃఖపడుచుం డిరి. ఆహా! స్వయంకృతాపరాధ ఫలితమునందన్యులకు భాగముండునా? తదపరాధ ఫలితము లెవ్వరు తప్పింపగలరు? ఆ ద్వారముకడ పహరా జవాను మాత్రము ఖడ్గపాణియై యటునిటు తిరుగుచుండెను.

అంత పొద్దుక్రుంకినది. కూలినాలిచేసి పొట్టపోసికొను శ్రామిక జనము తమతమ పనిముట్లతో నిండ్లకు పోవుచుండిరి. కారాగృహపాలకు డెందులకో యెచటికో పోయెను. ఒక యపరిచితవ్యక్తి నెమ్మదిగ నాప్రదే శమున జేరెను. అతడటునిటు పారజూచి యెవ్వరును లేమికి బెగడుడిగి చటుక్కున కారాగార ద్వారము దగ్గర నిలబడెను. వానిమొగము చిన్న వోయియున్నది. చూపులు దైన్యమును ప్రకటించుచున్నవి. కట్టుబట్టలు మాసియున్నవి. శిరముపై ముసుగున్నది.

అంతలోనుండి కుశీలుడు రివ్వున ద్వారముకడకువచ్చి నిలబడెను. వారికి పరస్పరాలింగన సౌఖ్యము లభించినదికాదు. ఇర్వురును ద్వారబంధ ముల చువ్వల నాశ్రయించి నిలబడి మోములు వ్రాల్చి విషణ్ణవదనులై యుండిరి వారికన్నీటిచే తచ్ఛిలామయ ప్రదేశము కొంత చెమ్మగిల్లినది. ఒరులరయుదురేమోయను భయముభయులకు కల్గుటచే వారు దుఃఖమును దిగమ్రింగిరి. వారి సంభాషణ మిట్లుసాగినది.

కుశీ:- ఆపదలు మానవునకుకాక మ్రానునకు కల్గునా! దుఃఖించిన నాప దలంతరించునా? చింతించిన లాభములేదు మనము మేధావినిసాధించు టకు గట్టియత్నము చేయవలెను. అతడు ప్రతికార్యమునకు తగుదునని ముందడుగు వేయుచున్నాడు. నాకీస్థితి సంభవించుటకతడే కారకుడు. బోనున చిక్కిన బెబ్బులి ఏమిచేయగలదు?

అపరి:- మిత్రుడా! మన ప్రయత్నములు చవిటినేల చల్లిన బీజములవలె నిరర్థకములైనవి. మనమేమిచేయగలము? మేధావియెంత మనసామర్థ్యమెంత? అనుకూల వర్షములచే వాని ప్రయోగ సస్యములు ఫలించుచున్నవి. విచారించిన ప్రయోజనములేదు.

కుశీ:- ప్రయోజనము లేదని చేతులు ముడుచుకొని కూర్చుండుట క్రియాశీలుర లక్షణముకాదు. ప్రయత్నలోపమున్నచో ఫలాభూతిలేదు. చారుమతి మనకు దక్కుటచే మేధావి మతిభ్రష్టుడై మంత్రాలోచనకు చాలనివాడగును. ఆత్మబంధనముకంటె పుత్రికాపహరణము వానికి విశేష దుఃఖహేతువు. అన్నట్లు మరచితిని. నీవెట్లు రాగలిగితివి?

అపరి:- పహరా జవానునకు లంచమిచ్చి లోనికి వచ్చితిని.

ఇట్లు వారు మాటాడుకొనుచుండగ కారాగారాధికారి వచ్చుచున్న సవ్వడియయ్యెను. ఇంతలో అపరిచితుడు ఆచోటు విడిచిపోయెను.

# 13

ఆ సౌధమంతఃపురాంగనలుండునది. పరిమళయుక్తమైన లేఁగాలి వీచుచుండెను. అందు రత్నస్థగితములైన కుసుమ సదృశ మృదులములైన పర్యంకములు కలవు. కుడ్యములపై శృంగారగాధాస్ఫురితములైన తైల వర్ణచిత్రములు తురుష్క సంస్కృతిని ప్రతిబింబించుచున్నవి. ఆ మందిరమున కాచగోళములు బహువర్ణశోభితములై పైకప్పునుండి వ్రేలాడుచున్నవి. నేలపై పచ్చని రత్నకంబళము పరచియున్నది. మందిర గవాక్షమునుండి వీక్షించిన సువిశాలము బహు పుష్పసంభరితమునైన యుపవనము కలదు. అందులకొ మంటపములు, తోటమాలి చేతిలాఘవమున

మేలచబడిన లతానికుంజములు మిక్కిలి శోభాయమానములై యున్నవి. ఆ పుష్పవాటికనుండి సౌరభమిళన్మందానిలము అంతఃపురము లోనికి వీచుచుండెను.

లోపలి సౌధమునందు బంగరు మంచముపై నొక ముద్దరాలంటుకొనియుండెను. ఆమె మోము వెలవెలబోవుచుండెను. చూపులు జాలకు పొదరింట చిక్కిన లేడిపిల్లచూపులవలె నలువైపుల క్రేఁగన్నువారుచుండెను. ఆమె నేత్రాంచలములనుండి ముత్యములవలె నశ్రుకణములు జారుచున్నవి. ఆకన్య పొట్టలో పుట్టెడు దుఃఖమున్నట్లగు పడుచుండెను. ఆమె యెవరో కాదు. జైనవీరులచే నపహృతయైన చారుమతి. ఆ సుకుమారికి పరిచర్యార్థ మిర్వురు యవన యువతులు నియోగింపబడిరి. అయిననేమి? ఆమె యిలు వాసినది మొదలు నీటబాసిన కమలమువలె కులుచబడి కుమారిలుచుదస్సి నొసటితుంపెనలాడు ముంగురులనేని సవరింపనోపికలేక సంస్కార విహీనయై చూచువారికి జాలిగొల్పుచుండెను. ఆమె జలము నైనా యేమియు ముట్టదు.

ఒకనాడా బాలిక శయ్యపైమేనువైచి తనకు ప్రాప్తించిన దురవస్థ కిట్లు వాపోవుచుండెను.

కాలమా! నాకెదురయ్యెదవా? ఏమియామైంద్రజాలము? ఏమియీమాయ? ఎక్కడిదంతకాటవియందలిపర్ణశాల! ఎక్కడిఢిల్లీసుల్తాను సౌధము!! అయ్యో దుష్టుల పంపకముచే నన్నిట్లు చేసినవారెవరు? ఈ సుల్తానునకు జైనులకు పరమమైత్రి గలదని మున్నెపుడో తండ్రిగారివలన వింటిని? ఓరుగంటిపై తురుష్కులు కన్నిడియుంటిరట! నా తండ్రిపై నాపాషండులకు క్రోధము మెండు. కాని వారెవరు నిచట కలికమునకేని కన్పడరు. ఏపాషండులారా! మీకు నేనేమి యపకృతి నొనర్చితిని. మీకు నాపై యకారణవైరమేల?

నన్నేకాకినిజేసి యిట్లుడికించుట మీధర్మమా! మీకుధర్మమేలా? తురుష్కుల్ల కోపాగ్ని కారణములేకయే దహించుననెడి నుడి మీయెడ సార్ధకమైనది. నామాట వినుడు. దిక్కులేనిదానినిగ నన్నెంచకుడు. నన్నిట్లు దుఃఖపెట్టిన మీకు మా పితృపాదుల చేతిలో మరణదండన తప్పదు.

హృదయమా! మొరకులచేజిక్కి, కీలెఱుగక, కీలూడిన బొమ్మ మాడ్కి కూలితివి. ఇంక దుఃఖపడిన లాభములేదు. "ధైర్యమ్ సర్వత్ర సాధయేత్" అని పెద్దలు పలుకుదురు. జంకు నీవంకకు రాకుండునుగాక.

ఈ పట్టణము తురకల పుట్ట. తురకలన్న నీకు భీతి. ఇకనీవెట్లు బ్రతుకుదువు? నీగతియేమి? అయ్యో! ముందునుయ్యి - వెనుక గొయ్యిగా నుండె నీ బ్రతుకు ఎట్లుండిననేమి? కొన్నిదినము లిట్లుండక తప్పదు. బెంగపడకు - కృశింపకు - దుఃఖింపకు.

తండ్రీ! మేధావీ! నీనామము సార్ధకమని ప్రతీతికలదు. దాని కింతలో నవాంతరము కల్గునని చివరికి నేనూహింపనైతిని. ఫిన్నాజైన్ముల మోసముచేసిరికదా! నీకొమ్ముంతకని లేశమైన భయపడరైరి. కన్నవారిగానక, కన్నవారు జాలిపడ పోదరింట పోర్వేట్టు పసిగ్రుడ్డు నన్ను తెచ్చి పెంచి పెద్దదానినిజేసి తుదకీ తుంటరులపాలివైచితివా? అయ్యో! చిఱుత ప్రాయమున నా సోయగమునకువ్విళ్ళూరుచు బిడ్డా! విన్నాంధ్రదేశ పట్టమహిషి గావించెదనన్న నీమాట వట్టిదగునా! ముఖప్రీతికట్లంటివిగాబోలు, ఇపుడెందుంటివి. ఆహా! పొరపడితిని. చేతనైన కార్యములు చేయుచునే యుంటిరి. నా వివాహ ప్రయత్నమున మీరుపడుచున్న కష్టపరంపరకు మేరలేదు మిమ్మనవలసిన పనిలేదు. అయ్యో! మీయనుగ్రహమున రాజ సాక్షాత్కారము లభ్యమయ్యెను. ఆంధ్రమాతా! నాతల్లీ! నీపవిత్రగర్భమున నన్నేల కంటివి! కంటివిపో! నన్నన్యపుత్రికగా భావింపుట న్యాయమా!

నీ వీరపుత్రీ పుత్రుల మనోహర భాషామృత సంసేవనచే నలరు వీనులు కరకు తురకల మాటల నిల్లుకట్టుకొనవలసినదేనా! నన్నేల పుత్రికగా గంటివి? పుత్రుడనై యుండిన నీ వీరమాత నామము చరితార్థమొందించిన ప్రఖ్యాత పురుషులలో చేరియుందును.

అయ్యో! ప్రపంచమందెట్టి దుర్మార్గులు కలరు! తమ కార్యసాఫల్యమునకు నైతిక విరుద్ధములు, ధర్మ విరుద్ధములు, న్యాయవిరుద్ధములు ధర్మవిరుద్ధములు, న్యాయవిరుద్ధములునగు పలుపోకిళ్ళ పోవుచుందురు. ఆ దుర్మార్గులకు బుద్ధిచెప్పి విశ్వమానవ కళ్యాణమునకు సౌభ్రాతృత్వమునకు పతిత జనోద్ధరణమునకు తోడ్పడువారెవ్వరీ లోకమునలేరా! నిఖిల లోకైక కల్యాణులైన సమ్రాట్టులు లేరా!

రాజశేఖరా! కాకతీయవంశ పారావార సుధాకరా! ఓరుగంటి పురాధీశ్వరా! ఆపదుద్ధారకా! మొన్నమొన్న నోరుగంటి పరిసరారణ్యమున ప్రాణాపాయస్థితినుండి రక్షించిన యీకన్య పరాధీనయై రక్షణకోరుచుండ నుపేక్షించుట మీవంటి శూరాగ్రేసరులకు యుక్తమా!

ఇంక నాకభయ ప్రదానమొసగి రక్షించు రాజశ్రేష్ఠులెవరు? కావలసినవారూరకుండ నన్యులేల జోక్యము కల్గించుకొందురు? ఏనాడు నన్నా పులివాతనుండి రక్షించితివో నాటినుండి నీయమృతవునోన వీసొమ్ము. నా హృదయము నీయాధీనము. నా మానసము నీయందే లగ్నమైయున్నది. జాగేల సత్వర దర్శన మొసగి తురుష్కుల దండించి నన్ను విడిపించి తోడ్కొనిపొమ్ము ఆహా! ప్రాణతుల్యులగు మంజరీ చిత్రరేఖల పెడబాసి స్థాణుగ కూర్చుండ మనస్సెట్లొప్పును? ఈ నాయవస్థ రాజమౌళికి తెలిసియుండునా? తెలియకుండిన నేనేమి చేయుదును? ఉత్తరము వ్రాయుట కేని వలను పడదు. వార్త పంపుదమన్నను వీలులేదు. నాకట్టి పరమమిత్రు

లుమ లేరు. ఈశ్వరా! నన్నెంత దురపిల్లజేయుచుంటివి. నావేదన తొల గించి నన్నీసమయమున కాపాడు బుద్ధిపుట్టలేదా! నిన్ను శిష్టరక్షకుడు, దుష్టశిక్షకుడునని నీ భక్తులు చెప్పుచుందురు. ఏదీ నాకు శిక్షయా! అదుష్ట లకు రక్షణమునా? ఏమి నీ యీ లోకపాలనము!

అంకపీఠనిడి యొజ్జనా బుజ్జగించి నీతులు గరపుచు నిన్నమొన్నటి దనుక పెంచిన నాతండ్రి నావియోగమునకెంత శోకించుచుండెనో యేమి చేయుదును. జీవము చిక్కబట్టి చిత్రప్రతిమవలె యుందును. ఏకశిలానగ రాధిపా! నీ కిల్లాలినై మహైశ్వర్యమనుభవించుచు నానందసాగరమున నోలలాడుచు కాపురముచేయుకాలమంతరించెనా? ఇకనెప్పటికేని నట్టినిస్తుల భాగ్యము సమకూరునా? తనకుమార్తెకు మంచికాపురము దొరికెనను నా తండ్రి యాస లడియాసలయ్యెనా? నీయందను మెలగుట నాచెలికత్తె లువ్విళ్ళూరుట భ్రాంతియేనా!

అని యిట్లు చైతన్యావ చైతన్య స్పష్టచైతన్య మానసిక స్థితులందు ప్రలా పించుచు కమలు మొగిడ్చి పాన్పుపై పడియుండెను.

ఇంతలో హటాత్తుగా నొక యలజడి కలిగెను. ఆవచ్చు వ్యక్తిని గాంచి చెలికత్తెలటునిటు తొలగజొచ్చిరి. అంతట ఉల్లూఖానుడు ప్రత్యక్ష మయ్యెను. అతడవధరించిన చడావులు రత్నస్థగితములై బంగరు పనితన ముతో కూడినవి. అతనిమేని పొడవైన కంచుక ముల్లిపొరవోలె గులాబి రంగుతో పరిమళముల గుబాళింతలతో మిక్కిలి ఆకర్షణీయముగనున్నది అతని శిరోలంకారము కంఠదేశమున చేతులసమాలంకృతములైన యాభర ణములు రత్నస్థగితాంగుళీయకములు నాతని రూపమునకు శోభనుగూర్చు చున్నవి. ఆతని కన్నులు మధుపానవశమున కించిదరుణములై యున్నవి.

ఆతనిగని చారుమతి జలనక్షత్రమువలె కంపిల్లెను. ఆమె మాన

పేము చెదరెను మిన్నువిరిగి మీదపడినట్లనిపించెను. విభ్రాంతపడెను. ముఖము వైవర్ణ్యమునొందెను, అంతడుల్లాఖానుడటునిటు పచార్లు చేయుచు నిట్లనెను. "విలాసినీ! నీకేల భయము. ఇచటి పరిచారికా జనము నీయాజ్ఞలను పాలించుచున్నారు గదా!" అని యను నయవాక్యముల నుపక్రమించెను. ఆమె బదులాడలేదు. మరియొకపరి యడిగిచూచెను. ప్రత్యుత్తరము లేదు. ఇంకొకసారి పృచ్ఛించెను. జవాబులేదు.

అంత పాదుషా చారుమతి మోము నించుక వంగిచూడబోయెను. అంతలో బెదరి వెనకకు దిరిగి యిట్లనెను. "ఏమీ! నాయెడ క్రోధమా! పట్టమహిషివగుట కిష్టము లేదా? చంద్రశిలాహర్మ్యములనివసించుటకు మన సొప్పకున్నదా? మణిమయ పర్యంకముల మేనువాల్చుటకింపుపట్టదా? అయ్యా! ధర్మబాహ్యుడవై విరుద్ధవాక్యముల నన్ను బాధింపకుము. ఎందులకీ వ్యర్థాభిలాష? సింహాసనాసీనుడవై న్యాయాన్యాయముల, ధర్మాధర్మముల నిరూపించి భూవలయమేలు చక్రవర్తికి పరస్త్రీలోలత్వము తగునా? అయ్యో! ఇది యెంత దోషము! రాజ్యభ్రష్టత నొందింప కుందునా! ఇల్లువాకిలి విడిచి శత్రుగృహమున జిక్కియున్న నాబోటికి పరిచారికలేల తుచ్ఛపు మాటలాడి కళంకము తెచ్చికొనకుము.

ఉల్లా:- నారీ! ఇది శత్రు గృహము. నీపర్ణశాలయొసగు సౌందర్యమీ దివ్య భవనమీయదా? నీకీనారచీరలెందుకు. మేలిజల్తారు పట్టుపుట్టము లొసంగెద. మరియు నీకోరిన రత్నాభరణముల నీవశము గావించెద. తలపు నాపై విలిపి మనసిచ్చి మాటాడుము.

చారు:- ఆహా! కందమూలములను దినుచు లోకోపకారమొనర్చు మేధావి బిడ్డకీ దుస్థితియా! స్వవంటి చక్రవర్తి నావంటి పేదరాలిని గోరుట యధర్మము. మావంటి దీనులను రక్షించుట మీకర్తవ్యముగదా! చీని కన్యలు చెప్పవలెనా?

ఉల్లా:- అవును. మీక్షేమమరయుట మాకర్తవ్యమే

చారు:- క్షేమమరయుట కర్తవ్యమేగాని, నీతివిరుద్ధములైన దుర్భాష లాడుట న్యాయము వీడుట యుత్తమముకాదు.

అని యతడు పలుకుచుండగ నిద్దరు పరిచారికలు వేగముగవచ్చి ప్రభూః తమ దర్శనార్థమై ఇర్వురాఫ్గన్ భటులు వేచియున్నారని చెప్పిరి. ఈ మాటలను చారుమతి వినెను. ఉల్లాఖానుడు సంభాషణను విరమించి అచటినుండి నిష్క్రమించెను.

ఉల్లాఖానుడు చారుమతి తనచేజిక్కిననాటినుండి మోహపరవశుడై యభీష్టసిద్ధికి మార్గములరయుచు మన పకీరుతో నాలోచించుచు గ్రుక్కిళ్ళు మ్రింగుచుండెను. రాజప్రాసాదమునకు పకీరు నిత్యము ఉదయము సాయంకాలము వెడలుచు చారుమతీ సుల్తానుల వృత్తాంతము నరయుచు సమయమునకై వేచియుండెను. ఒకనాడట్లా పకీరు పాదుషా దివ్యసౌధమునందుండెను. ఆ యుభయులమధ్య సంభాషణమిట్లు నడచెను.

ఉల్లా:- చారుమతి నాకు వశమగుటకెన్నాళ్ళు పట్టునః ఏమి యామె యాందోళనముః తనకు తోచిన సంగతియేకాని యన్యమేలయు వినదు-కనదు. మంచి తెలియదు, మీకేమైన సుముఖురాలుగ కన్పించెనాః

పకీ:- కన్పించకేమిః ఇంతకు ఆమెకు మనభాష బొత్తిగ తెలియదు. ఆమె హృదయమును వశీకరించుటకు, మీపై వలపు నిలుపుటకు వలసిన ప్రేమగాథల వచించి చాతుర్యము నాకంతగలేదు. ఆంధ్రభాషలో నాకు ప్రవేశము లేదు. అయినను ప్రతిదినము కొన్నిసంగతులనునూరిపోయుచునే యుంటిని. మొత్తముమీద యామెమౌన మర్ధాంగీకారమును సూచించుచున్నది.

ఉల్లా:- ఆంధ్రభాషయందు తగిన ప్రవేశముగల రసికులు మన నగర

మన లేరా? వారిని పిలిపించి చారుమతికి హితబోధ గావింపజేయుట యుక్తము.

పకీ:- అయ్యా! మన పురమున నొకబేహారి కలడు. అతడు రత్నవ్యాపారి. ఆంధ్రుడు. తన భాషలో మంచిప్రవేశము కలదు. సరసుడు - ప్రేమ కథా కోవిదుడు, మంచి మాటకారి. ఆ బేహారిని చారుమతి మందిర మునకు రప్పించి కన్యలు రాజులను వరించిన ప్రేమఘట్టముల నుద్బో ధించిన నామె మెత్తబడి తమవశము కాగలదు.

ఉల్లూ:- అట్లయిన నాలస్యమేల! అతని నీ మందిరమునకు శీఘ్రముగ రప్పింపుడు. మాయాజ్ఞ తెలుపుడు.

పకీ:- చిత్తము - నాకు సెలవు దయచేయుడు.

అని యా మహమ్మదీయ గురువు సుల్తాను సౌధమువీడి తనకెదు రగు శిష్యులగూడి తమ విడిదికేగెను.

ఆనాటి యర్ధరాత్రి ప్రకృతియంతయు నిశ్శబ్దము వహించిన తరు ణమున మనపకీరొంటరిగ బేహారి యింటికేగెను. వారిద్వరు నేకాంతముగ కొన్ని రహస్య రాజకీయ విషయములు ముచ్చటించిరి. ఆనాడు తనకోరు గల్లునుండి వచ్చిన యుత్తరమును చదివి యుద్ధము సిద్ధముగ నున్నదని బేహారి పకీరునకు తెల్పెను. ఈమాటలు వినుటతోనే పకీరు ముఖమున శాత్రవ విజయవాంఛ ప్రస్ఫుటమయ్యెను.

పకీ:- మనయాంధ్రజాలిక యొకర్తుకను ఉల్లూఖానుని మందిరమునకెవరో దుండగులు తెచ్చిరి. ఆమె వైఖరిచూడ మన రాజకుటుంబమునకు చెందినదివలె నున్నది. సుల్తానామెను వశముజేసికొన యత్నించు చున్నాడు. నాకతనియొద్ద చనువుండుట నీకుతెలియునుగదా. ఈవిషయ మంతయు గమనించి ఆ మందిరమునకు నీరాక కార్యకారి కాగలదని

ముందుగనే పాచికవేసియుంటిని. సుల్తాను నీరాకనపేక్షించుచున్నాడు. సమయము గ్రహించి, ఆమె వృత్తాంతమంతయు తెలిసికొని పాపమా యనాధను మీరు రక్షింపవలయును.

జనా:- (బేహారి) ఎంత ఘోరము జరిగినది. ఈవిషయమున మనమశ్రద్ధ వహించి యామెను రక్షింపవలెను. స్త్రీ గోరక్షణమున మనము ప్రాణములనైనను బలివెట్టవలెను.

ఫకీ:- ఆమె మోసగింపబడినది మోసమును మోసముతో జయింపవలెను. దానికి తగిన పథకము నిర్మింపుడు. రేపు మిమ్ము బాలికయున్న మందిరమునకు గొనిపోయెదను.

జనా:- అట్లే మనము తప్పక యామెను చూడవలసియున్నది

అని వచింప ఫకీరులేచి జనార్ధనునివద్ద సెలవుగైకొని రహస్యముగ తన విడిదికి పోయెను.

మరునాటి యుదయమునుండియు బేహారి చారుమతి సౌధమునకేగుచుండెను. అతని రాకపోకల కేవేళయందును ఆటంకములేదు. సుల్తానభీష్టము గ్రహించియుండుటచే నచటి కావలివారు ఇతని నిష్క్రమణముల నాటంక పరుపరైరి. బేహారి ప్రేమకథల మిషతో ఆమె వశీకరించు సంభాషణముచే రహస్యముగ మాటాడుచు చారుమతి పూర్వవృత్తాంతమంతయు తెలిసికొనెను. మేధావి ప్రియపుత్రికకిట్టి విపత్తు కల్గినందులకాతడు కడు చింతిల్లెను. అతడు చారుమతి విముక్తిమార్గములరయుచుండెను. బేహారి ఆంధ్ర ప్రముఖుడనియు, తన తండ్రికి సన్నిహితుడనియు నామె కొంత యోదార్పునొందెను. అతడు తనకు విముక్తి ప్రసాదింపగలడని యాశ యొదవ క్రమముగా నుల్లాసముతో సంభాషింపదొడగెను. దినదినమునకు నిట్లామెలో పొడమిన యుల్లాసమైఖరికి సమీపచేటికలు ఉల్లూఖానుడు

సంతసించిరి. మల్లాను తనరాష్ట్ర నేతినబడెనని మిక్కిలి సంతసించెను ఆమె యుల్లాసము భవిష్యత్తునకొక ప్రయోజనకారి కాగలదని బేహారి యట్లా మెను ప్రవర్తింపజేసెను. ఒక్కొక్క దినమున బేహారితోకలిసి పకీరు రహస్యముగ చారుమతితో మాటాడుటయు, వారు చాలవిషయములను తర్కించుటయు జరిగెడిది. కాని ఈ రహస్యము గ్రహించు నవకాశమెవ్వ రికిని కలుగలేదు ఇట్లు కొన్నిదినములు గడచెను.

# 14

శిల్పమతిప్రాచీన కళ. ప్రకృతితోపాటు శిల్పమును ఆవిర్భవించి నది. సహజ నిర్మిత పర్వతశ్రేణులతోను, నవనవోన్మేష కాంతి వైభవ తరులతానికుంజములతోను ముగ్ధమోహన సౌందర్యపూర్ణయైన ప్రకృతితన సహజ శిల్పకళానైపుణ్యము నెల్లప్పుడు ప్రదర్శించుచునే యుండెను. భారతదేశమునందలి వింధ్య హిమాలయేంద్ర కీలాద్రి పర్వత పంక్తులు మన సహజశిల్ప కళోన్నతిని చాటుచున్నవి. అతిప్రాచీన వైభవముగల మనదేశము మానవ నిర్మిత శిల్పకళా నైపుణ్యమునకు జగత్ప్రసిద్ధి వహిం చినది. చిత్రకళకంటె శిల్పము ప్రాచీనమైనది. శిల్పము మిగిలిన లలిత కళలవలెనే సహజ పరిణామము పొందినది. వేర్వేరు రాజవంశముల సమాదరణమునకు పాత్రమై యీ కళ ప్రపంచ విఖ్యాతిని పొందినది. క్రీ॥ పూ॥ శాతవాహనుల కాలములో బౌద్ధశిల్పమభివృద్ధిచెందినది. అమరా వతి-నాగార్జునకొండ - గుడివాడ - భట్టిప్రోలు మొదలగు బౌద్ధ విహార ముల శిల్పసంపద సుప్రసిద్ధమైనది. అమరావతి శిల్పసంపద భారతశిల్పము నకు వరవడిపెట్టినదని చెప్పవచ్చును. ఈశిల్పములో లాలిత్యము - మృదు త్వము - నైపుణ్యము ప్రస్ఫుటముగ కొట్టవచ్చినట్లు కన్పించును. ఆంధ్ర సంపదను జగత్ప్రసిద్ధము గావించినది అమరావతి.

శాతవాహన రాజులతో ప్రారంభమైన యీ యాంధ్రబౌద్ధశిల్ప మిక్ష్వాకుల కాలములో నత్యున్నదశ నొంధినది. నాగార్జునశిల్పఖండము లన్నియు పాలరాతితో పరిష్కృతములు. బుద్ధుని జీవితవిశేషములు - జాత కథా విషయములు నాటి రాజుల - ప్రజల ప్రేమగాథలు తదితరసాంస్కృతిక సాంఘిక విశేషములు నీశిల్పమున చిత్రింపబడినవి. ఒక్కమాటలో చెప్పవలెనన్న నాశిల్పమే నాటి బౌద్ధ సంస్కృతి సర్వస్వమును మన కందించుచున్నవి.

చాళుక్యరాజుల కాలములో హైందవ శిల్పము వ్యాప్తినొందినది. పురాణ ప్రసిద్ధములైన దేవీదేవతా గాథలు, అవతారములు శైవ వైష్ణవ లీలావిశేషములు నీకాలమున నిర్మింపబడినవి

ఆంధ్ర శిల్పకళా చరిత్రలో కాకతీయుల శిల్పకళాసంపద సర్వాంగ సుందరము, సుప్రసిద్ధములని చెప్పవలెను. దక్షిణాపథములో హోయసలులు కాకతీయులు కళాపోషకులుగ పేరుగాంచిరి. హోయసలులునేటి కర్ణాటక రాష్ట్రమునకు చెందినవారు. వీరు కాకతీయులకు సమకాలికులు. బేలూరు, హాలిబేడు - శ్రవణబెళగొళ మొదలగు శిల్పక్షేత్రములు భారతశిల్పకళా లక్ష్మి కలంకారములు. కాకతీయ శిల్పకళ దీనికెందును తీసిపోదు.

నిర్మాణశైలిలో, చిత్రిత వస్తువులో నేకత్వమీశిల్పమున కలదు. ఆనాటి శిల్పులొక ప్రత్యేకతను సారూప్యతను ప్రతిభావంతముగ ప్రదర్శించిరి. ఈ ప్రత్యేకత యీనాటి దేవాలయములలోను, రాజమందిరములలోను గోపుర ప్రాకారములలోను స్పష్టముగ ప్రముఖముగమనకు గోచరించును. కనుకనే కాకతీయ శిల్పమును ప్రత్యేకముగ గుర్తింపబడుచున్నది.

తెలుగుదేశములో మహోన్నతముగ వర్ధిల్లి విశ్వవిఖ్యాతిని పొందినది. కాకతీయ శిల్పకళయే. కాకతీయులు సుమారు మూడువందల ఏబది

సంవత్సరములు స్వతంత్ర పాలకులుగ తెలుగుదేశమును పరిపాలించిరి. సాంస్కృతిక సాంఘిక కళారంగాలలో నీకాలములో జరిగిన యభివృద్ధి తెలుగుదేశచరిత్రలో స్వర్ణయుగముగ కీర్తింపబడుచున్నది. ఈ యుగములో తెలుగుదేశము సాంస్కృతికముగ భౌగోళికముగ నేకముచేయబడినది. శాంతిభద్రతలు నెలకొల్పి యీపాలకులు జాతియభివృద్ధి యార్థికాభివృద్ధికి సంఘ కల్యాణమునకు విశేషముగ తోడ్పడిరి.

కాకతీయుల కాలములో సర్వకళలు సమస్తవిద్యలు సర్వతోముఖాభివృద్ధినొందినవి. తెలుగుజాతికొక యౌన్నత్యము లభించినది జయపన్నత, రత్నావళి యానాటికే సుప్రసిద్ధమైనదనగ దానివెనుక తత్కాలాప్రాభవము దేశమున విశేషముగ వ్యాప్తినొందెనని వేఱుగ చెప్పనవసరములేదు.

కాకతీయులు వీరశైవులు. ఆనాటికి బౌద్ధజైనములు నశించినవనియే చెప్పవచ్చును. వీరశైవముబ్రాహ్మణేతరులలో మిక్కిలి వ్యాపించి సంఘచైతన్యమునకు తోడ్పడినది. రాజాదరణము కూడా దీనికి బలము నిచ్చినది.

ఆనాటి దేవాలయములు సంస్కృతికి నిలయములు. వివిధకళానికేతనములు. అది పదుగురకు సమావేశస్థలము. నాటి దేవాయతనములు విశేషముగ శైవసంబంధములు. అచటచట వైష్ణవాలయములుకూడ లేకపోలేదు. తటాకాది నిర్మాణ సందర్భములందు కళాపీఠమైన దేవమందిరము వెలయవలసినదే. రాజుల దిగ్విజయ సందర్భములందు, పట్టాభిషేక సమయములందు, వారి జనకాలము నందును వీని నిర్మాణమాచారముగనున్నది. ఇక ప్రజలు జానపదములందు తమభక్తి ప్రపత్తులకు ప్రతీకలు బహు దేవాలయములు వెలసెడివి.

హిందూశిల్పసంప్రదాయముల ననుసరించిన కాకతీయ శిల్పము

నందును, మతమే ప్రధానము శిల్పము కూడ తదితర లలితకళలవలెనే మతము నాశ్రయించినది. కాకతీయుల కాలమున విజృంభించిన శైవము బౌద్ధజైన సంప్రదాయముల నణగ ద్రొక్కినది. జైనమతావలంబులైన తొల్లిటి కాకతీయరాజులు జైనమతప్రవర్తకులైన తీర్థంకరులను శిల్పింపఁ జేసిరి. కాని వీని నిర్మాణమునందు శిల్పికి తన ప్రతిభను వెలార్చుట కవకాశము తక్కువ. కాకతి ప్రోలరాజు శైవమునవలంభించుటతో శైవ శిల్ప మభివృద్ధినొందినది. శైవము భక్తిప్రధానము-శివలీలాగాథలు శైవ భంగిములు-నటరాజ నృత్యములు మున్నగు కళారీతులు విస్తరించినవి. శిల్పప్రపంచమున ఖ్యాతిగాంచిన ప్రముఖ దేవాలయములందు శిల్పుల నైపుణ్యము విశేషముగ గోచరించుచున్నది. అప్పటి యాలయములన్నియు చాలవరకు శైవ ప్రాముఖ్యము నొందినవి. క్రతుధ్వంసి, వృషధ్వజుడు, స్వయంభూదేవుడు, విశ్వేశుడు, బేతేశ్వరుడు, రుద్రేశ్వరుడు, భైరవమూర్తి మొదలైన నామములతో వెలసిన వివిధ శివాలయములందు శిల్పము వైవిధ్యమును సంతరించుకొనినది. ఓరుగల్లునందేగాక, కాకతీయులు నల్లగొండ, కరీం నగరు, మహబూబ్ నగరు, కర్నూలు మొదలైన మండలములందు కాకతీయ శైవాలయములు నిర్మింపబడినవి.

కాకతీయులకాలమున దేవాలయనిర్మాణము మహోద్యమముగ కొనసాగినది. ఇవి శాస్త్రపద్ధతిలో నిర్మింపబడినవి. ఆలయముల పునాదిమొదలు గోపురపర్యంతము నిర్మాణము శాస్త్రీపద్ధతిని ప్రామాణీకరింపబడినది. ఈ శాస్త్రీమునకు దైవము మూలము. శాస్త్రబోధితమగుటచే శిల్పనిర్మాణమున నేకత్వము సిద్ధించినది. దైవము శాస్త్రము. మార్గదర్శకములగుటచే శిల్పికి సృజనాత్మకమైన ప్రతిభాప్రదర్శనమున కవకాశము లేకపోయినది. నిర్మాణమునకు మూలమైన మతమునుపట్టికూడ శిల్పము మారును. మతమొకటియైన శిల్పరీతులు కూడ నొక్కవిధమే. అందుచే కాకతీయ

శిల్పమున భిన్నత్వములేదు. పురాతన నాస్తిక సంప్రదాయములనే కాకతీయశిల్పులాదరించిరి. భారతీయ శిల్పమున నందునను నాంధ్రశిల్పమున మతప్రాముఖ్యము విస్తారమగుటచే జనజీవనసరణి చిత్రించుటకు శిల్పులు విశేష ప్రాముఖ్యము నీయలేదు బౌద్ధశిల్పమున సంఘవృత్తము ప్రతిబింబించిన సందర్భము లనేకములు కలవు. బౌద్ధజాతక కథలలో నానాటి జనుల జీవిత విశేషములు నలంకారములు, నాచారములు ప్రతిబింబించు సన్నివేశములు కలవు. హిందూశిల్పమున మతము - దైవము నౌన్నత్యమున నుండుటచే నాలయ శిల్పములలో సాధారణ మానవ జీవిత విశేషములంతగ లేవు. దేవాలయ శిల్పములలో ద్వారపాలకులు, నర్తక బృంద శిల్పములు, దేవతా విగ్రహములు తప్ప, సామాన్య సాంఘిక జీవితవిశేషములందు ప్రతిబింబించిలేవు. కాని దేవాలయము వెలుపలిభాగములక్రింది వరుసలలోబేలూరు, సోమనాధపురము, హలెబీరునందలి యాలయముల యందు గజశ్రేణులు సింహపంక్తులు, లతాబంధములు, హంసశ్రేణులు, వానర సమూహములు కన్పించుచున్నవి. ఇది కేవలము నలంకరణనిమిత్తమేగాని సంఘజీవన విశేషమును ప్రదర్శించుటలేదు.

కాకతీయ శిల్పమునందు కొన్ని జానపద నృత్యములు కన్పించుచున్నవి. వేటాడబడు జంతువులు వేటగాండ్రు, జంతువులను గొనిపోవు భటులు, కోలాటమాడు క్రీటాపరాయణులు విరివిగ కొన్ని శిల్పములందు గానవచ్చును. సామాన్య స్త్రీలు బాకులను ధరించి సింహములతో పోరుచున్నట్లు, నేనుగులనెక్కి శత్రువుల సంహరించుచున్నట్లు కొన్నిశిల్పములచటచట కన్పించును. ఇది యానాటి తెలుగుదేశమునేలిన రుద్రమదేవిని స్ఫురింపజేయును,

వీనినిబట్టి యానాటి సాంస్కృతిక సాంఘిక విశేషములు కొంతగ తెలియవచ్చుచున్నవి. నాటి ప్రజాజీవితమును శిల్పముకంటె సాహిత్యమే

మిక్కుటముగ తెలుపుచున్నది. గ్రామములందు వెలసిన శిల్పముననాటిజాన పదుల వృత్తి మెఱుకపడుచున్నది. ఈ శిల్పములందాటవికుల యాచార పరిణియు కన్పించును. ఆయా ప్రాంతములందలి పర్వతారణ్యాదృశ్య మిందు వ్యక్తమగుచున్నది.

కాకతీయుల కాలమున స్వయంభూదేవాలయము - పద్మాక్షీ దేవాల యము, అంబికాలయము కూష్మాండినీ మందిరము - కాకతీయాలయము వేయిస్తంభములమందిరము, సిద్దేశ్వరాలయము, చక్రేశ్వరునిగుడి, గోపాల మూర్తిగుడి మొదలైనవి కొన్ని ప్రముఖములైన శిల్పకళా నిలయములు గలవు. ఇందు స్వయంభూదేవాలయము, శిల్పమునందు నిర్మాణవిశేషము నందును పేర్కొనదగినది.

ఇందలి శిల్పమత్యద్భుతమైనది. సాహిత్యమున నీ నిర్మాణము మిక్కిలి ప్రశంసింపబడినది. దీనిలో నాల్గువైపుల నాల్గు సింహద్వారములు కలవు. ఇందు గజ సమూహములు స్వేచ్ఛగ ప్రవేశింపగలవు. ఈనిష్పత్తి లో ఆలయ విస్తృతి నూహింపనగును. ఈ ద్వారములందు ప్రతియంగుళ మున నద్భుతశిల్పము పరిష్కరింపబడినది. ఇవి ప్రత్యేకముగ పేర్కొన దగిన శిల్పకళా ఖండములు. ఇవి ఏకశిలానిర్మితములు. ఇందలి శిల్ప సమంచిత లతాబంధశైలి కాకతీయ శిల్పమర్యాదను తెలుపునట్టిది.

స్వయంభూదేవాలయ గోపురము కొన్ని మైళ్ళదూరమునుండియే సమున్నతముగ ప్రేక్షకులకు గోచరించును. నేలమట్టమునుండి రమ్య ముగ నిర్మింపబడిన వేదికమీద నీయాలయనిర్మాణము జరిగినది. ఆలయ గోపురములు స్వర్ణకుంభములవలె ప్రకాశించును. తచ్ఛిఖరములు మేరు శృంగ సమున్నతములు. ఆలయము దూరమునుండియే చూపరులకు మిక్కిలి ఆకర్షణీయముగ నుండును. లోపలి భాగము మనోహర శిల్పా

లంకృతమైనది. పైకప్పున చక్కని పద్మరాజము విస్తృతముగ చెక్కినారు. ఆలయంతర్భాగమునందలి శిల్పుల పనితనము చూచితీరవలసినదే. అది వర్ణనాతీతము. ప్రధానద్వారమునకిరువైపులగల ద్వారపాలకుల భంగిమలు సుందరములు. శిల్పులభావనాశక్తి యత్యద్భుతమైనది. లోపలి రూలములందు, కుడ్యములందు స్తంభములపైన తీర్చినకళావిశేషములు మిక్కిలి వైవిధ్యముతో కూడినవి. అందలినర్తకీమూర్తులు మిక్కిలి సుందరములు. కుడ్యములపై శ్రేణీరమ్యమైన నర్తకీమూర్తులు వాంశిక, వైణిక, మార్ధంగిక సందోహము నాటి లలితకళా జగత్తును సాక్షాత్కరింపజేయును. సున్నితమైన యెఱ్ఱరాతితో, నివి, మలచబడినవి. స్తంభములు, పైకప్పు, గర్భాలయద్వారములు నల్లరాతితో కూర్పబడినవి.

ఈస్వయంభూదేవాలయమందలి లింగము చైతన్యవంతముగ రూపకల్పన చేయబడియున్నది. ఇచ్చట లింగాకృతిలో శివుడు మనోజ్ఞముగ నున్నాడు. ఈ లింగార్చనకు ననుదినము రుద్రభూపతి వచ్చును. వేట నుండి తిరిగివచ్చిన మరునాడాతడతిరహస్యముగ యుద్ధవిజయాభిలాషియై విజయముచేసి శివుని పూజించి నైవేద్యాదులర్పించి తన మందిరమున కేగెను.

# 15

కార్యాంతరాసక్తులై మంచనశర్మ టిట్టిభసెట్టి బహుప్రాంతీయ విశేషములరయుచు నోరుగల్లునకు వచ్చుచుండిరి. దారిలో నొక విదేశీయుడు వారింగలసి తనయోరుగంటి దర్శనాభిలాషను వ్యక్తము చేసెను. వారు దానికి సంతోషముతో సమ్మతించిరి. అది ప్రభాతవేళ. వారు కాల్యముల నిర్వర్తించి నగరదర్శనమునకుపక్రమించిరి. అప్పటికే నగరసౌధ గోపుర

ప్రాకార శిఖరములు బంగరు తళుకులతో మెరయుచుండెను. కోటకువెలు పల మట్టి ప్రాకారమున్నది. అందు నాలుగుద్వారములున్నవి. ఈప్రాకార సమీపమున మేదరవాడ యున్నది. ఈ మువ్వురును మట్టిప్రాకారముదాటి లోనికి ప్రవేశించిరి. ప్రాకారమువెలుపల యగడ్త గలదు. అందు మేదర్లు హరిజనులు స్నానము చేయుచుర్రు. మేదరివాడ కుత్తరముగ కర్షకులు జీవింతురు. వారున్నవీధిని కర్షకవీధి యందురు వీరచటి గోష్ఠములందలి ఆలమందలను, లేదూడలను చూచుచుపోయిరి. పాడిపంటలకు కొదువలేని దేశస్థితినిజూచి వారానందించిరి. కర్షకాంగనలు గుమ్మముల సమీపమున పిడకలనెండబెట్టుచుండిరి. అచటి సేద్యగాండ్రు కష్టజీవులు, పరార్థప్రాప కులు, కపటమెఱుగని సరళ హృదయులు. కొలదిగ నుత్తరమునకుపోవ జూదములతో ప్రొద్దుబుచ్చు జనులు వారికి కన్పించిరి. ఇంక ప్రాగుత్తర దిశగపోవ వేశ్యవాటికలు పొడగట్టినవి. అందలి కాముకీకాముకుల పాన గోష్ఠులు, సరస సల్లాపములు, నృత్యగీతాది వినోదములు వీరికుల్లాసము గూర్చినవి. అనంతరము వారు శిలాప్రాకారమునందలి సింహద్వారమును గాంచిరి. అందలి తలుపులు బంగరు పూతతో మెరయుచున్నవి. అందుండి లోనికేగ గజరథఘోటక శకటికా సంకులమైన రాజవీధిని జూచిరి. అశ్వ ముల పదాఘాతములు, హేషితధ్వనులు దిక్కులదరించునట్టివి.

ఇంకనుపోవ శాలానిబద్ధములై నడగొండలమాడ్కి బృంహిత రమ్యములై కాకతీయ రాజ్యలక్ష్మీలాలితములైన గజయూథములు వారి కన్నుల గట్టినవి. రాజ్యలక్ష్మి శింజినీ శింజానముల ననుకరించువాని నడు ముల నలంకరించిన చిరుమొవ్వల సవ్వడులు వీనులకు విందుచేసెడివి. కొండలనేనియు తమపిడికిలి విలుపుకొన సమర్థములైన తొట్టియలు వేనకు వేలున్నవి. శాత్రవకోటికి గుండెదిగులై చూపట్టుచు నుక్కుతునకల వంటి వీరభటాళి నగరపౌరులకు నిరంతరము విందొనర్తురు. పరిఘాజల

సంస్పర్శనమున శైత్యశోభితములైన మందానిలములా ముప్వురకు ప్రయాణపు బడలికను విహారించినవి.

వారింకను పరిక్రమించి యంగళ్ళవీధినిబడి పోజొచ్చిరి. ద్వీపాంతర వ్యాపార చతురులై కుబేరసోదరులై కోటికి పడగెత్తిన వైశ్యశిఖామణుల యంగళ్ళు వారిదృష్టిని బడెను. వారిలోగిళ్ళు కాలిడుటకైననెడము లేకుండ రకరకములసరకులచే నిండియున్నవి బాటసారులకేదికావలయునన్నను సిద్ధముగ నుండెను. అటుపక్కగ షరాబుల దుకాణములున్నవి. వారుస్వర్ణమును స్వర్ణాభరణములను విక్రయింతురు. విలువైన రత్నములను వారు తెప్పించి యమ్మకము సేయుదురు.

బాటసారులతో పరిల్లుటనేని శక్యముగాని రాజవీధిని వీడి యాముప్వురు క్రంతత్రోవబట్టిరి. వారటు కొంత దూరమేగి పల్నాటి వీరుల యాలయమును గాంచిరి. దానికి కొలది దూరమున నేకవీరాదేవి మందిరము కనవచ్చినది. ఇంకను ముందునకు సాగిపోవ మావెత- కాపుటాలు, జక్కులపురంధ్రి అక్కలు మున్నగు నిమ్న జాత్యంగనల వీక్షించుచు మైలారు దేవాలయమును దాసిరి. అట నుండిపోవునెడ పాండవుల గుడి - కేశవ స్వయం భూదేవాలయములు వారికి నయన పర్వము గావించినవి. అటు కొంత దూరమున నాముప్వురకు భైరవస్వామి యాలయము కనిపించినది అప్పటికే మధ్యాహ్నమాయెను. ఆకొన్నవారై బ్రాహ్మణవాడ కేగిరి. వారి కధ్యయన ధ్వని విన వచ్చెను. విస్తరాకుల తోరణములు పెరటులందు నారవేసిన మడి కొల్లాయలు కనినంతనే యది బ్రాహ్మణ వీధి యనుకొనక తప్పదు. స్నానాదికములు, విభూతి రేఖాలంకరణములు. వారి నిత్యాచరణములు. వారొక పూటకూటి యింటికి భోజనమున కేగిరి. ఆవిప్రుని యింట తాలింపువాసనలుగుభాళించుచున్నవి ఒకనిష్కుటమునకు కప్పరపు భోజనము అందు కమ్మని గోధుమ పిండి

వంటకాలు - కాయగూరలు, అప్పుడే కాచిన నేయి, నాలుగు నంజుళ్ళు కమ్మనిపండ్లు చక్కని పెరుగు మొదలైన పదార్థములతో షడ్రసోపేత భోజనమయినది.

అనంతరము వారు తత్సమీపమున నున్న వేశ్యావాటికకేగిరి అచట నొక యద్భుత భవన రాజమును గాంచిరి. కోటవంటి యావరణ కనులకు మిరమిట్లు గొల్పు యలంకరణములు, చిత్ర విచిత్ర గవాక్షములు శిల్పాభి రమ్యములైన ద్వారదేశములతో నాభవనము శోభాయమానముగనున్నది. అచటి పౌరుడొకడా భవనము మాచల దేవిదనిచెప్పెను. మాచల యనునామె ప్రతాపరుద్రధరణాకోపాత, గోష్ఠి ప్రతిష్టా పారీణ యగు వారాంగన.

అంత దక్షిణాభిముఖముగ నేగి మధుమావతి, కుదాలసలను వేశ్యలిండ్ల కొండొక సేపు విశ్రమించిరి. వారియిండ్ల నలున్యతములైన చిత్రపటముల నైపుణ్యమునకా విదేశీయుడబ్బుర పడెను. ఇట్టి వర్ణచిత్రాలనకృతములైన వేశ్యా మందిరములనేకములావాడ నున్నవి.

అపైవారు శిలాప్రాకారములను చూచుచు ముందునకు సాగిరి. ఆ ప్రాకారములు శత్రుదుర్భేద్యములు. అందలి శిలలు సున్నముతో నతుకబడినవికావు. ఒక దానిపై నొకటిగా శిలలు పేర్చబడినవి. గోడపై చక్కని నగిషీ పనితనమున్నది. అవి మిక్కిలి దర్శనీయములు. ఈ ప్రాకారములను దాటి వారు రాజమందిరములను, గోపురములను శిల్ప చమత్కృతి నలరు వస్తుప్రదర్శనశాలలను మహోన్నత సౌధములను ప్రత్యర్థి భీకరములైన శతఘ్నులను వ్యవసాయ శాఖామందిరములను, గ్రంథాలయములను కనుల పండువగా జూచిరి.

ఇంకను ముందునకు నడువ జాతీయకళామందిరములు నాటక ప్రదర్శనశాలలు, కోశాగారములు సాముగరడీలశాలలను మనోహర ప్రమదావనములనుగాంచిరి.

ఆపురజనుల స్వార్థత్యాగము స్వామికార్య ప్రయత్నము స్వాతం త్ర్యనిరతి. సౌభ్రాతృత్వము వర్ణనాతీతము.

ఇట్లు ప్రతాపుని కాలమున వోరుగల్లు శోభాయమనమై వివిధ వినోదములకు, విద్యలకునాలవాలమై సమస్త భోగభాగ్యములతో ఢిల్లీ కెనయై యొప్పుచుండెను. మన బాటసారులట్లు వివిధ నగర దృశ్యముల నానాడు వీక్షించుటతో భానుబింబము చరమాద్రి కోత్సగిల్లెను. సంధ్య గడువజొచ్చెను. వారు తమ నెలవుల కరిగిరి.

# 16

ఉరుశతఘ్నులు, తొలకరి యురుము లారు
నూర్లు జతపడి శబ్దించె నోయనంగ
ధణధణంధణ ధంధణ ధణ యటంచు
భోరుకొల్పెడి ప్రస్థాన భేరి మ్రోగె.

అయపూర్వ ధ్వనికి ఢిల్లీనగరము తుపాను కుప్పొంగిన వారి వలె సమీప పర్వతగహ్వారములు ప్రతి ధ్వను లీను చుండెను. వీరభటుని కాయ మునకు మిక్కుటముగ శివ మెక్కు చుండెను. చిత్తయుబ్బకు బకుముడి వడు చిఱుచేపలునా వీరభటులు రాజవీధుల నటు నిటు పర్విడుచుండిరి. ఏవీధిని చూచిన వీరభటాట్ట హాసములే ఏయింట గనిన యుద్ధవార్తలే. ఎవ్వరు జూచిన సైనిక దుస్తులు ధరించువారే.

పృతనాధిపతి యుద్ధప్రకటన గావించెను. వీరసైనికుల కాహళులు మొరసినవి, భేరీభాంకృతులు సెలరేగినవి. ఆవేళ పుట్టవెడలిన చీమలవలె దండు వెడలినది. ఆదండున నొకవైపున అశ్వికదళము వేఱొకవైపున గజ దళము మఱియొక కాల్బలము ఒకదానివెనుక నొకటిగ శ్రేణీరూపము

నొంది ఢిల్లీనగరము నుండి బయలు దేరినవి. ఆసందడి యాకోలా హలము చెప్పశక్యము గాదు. సైనిక వాహిని కృష్ణవేణీ ప్రవాహము వలె నుండెను. దళాధిపతులు మహోత్సాహముతో ముందు నడచు చుండిరి. ఆమహావాహినిలో ఆద్యంతము చంద్రవంకలతో తీర్చిన తురుష్కపతాకాల రెపరెపలు పౌరులకు మిరుమిట్లు గొల్పుచున్నవి. సర్వసైన్యాధిపతి యొక అశ్వికశకటము నారోహించి యుండెను. ఆతని దుస్తులు వీరతా సూచకములు మిక్కిలి విలువైనవి. శిరస్త్రాణము రత్నస్థగితమైన తురాయితో కూడినది. ఆతని కిరువైపులు చికిలించిన కృపాణములను ధరించి చూడ్కుల మిరమిట్లు గొల్పు వీరసేనాపతులుండిరి. ఆతని ముందు కూత వ్రేటుదూరమున పంచకళ్యాణిని దుమికించెడి సైన్యాధిపతి మల్లిక్ ఆఫ్గన్ మొనగాడై నడచు చుండెను. ఇతడు మహాశౌర్యనిధి. ఇతని వెంట వీర భటకదంబమాడంబము చూపు చుండెను. ఆఫ్గన్ మల్లికునకిన్నూరు పగ్గాల దవ్వున రివ్వున బోవువాడు మల్లిక్ తగన్. ఇతడొక సేన నాయకుడు తంత్రవాది మిత్రభేది, వీరికి కయ్యపుకైపెక్కియున్నది. ముగ్గురును మూడగ్నులవలె ప్రకాశించుచుండిరి.

సేనాసమూహమట్లు ప్రయాణించుచు నాగ్రామ సమీపమున కొన్ని దినములు విశ్రమించెను. దుర్గమారణ్యములు, దుర్గమశిలాపరిశృత పర్వతశ్రేణుల నతికష్టమున నతిక్రమించి యేడు దినములకు ఝాన్సీనగరము చేరెను. ఆసమయమునకు లక్నోపాదుషా నుండి కొంత సైన్యము ఉల్లూఖానునకు సహాయమై వచ్చెను. గంగాయమునలపరస్పరాశ్లేషమునప్రవాహ విస్పృకమైన యట్లు యా యుభయ సైన్యసమ్మేళనము మిక్కిలి యుత్సాహముతోనుప్పెన వలె బెలదేగుచు బయల్వెడలెను. వింధ్యపర్వతముల నుద్ఘమించినదులదాటి ననేక వనభూముల నతిక్రమించి వచ్చు మహాసైన్యము నకుమార్గమధ్యమున నర్మదానది వేసవి వరదలతో నుప్పొంగి పొరలుచు

నద్దుతగిలెను. దానిని వారతి ప్రయాసమున దాటి యాంధ్ర సామ్రాజ్యసరి హద్దులను జొచ్చి వోరుగంటికి పెక్కు యోజనముల దూరమున నొక విశాలప్రదేశమున దిగిరి.

ఆరేయి తొగరేడుసరస్సు నందలి రాయంచవలె విరాజిల్లు చుండెను. మిన్నుపడంతి కట్టిన పట్టుదువ్వలంబోలె పండు వెన్నెల దెసల నాడెను. తారలు సానలుతీర్చిన రత్నములవలె మిణుకుమిణుకు మనుచుండెను. ఆ వెన్నెల బయట తైమూరు గుడారము చలికారుమబ్బునా ప్రకాశించు చుండెను. దాని ముందు మూడు సోఫాలపై ముగ్గురు సైన్యాధిపతులు తమ యుద్ధ ప్రణాళికను గూర్చి యోజించుచుండిరి. ప్రతాపరుద్రుని జయింప ముగ్గరముల నొగ్గు తురుష్కులలో నీ ముగ్గురు మొనగాండ్రు. వీరికి కలపారేల భోజనము. ఆంధ్రు లనిన వీరికి మాత్సర్యము హెచ్చు. వీరు సమరసన్నాహములను గూర్చి ప్రొద్దుపోవువరకు సుదీర్ఘ చర్చలు చేసి గుడారముల కేగిరి.

కుశీనలుడు శిక్షింప బడిన తర్వాత జైన ప్రముఖులకు కాకతీయ ప్రభువుపై ఆమాత్య శేఖరునిపై ద్వేషము పగ తీవ్ర రూపము దాల్చినది. తురుష్కసేనానులు నాడట్లు యుద్ధవిశేషములను గూర్చి ప్రస్తావించు కొనిన మరునాడు వేకువ వేళ దండపాణి, జయకర్-మొదలైన జైన ప్రముఖులు కొందరు మహమ్మదీయ సేనాపతి యైన తైమూరును గుడారమున రహస్యముగా కలిసికొనిరి ఆతురుష్కుడు వీరికి బహువిధ సత్కారములు గావించి వారితో నిట్లనెను.

" మాకు మీరు ముఖ్య స్నేహితులు మీసాయములేక ఇచ్చట మేము నిల్వలేము. మాకు మిక్కిలి పరిచితుడైన మాసమస్త కార్యములు నెరవేర్చుటకు సంసిద్ధుడై యుండిన కుశీలు డకారణముగ బందీయయ్యెనవి

వినియుంటిమి. వారి విడుదల కొద్దికాలములో చేయగలము. మీకు విచారము వద్దు, కుశీలుని స్థానములో మీరుండి మచ్చిక సర్వము, నిర్వహించవలెను. దండ :చిత్తము. కుశీలుడు శిక్షింప బడెనని మేము భయపడి వెనుకంజ వేయము. అతడొకడు లేనందున మా సంఘశక్తి ఎంతమాత్రము క్షీణించదు. ఓరుగంటి ప్రభుత్వము పెట్టుచిక్కులను లక్ష్యపెట్టము. ప్రాణములున్నంత వరకు మీ స్నేహము విడువము. మా నిశ్చితాభిప్రాయములను మరలింప నెవ్వరితరము కాదు.

తైమూరు :- మంచిది. మీ సంఘశక్తి, మీకు మాయందు కల్గిన అభిమానము గొప్పదని మేమెఱిగి యుంటిమి, కుశీలుని యంతటివారు మీలో పెక్కురు కలరు. మాకు సందేహము లేదు.

దండ :- చిత్తము.

తైమూ :- మీరు కేవలము మతాచారములలో మాత్రమే బ్రతుకు సామాన్య జైనులని మేము భావింపము. మీకు యుత్త తంత్రములు కోట రహస్యములు చక్కగా తెలయునాని మావిశ్వాసము. పైగ మీ స్వాధీనములో మంచి అటవిక సేన కలదనియు మాకు తెలియును. ఇంకను కాకతీయ సైన్యము మన పక్షమునకు తిరుగుటకు వీలుగ సేనాపతి భోజారెడ్డి మొదలైన ప్రముఖుల సహాయము కలదని మాకు తెలియును. మీరు మాకు చాల అంతరంగికులు. మీదేశము - మీరాజు మీకు చక్కగా తెలియును. కాన మేమెట్లు కోటను ముట్టడింపవలెను తెలుపుడు. మావిజయము మీ సహాయముపై ఆధారపడినది. మీరుచేయ మన్నది చేసెదము మానుమన్నది మానెదము. ఆంధ్ర దేశము మాకు వశమగు సులభమార్గము విపరింపుడు.

దండ :- అయ్యా ! ఆంధ్ర దేశమునకు మిమ్ములను ప్రభువులను చేసె దము. ప్రస్తుత పరిపాలన మాకు బాధాకరముగ నున్నది. దీనిని అంత మొందించు వరకు మేము విశ్రమింపము. ఇచ్చటిపరిస్థితు లట్టివి.

తైమూరు :- మంచిది. మేము వెంటనే చేయవలసిన కార్యక్రమ మేమి?

దండ :- కార్యక్రమమంతయు పూస గ్రుచ్చినట్లు లేఖ యందే వ్రాసి యుంటిమి. కాని ఆలేఖయే ఎట్లో నాగేయగన్నమంత్రికి పట్టు వడినది. ఇచ్చటి గూఢచారులు అసాధ్యులు-ఆవులించిన ప్రేగులు లెక్కపెట్టగలరు. మీరు జాగ్రత్తగా మసలు కొనవలెనువీరివలననే మన కుశీలునకు కారాగార ప్రాప్తి కలిగినది.

తైమూరు :- గడచినదానికి విచారించకుడు. త్వరలోనే కుశీవలుని విడి పించ గలము. ముట్టడిని గూర్చి మీ సహాయమేమి !

దండ : ప్రతాపరుద్ర భూపతి నగరమున లేడు. ఇది మన కనుకూల సమయము. మన సైన్యమును మూడు భాగములుగా చేయవలెను. ఒక దండు దండకారణ్యమునందున్న రుద్రభూపతిని బంధించుటకు పోవ లెను. రెండవ భాగము ఓరుగల్లు కోటముట్టడి కుపయోగింపవలెను. మూడవ భాగము ప్రతాపునకు సాయముగా వచ్చు సైన్యమును నిరోధించు టకు వినియోగింపవలెను.

కోటముట్టడికిమన సైన్యము వెనుకబడ వేయు సమయమాసన్న మైనపుడు, బోజారెడ్డి అతని దండు మనకను కూలపడగలదు.

తైమూరు : సెభాస్ మీ ఆలోచన బాగున్నది. అట్లే చేయుదము.

దండ ; ఈ కార్యక్రమములు పరచితమని వనమున రాజును బంధిం పవచ్చును. ఇట కోటను స్వాధీనము చేసికొన వచ్చును.

తైమూరు : మంచిది.

దండ : ఈ ప్రయత్నమతి రహస్యముగ జరుగవలెను. ఏ మాత్రము వెల్లడియైన మనకు ముప్పువచ్చును. వెంటనే దేవగిరికి కటకమునకు వార్తలను మనకు సాయముగ సైన్యములను తరలింప జేయవలెను. ఇచటి ఆంధ్ర వీరభటులు, సేనాపతులు కడు సమర్థులు. బల పరాక్రమ సంపన్నులు. మీరు సర్వశక్తులను కూడగట్టుకొని తగిన యేర్పాట్లతో రావలెను.

ఇట్లు వారి సంభాషణ మనేక యుద్ధవిశేషములతో సాగినది. తుదకు తురుష్క సేనానికి జైనులయెడ విశ్వాసము ప్రబలినది. అతడు మిక్కిలి సంతోషముతో నమూల్యరత్నములను వస్తువాహనములను సమర్పించి గౌరవించి వీడ్కోలొసంగెను.

# 17

అట్లు జైనులతో సంభాషించి తైమూరు యుద్ధముతో పనిలేకుండగనే విజయకాంక్ష పరిపూర్తికొరకు క్రొత్త యెత్తుగడ వేసెను. ఉల్లాఖానుని ప్రతినిధియైన యొక రాజనీతివేత్తను రాయబారిగ నాగయగన్న మంత్రి యొద్దకు పంపెను. ఆ రాయబారి ముందుగనే మంత్రి దగ్గరకు తన దర్శనాభిలాషను విన్నవించుకొని తదంగీకృతిని పొంది యుండెను. ఆ మరునాడాతడు మంత్రి సందర్శనమున కశ్వారూఢుడై బయలుదేరెను. ఆంధ్ర ప్రభువు సైనిక సంపత్తిని దుర్గ రక్షణము మొదలైన రహస్యములను గ్రహింపగోరియు నీతడు పరిశీలన దృష్టితో మార్గమధ్యమున బహు విశేషముల నరయుచు వచ్చుచుండెను. కొన్నిక్రోసుల పర్యంతము దుర్గమలైన వన ప్రదేశ మాతనికెదురైనది. అందెట్లో ప్రయాణించి గిరిదుర్గము

లను గాంచి యలినగర రక్షణకు సహజ ప్రాకారమగుటకు వింత పడెను. కొంతపేపటి కాతడు వెలిపాలెము చేరెను, అది నాల్గవ జాతి వసియు ప్రదేశము. అందు స్త్రీ లనేక వస్తువుల నమ్మకము చేయుదురు. ఆపై కాన వచ్చిన మట్టికోట నిర్మాణ పటిష్టతను గాంభీర్యమును గాంచి దిగ్భ్రమ చెందెను. రాయబారి వెలిపాలెము దాటి మోహరివాడ చేరెను. అచటి లోతైన విడివియైన యగడ్తను చూచి యతడాశ్చర్య పడెను. దానిని దాటి శిలాప్రాకారమును గాంచి దాని నిర్మాణశక్తి కబ్బురపడెను.

అచటి బురుజుపై శతఘ్నులున్నవి. వానిని జూచి యతడు విభ్రాంతు డయ్యెను సింహద్వారము సమీపించి లోనికిపో నుద్యమించెను. అచట కాపున్న వీరభటు లాతని నడ్డగించిరి. రాయబారి ముందునకు పోబోవ భటులకు కోపము వచ్చెను అతడు వెంటనే నాగయగన్న మంత్రి యిచ్చిన యనుమతి పత్రమును జూపి ముందునకు సాగెను. లోనికి పోవ నాతనికి రాజపధము కన్పించినది. అందు రధగజాశ్వపదాతులను చూచి చకితుడయ్యెను. సైనిక విన్యాసములందు పాల్గొన్న మైలారు భటుల సాహస విక్రమములను గాంచి భయభ్రాంతుడయ్యెను. అతడు శిలాప్రాకారము నుద్గమించి మధ్యాహ్నము పండ్రెండు గంటలకు నాగయ గన్న మంత్రియున్న యొక మహాసౌధమును జేరెను. ఆ భవనము సర్వాలంకారశోభితమై మిక్కిలి రమణీయముగ నున్నది. ద్వారముల కిరుదెసల కర్తవ్య పరాయణులైన రాజభటులు గలరు, వారాయనను వచ్చిన పనివి గూర్చి యడిగిరి. అతడు వారికికూడ ననుమతి పత్రమును జూపెను. ఆ పత్రమును తీసికొని యొక భటుడు లోనికేగెను. తన కార్యమెట్లగునో యని రాయబారి యాందోళన పడుచుండెను. వెంటనే భటులువచ్చి రాయబారిని సర్వాలంకృతమైన యొక ఆలోచనా మందిరమునకు గొని పోయిరి.

అచట నొక యున్నతాసనమున తప్తకనకాంత సర్గుడైన యొక మహాపురుష డుపవిష్టుడై యుండెను. అతడు ఆజానుబాహువు. తీక్ష్ణ దృక్ప్రసారుడు. విశాల ఫాలమువాడు. కోరమీసములతో మౌక్తిక ష్ఠిగిత మైన తలపాగను ధరించి యుండెను. అతడే నాగయగన్న మంత్రి యని భావించి రాయబారి సలాముచేసి నిలబడెను. మంత్రిశేఖరుని చే సంజ్ఞతో నాతడొక యాసనమును స్వీకరించెను.

మంత్రి : మీరెందుండి యేమి పనిమీద వచ్చిరి ?

రాయ : అయ్యా ! నేను మాసుల్తాన్‌వారు ఉల్లాఖాను సేనాపతి తైమూరు వారు పంపగ వచ్చితిని. పెషావరు పరగణాను గూర్చి కాబూలు సుల్తానుకు మాకు తకర్ వచ్చినది. వాడు వచ్చి గర్వపోతు, కయ్యా నికి కత్తిగట్టి కాలు దువ్వవాడు.

మంత్రి : ఇందుకు మేము చేయవలసినదేమున్నది ?

రాయ : మాకు మీ మద్దతు కావలెను. చక్రవర్తి వారి దర్శన మిప్పింప గోరెదను. మాకు మీరు కావలసినవారు. వదలు మనినను మేము వదలము. మీ సాయము లేనిదే పెషావరు సమస్య పరిష్కారము కాదు. మా సుల్తానువారు మీ రాజుగారికి అనేక సలాములుచేసి విన్న వింపుకున్న సమాచారమిది. మాకు కాబూలు సుల్తానుతో లడాయి నిశ్చ యము కాబట్టి, మీ సైన్యసహాయము మాకు తప్పదు.

మంత్రి : మంచిది. మీ సుల్తానుగారి స్నేహము మాకు పేక్షణీయమే. కాని మీ రాకను గురించి కొన్నిసంగతులు మిమ్మడుగవలసియున్నది. దానికి సమాధానము కావలెను.

రాయ : అగును. సందేహము తీర్చుకొనుట మీకు మాకుమంచిదే. మమ్మ డుగ దగిన మాట అడుగవచ్చును.

మంత్రి : మా స్నేహము కోరి మా మద్దతు కావలసిన వారైన ముందు మీ రాకను గూర్చి తెలుపవలెను. మా యనుమతిని పొందక మీరిట్లు మా సీమ ప్రవేశించుట యక్రమము. సైనిక సమూహములను దొంగ దారుల నడిపించుచు పవళ్ళు విశ్రమించుచు, రాత్రులందు పయనించుచు నిట్లు రహస్యముగ వచ్చుట చూడ మీ వర్తనము. చాల అనుమానా స్పదముగ నున్నది

మంత్రి యింగిత జ్ఞానమున కచ్చెరువువడి, రాయబారి తనలోని భావములను మోమున వ్యక్తము కానీయక గంభీరముగ నిట్లనెను.

"అయ్యా ! మా రాకకు మీతాకుదు పొందవలసిన పనిలేకపోలేదు. కాని మాకు వ్యవధి లేకపోయినది. గడచిడ పయనము చేయవలసి వచ్చి నది. వేసవి యగుటచే నెండకు తాళలేక యిట్లు వచ్చినాము. మావి తప్పు మాటలుకావు.

మంత్రి : కాబూలు యుద్ధమునకు మా సాయమెందులకు ? ఇందు మా సంబంధ మేమున్నది ? అయినను రాయబారమున కొకరిద్దరు చాలరా? ఇంత రాణులేల ? ఈ పరిథః ము లేల ?

అనిన మంత్రి మాటలకు రాయబారి లో నులికిపడియు మరల గాంభీర్యము వహించి యిటనెను.

రాయ : మంత్రివర్యా ? ప్రతాపరుద్ర మహారాజు గొప్ప సర్దారు. వారు దర్శనమునకు కొద్ది మందితో వెళ్ళుట మర్యాదకాదని మా సుల్తాను వారిట్ల పంపినారు. ప్రభు దర్శనము కావలెను.

మంత్రి : మీ మాటలతకి నట్లున్నవి. మాటలు పెంచవద్దు. ప్రభు దర్శన

మైదారు దినములలో మీరు కోరుకొనునట్లే కలుగును. తొందర పడకుడు.

రాయ : అయ్యా ! కాబూలు వాని ఫౌజీసరికి ఢిల్లీ సరిహద్దు చేరి యుండును. మేమిక్కడనొక క్షణమైన కాలూని నిల్పుటకు వీలులేదు. దయచేసి మాకోరిక నెరవేర్చుడు. బేగపోవలెను.

మంత్రి : రాజూరలేరు. రేపో మాపో నగర ప్రవేశము చేయుదురు. దర్శనమున కభ్యంతరములేదు త్వరపడకుడు.

రాయ : మీరు నన్ను త్వరపడవద్దని మాటిమాటికిని హెచ్చరించు చున్నారు. కాబూలు వాడు మాపై పడకముందే రాజదర్శనము కావలెను. లేనిచో చాల విపరీత పరిస్థితు లేర్పడగలవు. అప్పుడు మీతో మాకు వైరము తప్పదు.

మంత్రి : (కోపాద్రిక్తుడై) ఏమీ ! వైరమా ! మా సాయము గోరవచ్చి మమ్మే బెదరింతువా ?

రాయ : మీరు మాతో మైత్రి పాటించి కప్పము కట్టినచో శత్రుత్వము లేదు. లేనిచో దేవగిరి రాజా, కటకభూపతి మాకు సాయముగా వచ్చి మీ యోరుగంటిని నిమిషములో ముట్టడింపగలము.

రాయబారి యహంకారమునకు తురుష్కుల కుట్రకు విస్మయపడి వెంటనే రాయబారిని బంధింప వలసినదిగ భటుల నాజ్ఞాపించెను. ఇంతలో నెచటి నుండియో మేధావి వచ్చి యిదియంతయు తెలిసికొని దూత యవధ్యుడని యాతనిని విడిపించెను. రాయబారి ప్రాణములు దక్కించుకొని

బ్రతుకు జీవుడా యని తన సేనాపతి యొద్దకుపోయి జరిగిన సంగతులను వివరించెను.

# 18

ఒకనాటి రాత్రి కేరళశాస్త్రి తురుష్క సేనాముల దర్శనార్థియై వచ్చెను. అందు సుప్రసిద్ధుడైన మల్లికి తైమూరున్న ఏటకుటీరమునకు వచ్చి యతని దర్శనార్థియై వాకిట నిలచెను. అంతనొక మహమ్మదీయ భటు డాతనిని తైమూరు సన్నిధికి గొనిపోయెను. కేరళ శాస్త్రి సవినయ ముగ ఆతనికి సలాముచేసి ప్రక్కకొదిగి నిలచెను. తైమూరు హుక్కా పీల్చుచు పొగను దొంతరలుగ వదలుచు శాస్త్రిని చూచి బహుమాన పురస్కారముగ నాసనమును జూప అందు కూర్చొన గోరెను.

ఈ శాస్త్రిని చూచుటతోనే తైమూరున కొక నూత్నోత్సాహము జనించెను. ఆతని వేషమును పై ఖరిని నిలువెల్ల పరిశీలించుచుండెను. శాస్త్రి జరీ తలపాగ శిరమున ధరించెను. ఒక కాశ్మీరపు పనితనము గల శాలువను భుజముల దిగువార కప్పుకొనెను. విశాలమైన నుదురు ఎదుటి వారి యింగితమును ఇట్టే గ్రహింపగల దీర్ఘ నాసికము గల్గి చూచువారి కతడొక ప్రజ్ఞావంతుడని చెప్పకయె చెప్పును. నుదుట విభూతి రేఖలను తీర్చెను. భ్రూమధ్యమున సింధూరపు బొట్టు నలంకరించెను. మెడల రుద్రాక్ష మాలయు చెవుల మకర కుండలములు ప్రకాశించుచుండెను. ఆతని పెదవుల పై ఖరిలోని పట్టుదలను స్ఫురింపజేయుచుండెను.

ఆతని వేషము పరికించి నాగయగన్న మంత్రియేదియో తంత్రము పన్నుట కితని పంపి యుండెనని మొదట సంశయించెను. ఆ భావమున మోమున ప్రస్ఫుటము కానీయక నిర్వికారముగ నిట్లు సంభాషించెను.

తై మూరు : శాస్త్రిగారూ ! మీరు ప్రతాపరుద్ర మహారాజుగారి యస్థాన పండితులని తోచుచున్నది. మీరే శాస్త్రములందు పండితులో తెల్పిన సంతోషింతును.

శాస్త్రి : అయ్యా ! నేను రాజుగారి యాస్థాన పండితుడనుగాను. నాకు వారికి సంబంధములేదు. వారి యాస్థానమున నాబోటి వానికి ప్రవేశము లభించునా ? నేను జ్యోతిష పండితుడను. ఇతర శాస్త్రములందును పరిచయము కలదు. తమవంటి సర్దారుల యనుగ్రహమే నా జీవనము.

తై మూరు : శాస్త్రిజీ ! మీ శాస్త్ర పరిచయములు, మీ వాక్యములు విన నింపుగ నున్నవి. మీరు మంచి పండితులని మా పరివారము చెప్పగ తెలిసికొని సంతోషించితిని. మీతో మాకొక పనివచ్చినది.

శాస్త్రి : అయ్యా ! అంతకంటె కావలసినదే మున్నది. నేను మీకేదయిన సాయము చేయగలిగితినేని మిక్కిలి సంతోషము. నన్ను మీ శత్రు వర్గములోని వానిగ భావింపక దాపరికము లేకుండ మాటాడ వచ్చును.

తై మూరు : అదెట్లు సాధ్యము శాస్త్రిజీ ! మీ రోరుగంటి వారు. మేము మహమ్మదీయులము. మీరు హిందువులు. మాపై మీ కభిమాన ముండుట సహజము కాదు. ఏమందురు ?

శాస్త్రి : సర్కార్ ! ముమ్మాటికి నేను సత్యమునే చెప్పుచున్నాను. ఓరుగంటి రాజు పాలనలో మేము సుఖపడుటలేదు. మా శస్త్ర విద్యలకు ఆదరణలేదు. మీకున్న అభిమానము, గౌరవము, మా రాజుకు మా

యందు మా విద్యలయందు లేదు. కనుక మీ క్షేమమునే మేము కోరు చున్నాము. ముమ్మాటికి నమ్ముడు.

తైమూరు : మా యుద్ధ యాత్రా ఫలితమును గూర్చి మీరు చెప్పగలరా ? మీరు జ్యోతిషమున గొప్ప పండితులు గదా !

శాస్త్రి : (కనుబొమలు చిట్లించి — క్రీపెదవిని వక్రముగ దిద్ది) ఆ ! తమ యనుగ్రహమున్న మాకేమి కొదవ. ఒక యుద్ధ యాత్రను గూర్చియే గాదు. తమ జన్మ రహస్యమును గూర్చి కూడ చెప్పగలను.

అని కొంతసేపాగి ఆకసము వంకజూచి.

నిశ్చల నయనుడై, వ్రేళ్ళ లెక్కబెట్టుచు నిట్లనెను అయ్యా ! మీ ప్రశ్నకు కాలనిర్ణయ మొనరించి గణితము వేసి చూచితిని. తమ యోగము బాగున్నది తామిపుడు రాజును బంధించుటయా, లేక కోటకు ముట్టడించు టయా యని తొక్కట పడుచున్నారు. మీ ప్రయత్నముల ఫలితము లిప్పుడు విశదీకరించు సమయముకాదు. మరియొక సందర్భమున విశద పరచెదను.

తైమూరు మిక్కిలి ఆశ్చర్యమును పొందెను. ఆ సిద్ధాంతి వాక్య ములు వినుటకు త్వరపడుచుండెను.

శాస్త్రి సహజముగ హాస్యమున కాలము గడుపువాడు. పిట్టకథలు చెప్పుటకు పెట్టినది పేరు. వినువారిని కడుపుబ్బ నవ్వించును. మాటకారి. చమత్కారి శాస్త్రి తన జోస్యమును వినుట కాతురాతతో నుండిన మహా మ్మదీయ సేనానిని శ్లాఘించుచు సహజ పాండిత్యప్రహర్ష యిచ్చు వడు కొన్ని హాస్యోక్తులు వినిపించి కడుపుబ్బ నవ్వించెను. తర్వాత తైమూ రిట్లనెను.

" సిద్ధాంతిగారూ ! అడిగిన ప్రశ్నను విడిచి యన్యకథలు చెప్పెద రేమి? నవ్వించుటలో గట్టివారే. జ్యోతిషము ననీగట్టితనము కన్పరచి మమ్ము సంతోష పెట్టుడు.

శాస్త్రీ ; అయ్యా ! జ్యోతిషము రెండు విధములు అది సిద్ధాంతము, రాద్ధాంతము నని చెప్పబడును. మొదటి భాగము నేను చదివితిని. రెండవ భాగము ప్రతాపరుద్రలవారి యాస్థాన పండితుడు వల్లెవేసినాడు. వానికి నాకు షష్టాష్టకము. అనగా విరోధము. అతని తమాషాలు నాకు గిట్టవు. నన్నుచూచి యీతడోర్వలేడు కంట నిప్పులు పోసికొనును.

తమ సాన్నిధ్యమున నేనట్లు గ్రహించినచో రాజుగారితో చాడీలు చెప్పినన్ను తంటాలు పెట్టగలడు. ఆస్థాన పండితుడనని యతడు విఱ్ఱ వీగును. నాజాడ వానికి తెలియ కూడదు. ఈవిషయము వెల్లడి కాకూడదు.

తైమూ ; శాస్త్రి ! మావల్లనే సంగతులు వెల్లడి కావు. గోచారమును గూర్చి సంపూర్తిగ జెప్పిమా మన్ననలు పొందవచ్చును.

శాస్త్రీ ; చిత్తము. ఇంత వరకు తమ వంటి సర్దార్లచే వందల కొలది బహుమతులు పొంది యుంటిని.

అని యొక తాళ పత్రమును తీసికొని అడ్డముగా నిలువుగా కొన్ని గీట్లు గీచి, కొన్ని యంకెలు వేసి, వ్రేళ్ళు లెక్కించి లోలోన గొణగి, కొంత సమయము యోచించి తైమూరును చూచి యిట్లనెను.

" అయ్యా ! రుద్రునకు మీకు రణము దారుణముగా జరుగును. తురుష్కులకే సందర్భమున తప్పక జయము లభించును. మారాజు సైన్యము మీసేన కంటె చాల తక్కువ. మీసర్దారులు యుద్ధము నందారి తేరినవారు. మా యాంధ్రులు భోగలాలసులు మీకు జయము తప్పదు.

తైమూ : సెబాస్ శాస్త్రీజీ ! మీరు నిజముగ దైవజ్ఞులు. మీరు మా సత్కారమును పొందుడు.

అని కొన్ని రత్నములను బంగారు నాణెములను నూతన వస్త్రము లను బహూకరించి వీడ్కోలొసంగెను.

భారతీయ సంస్కృతికి సూత్రయుగము చాల ముఖ్య మైనది. ఈయుగమున వేదములు వేదాంగములు, షట్శాస్త్రములు ధర్మసూత్ర ములు - గృహ్య సూత్రములు - నట సూత్రములు - వ్యాకరణ సూత్ర ములు నుద్భవించినవి. వేదములలో పరమప్రధమైన ఋగ్వేదము క్రీ. పూ. నాలుగువేల సంవత్సరముల క్రితము ప్రారంభింప బడినది. తర్వాత యజుర్వేదము - సామవేదము - నథర్వణవేదము క్రమముగ వెలసినవి. తర్వాత వేదాంగములైన శిక్ష-వ్యవహారము ఛందస్సు -జ్యోతి షము-కల్పము-నిరుక్తము రచింప బడినవి ఖగోళశాస్త్రము జ్యోతిషము నకు తల్లి వంటిది. మొదటిది లేకుండ రెండవది లేదు. ఖగోళశాస్త్రము నకైదు వేల సంవత్సరముల చరిత్ర యున్నది. జ్యోతిశ్శాస్త్రమెప్పుడును ఖగోళశాస్త్రము నాశ్రయించియే బ్రతుకు చున్నది వేదపండితుని మొదలు విస్సన్నవరకు రాజు మొదలు రంగని వరకు జ్యోతిషమును లోకముమూఢ ముగా నమ్ముచున్నది. గ్రహములనుబట్టి మన జీవితములు నడచు చున్నవను పురుష ప్రయత్నము ప్రధానమని గ్రహములను బట్టి జీవితము లమీద వలసినదే మన జ్యోతిష్కుల యభిప్రాయము. ఈ గ్రుడ్డి నమ్మకము చిలువలు పలువలై పెరిగి సాంఖ్యాజ్యోతిషము హస్తసాముద్రికము, పుట్టుమచ్చల శాస్త్రము, సోది, చిలక జ్యోస్యము - శరీర లక్షణ శాస్త్రము మొదలైనవిగ వృద్ధిపొందినవి. మానవుని మనో దౌర్బల్యముల నాశ్రయించి యీ శాస్త్రముల పేరి పెక్కుమోసములు రాజ్యము చేయు చున్నవి. ఇవి యసత్యములని నిత్యజీవితములో ఋజువగు చున్నది.

యుద్ధములందు, గృహ నిర్మాణములందు, వివాహము అందు నింకను పెక్కు మానవ జీవిత సంఘట్టన అందు జ్యోతిష్కులు ధనా పేక్షతో గావించు వంచన సర్వయుగము లందును కొనసాగుచునేయున్నది.

గ్రహచారమును బట్టి జీవితములు నడవవలసినదేనా ? మన జీవితములు గ్రహ కూటమితో నేర్పడినవా ? గ్రహదుర్వీక్షణ వల్ల మానవులకు ప్రాప్తమునిశుభములు శాంతుల వల్ల శాంతించునా? ఇదియంతయు భావిదౌర్బల్యము. నిజముగ గ్రహపీడల వలన మనకు వ్యాధులు సోకినచో వైద్యసహాయము లేకనే కేవల శాంతులతో వ్యాధులు తొలగిపోవునా ? ఇది కేవలము భావ దాస్యము కాదా ?

అసలీ జ్యోతిష్యము హేతువాదముపై నిలుచు శాస్త్రము కాదు. దీనికి శాస్త్రీయ దృక్పధమే లేదు. మన జోతిష్కులు భూమి చుట్టును సూర్యుడు తిరుగునని, భూమి తిరుగుట లేదని చెప్పు చున్నారు. ఇది యా శాస్త్రీయ విషయము. ఈ విషయము తెలియని జ్యోతిశ్శాస్త్రజ్ఞులకు నక్షత్రములు మానవునిపై జూపు ప్రభావమును గూర్చి వీరికెట్లు తెలియును.

భూమి విశ్వమునకు కేంద్రమని జ్యోతిష్కుల సిద్ధాంతము. అందు వలననే జాతక చక్రమునభూమిని నాభిస్థానముగా నిర్ణయించిరి. విశ్వములో భూమి స్థానము చాల క్షుద్రము. భూమి గ్రహమని, సౌరకుటుంబములో శుక్రాంగారక గ్రహములకు మధ్య యున్నదని జ్యోతిష్కులకు తెలియదు. భూమి తన చుట్టుతానుతిరుగుచు సూర్యుని చుట్టును తిరుగు చున్నదనుట జ్యోతిష్కులకు తెలియదు.

సూర్యుడొక నక్షత్రము. ఇది గ్రహమని మన జ్యోతిష్యుల భావము. పైగ సూర్యగోళము భూమి చుట్టు తిరుగు చున్నదని వీరి యభిప్రాయము. కాని యది యిట్లు జరుగలేదు. సౌరకుటుంబమునకు సంబంధించినంత వరకు సూర్యునకు చలనము లేదు. సౌరకుటుంబముతో పాటు

సూర్యగోళము పాలపుంతలో ప్రయాణము చేయుచున్నది. సూర్యగోళము భూమికంటే పదమూడు లక్షల రెట్లు పెద్దది. ఇది యొక భూగోళమునకే గాక మిగిలిన గ్రహముల కన్నిటికి కేంద్రము. గ్రహములన్నియు సూర్యుడు కేంద్రము. వేర్వేరు కక్ష్యలలో నాతని చుట్టు తిరుగుచున్నవి.

చంద్రుడు గ్రహమని జ్యోతిష్కుల సిద్ధాంతము. కాని చంద్రుడుప గ్రహము. తాను భూమిచుట్టు తిరుగుచు భూమితో పాటు సూర్యుని చుట్టు తిరుగుచు, సూర్యునితోపాటు పాలపుంతలో పయనించుచు, పాలపుంతతో పాటు విశ్వములో తిరుగుచున్నాడు. ఈవిషయములు జ్యోతిష్కునకు తెలియదు. జ్యోతిషము ప్రకారము బుధ, శుక్రాంగారక బృహస్పతి శని గ్రహములుభూమి చుట్టును తిరుగవలెను. కానియది యట్లు తిరుగుట లేదు. ఈగ్రహము లన్నియు వేర్వేరు కక్ష్యలలో వేర్వేరు వేగములతో సూర్యుని చుట్టు పరిభ్రమించు చున్నవి. ఇది యున్న క్రమము కూడ జ్యోతిష్కులకు తెలియదు. తెలిసికొనవలెనన్న కాంక్షయు వీరికిలేదు.

భారతీయ జ్యోతిషము ననుసరించి రాహువు కేతువును గ్రహములే. ఈ గ్రహములే సూర్యచంద్ర గ్రహణములకు కారణమని వీరి భావము. రాహుకేతువులను నవి యీ విశ్వమున నెచ్చటను లేవు. ఇవి లేక సూర్యచంద్ర గ్రహణము లెట్లు సంప్రాప్తించు చున్నవి ? అను నది ప్రశ్న.

భూసూర్యులకు మధ్య చంద్రుడు వచ్చినపుడు సూర్యగ్రహణ మేర్పడును. సూర్యచంద్రులకు మధ్య భూమి వచ్చినపుడు చంద్రగ్రహణ మేర్పడును. ఈగ్రహణము లిట్లేర్పడుచున్నవన్న విషయము నాలుగవ తరగతి బాలునకు కూడ నవగతమే ! సూర్యచంద్రులను రాహుకేతువులు మ్రింగుటవలన గ్రహము లేర్పడు నను జ్యోతిష్కుల మాట యదార్థము కాదు.

అసలు జన్మనక్షత్రముల నిర్ణయము నందే దొడ్డచిక్కులున్నవి. శిశు జనన మెప్పుడు జరుగును. స్త్రీ పురుష బీజములు కలిసి పిండోత్పత్తి జరిగినపుడా ? అంతకు పూర్వమా ? లేక తర్వాతనా ; లేక శిశువు గర్భమునుండి వెలుపలికివచ్చినపుడా? లేక బొడ్డుత్రాడుకోసినపుడా? మన జ్యోతిష్కులు జనన వేళను పిండోత్పత్తి సమయమననుసరించి గణింపరు. బిడ్డ భూమిపై పడినప్పటి సమయమును మాత్రము మన జ్యోతిష్కులు లెక్కలోనికి తీసికొందురు ఇట్లు శాస్త్రీయములు, హేతురహితములైన పెక్కంశములు మన జ్యోతిషమున నున్నవి.

వాస్తవ జీవితములో జ్యోతిష్కులు చెప్పు ఫలితములు మూఢవిశ్వాసముతో కూడి కొని యున్నవి. అవి నిజమైనవి కావు. కనుక కేరళశాస్త్రి తైమూరునకు చెప్పిన యుద్ధఫలితమును మనము వేచి చూడవలసి యున్నది.

# 19

దండకారణ్య సమీపముననొక సువిశాల విలిక్త ప్రదేశమున తైమూరాధ్వర్యమున రహస్యముగ నొక సమావేశము జరిగెను. అందు యుద్ధ యాత్రావిషయములను గూర్చి మహమ్మదీయ సైన్యాధిపతులు వీర సైనికులు చర్చింప నొచ్చిరి. రణనీతి పారకు డగు తైమూరిట్లనియెను.

తైమూరు: ఢిల్లీ నుండి యెరులెరుంగకుండవచ్చి యోరుగల్లు జొచ్చి శత్రువుల నిర్మూలించి యాంధ్రదేశమాక్రమింపవలెనను మన తలంపు లోకమునకు తెలిసినది. కావిందు. పనులు బహిరంగముగ జరిగిన తలపులు రహస్యముగ నుండునా ? మన రాకయందఱకు వెల్లడియైనది. అగుగాక ఏకరులేదు. అందు వలన చెడినదిగాని మించినదిగాని యంత

మాత్రము లేదు. యుద్ధమిరు కక్షలకును శ్రేయస్కరముకాదనిరాజనీతి చెప్పు చున్నది. సైనిక క్షణము గత్యంతరము లేని యెడల తుది మార్గము మాత్రమే. రక్తపాతముతోగాక భేదోపాయముచే యుక్తిచే, నగర నిర్జించి జయము నొందుట ప్రయోజ కత్వము. మన వారి ననేక వీరులను చంపు కొని సాధించు జయము జయముకాదు.

అఫ్గన్ : సెబాస్ : మీరనినట్లు యుద్ధముమాని యితరోపాయముచే నోరుగంటి రాజును పదభ్రష్టుని చేసి జయ కన్యను స్వీకరించుట కంటె మనకు విశేష కార్యమొకటి లేదు. కాని మన సిద్ధాంతము వేరు మన ధ్యేయ ముమత ప్రచారముగదా ! మన మహమ్మదీయ మత వ్యాప్తికి హిం దువులను హింసించి లొంగ దీసి కొనుటలోనధర్మము లేదు. యుక్తి వలన మనకు లభించునది రాజకీయ విజయమేగాని మత విషయక మైన విజయముకాదు.

తైమూరు : ఆంధ్రులు మొండివారు. కంఠమునందూపిరి యున్నంత వరకు వెనుకకు తగ్గరు మొగ్గరు. యుద్ధమతిదారుణముగ దీర్ఘకాలము జరుగవలసి యుండును. యోచింపుడు అదియును గాక మనకే జయము గల్గునని నిశ్చయముగ చెప్పగలమా ?

తగన్ : మీరు భయులిట్ల యభిప్రాయ భేధములతోనుండుట నాకు సమ్మ తముగాదు. ఆంధ్రులు సమరమున వెనుకకు తగ్గరనియు యొగరనియు చెప్పుట పరిహాసాస్పదము. ఆంధ్ర వీరుల పరాక్రమము మహమ్మ దీయ వీరులకు పరిచితము గాదు. ఈ క్షణమందు యుద్ధమే తార సిల్లిన ఆంధ్ర పౌరుషము తురుష్క విక్రమము లందలి తారతమ్య మును మీరే గ్రహింప గలరు. మహమ్మదీయ సేనా సముద్ర ముపొంగిన ఆంధ్ర దేశమునే గాదు. సర్వ భారతమును ముంచివేయ గలదు. వారి నాపుట నెవ్వరికిని సాధ్యము గాదు. రుద్రుని సైన్యము

కంటె మన సేన రెట్టింపు గలదు. అవసరమైన దేవగిరి నుండి కట కము నుండి మనకు సైన్యములు రాగలవు, ఆంధ్రు లెంత వారి బల మెంత ? ఖడ్గ ప్రహారము వలన వారి మద మణచ వలెనే గాని సామోపాయము పనికి రాదు. అది మన ప్రఖ్యాతి భంగకరము. కత్తి పట్టి పోరుట వీరమార్గము. సెలవైనచో హిందూ సైన్యమును ముక్కలు ముక్కలు చేసి కాకులకు గ్రద్దలకు వేయగలను. వట్టి కష్టింపుల వలన ప్రయోజనము లేదు. యుద్ధమందు మన కావశ్యము జయము కల్గును. శీఘ్ర ముగాడ కాధి పతులకు ఫర్మానాలు పంపి యుద్ధ ప్రకటన చేయింపుడు. రుద్రుని పట్టి బంధింప వలెనే గాని సం ధింపవలను పడదు.

ఒక వీరసైనికుడు: ఆహా! ఈమాటలు తగిన మాటలు. పాదుషాగారి జండా క్రింద బ్రతుక దగిన యాంధ్రులతో మనము సంధి చేసి కొనుట మిక్కిలి శోచనీయము. ఈ సంధి కురంగమునకు సింగము లొం గుట వంటిది. అమ్మక్కడి మూకలను బాకుల చేయుటయుత్తమము. సంధించుట కడుసిగ్గు. మిక్కిలిహేయము.

రెండవ వీరుడు ; అందందు నిదివరకు జరిగిన పోరులందాంధ్రుల పరాక్ర మము మనకు తెలిసినదే. వారకాశ్విక దళము చాలినంత లేదు. వారి కాల్బలము సుప్రసిద్ధమైనదే. సందేహము లేదు. మన యశ్విక దళము సామర్థ్యము గలదనుట జగత్ప్రసిద్ధము. ఈస్థితిలో దండో పాయకు తగిన కార్యము.

మూడవ వీరుడు : ఆంధ్రవీరులు కయ్యమనిన గణాచారుల మాడ్కి గంతులు త్రొక్కుట వాస్తవమే గాని, యుద్ధమందుయుక్తి నెఱు గరు. దుర్గరక్షణలో వీరుపుంగవులు. వారి దుర్నిర్మాణముశత్రువులకు

భేదింపరానిది. కానియాధునిక యుద్ధతంత్రమున వారంత నేర్పరులు కాదు. మనకున్న శతఘ్ని దళము వారికి సమకూరలేదు. కనుక మనకు జయము నిశ్చయము.

నాల్గవవీరుడు : అట్లన జనదు. ఆంధ్రులు వట్టి పిరికికండ గలవారు. కాఫరులు వారల జయించి మన మతమును వ్యాప్తి చేసి కొను టయే మన కర్తవ్యము. మతవ్యాప్తికై ఖడ్గము పట్టవచ్చునని మహమ్మద్ ప్రవక్త చెప్పియున్నాడు. సంధికి వారొడ బడినను మనము సమ్మతింప రాదు. సంధి జరిగినచో మహమ్మదీయ విక్రమాదిత్యుడస్తమించినట్లు జగము భావించును. కాన నితరోపాయములు మాని శీఘ్రముగ యుద్ధమునకు సిద్ధమగుట యుత్తమము.

తైమూరు : మంచిది. నీవాక్యములు విచారణీయములు. త్రోసివేయుటకు వీలులేనివి. మీ యభిప్రాయములను బట్టి యుద్ధప్రకటన మన కర్తవ్య మని భావింపు చున్నాను.

ఆఫ్గన్ : సర్దార్. పెక్కు మాట లెందుకు. రుద్రుని పట్టి బంధించి మీ ముందుంచెద. నాకు ముప్పదివేల సైన్యము నిండు.

తైమూరు : ఏమది మాటల చేతనే రుద్రునిపట్టి బంధింప చుంటివే. ముప్పది వేల సైన్యమే గాదు. మూడు లక్షల సైన్యమైనను లాభము లేదు. రుద్రుడు సామాన్యుడు కాదు. విక్రమ సింహుడు.

మరియొక యుపాయముచే రాజు వశ్యుడు కాగలడు. మన సైన్య మును రెండుగ విభజించి ఒక భాగముచే ముందు కోటను ముట్టడించి అటుకొకి యిటు ప్రాలకుండ కట్టుదిట్టము చేసి కాచియుంచ వలెను. అంత

కోట యందున్న మూల బలము కొన్నాళ్ళలో తిండిలేక యల్లాడును. పర సహాయములేని మూలబలము బడాయికేగాని లడాయికి నిలువలేరు. నిలిచి నను తిండి తిప్పలు లేక యల్లాడుచున్న యా బలమును వెంటబడి కొట్ట వచ్చును. పట్టవచ్చును. అటు పిమ్మట రాజెచటనున్న నీకెలు తీసిన కోడి వలె మనకు దొరకును. అతని పటారము బయటబడును. ఇంతకంటె నుపాయాంతరములేదు. ఇపుడు రాజు వనమున వేటలో నున్నాడు. ఆతని వెంట వేటసిబ్బంది మాత్రమే యుండును. పురి జేరక మున్నే ఆతనిని బంధింపవలెను.

అంత తగిన్ "మీ తలంపు లెస్సగనున్నది. నేర్పుతో కార్యసాధన చేయవలసి యున్నది" అనెను.

అటులైన కొలదిసైన్యముతో రుద్రుని వనమునకేగి రాజును ముట్ట డించెదను. మీరును ఢిల్లీనుండి దేవగిరి నుండి వచ్చెడి పదాతి వర్గముతో కూడి కోట ముట్టడించి నారాకకై వేచియుండుము. ఆంధ్రదేశము మనకు స్వాధీనమగుట యెంతటి పని ! అల్లా కృపవలన నా తంత్రమున నతడు చిక్కిన మనకెక్కువ ప్రయాస పడవలసిన యవసరముండదు. కోట లోని మూల బలమును నాశనముచేసి కోటను వశపరచుకొన వచ్చును. అపుడాంధ్ర దేశము మనకు దక్కును. ఈ యత్నమున జైనుల సాయ మెట్లోయుండనే యున్నది". అని తన నిర్ణయమును ప్రకటించి తైమూరు తన పరివారమునకు సెలవిచ్చి రుద్రుని బంధించుటలో నిమగ్ను డయ్యెను.

# 20

తైమూరు సైన్యము విడిదిచేసిన వనప్రదేశమునకు కొలది దూరములో కొన్ని పల్లెలున్నవి. ఆ పల్లెలు నేటి కుగ్రామముల కంటె హీన స్థితిలో నున్నవి. ఆ పల్లీయులు సాధారణముగ అడవులందు లభించు తేనె, కలప - కర్పూరము - మొదలైన సామాగ్రిని నాగరిక ప్రజలకు అందించి బ్రతికెడివారు. వారిలో ఎక్కువమంది కట్టెలను తమ బండ్లపై నెక్కించి అనుమకొండ మొదలైన ప్రదేశములకు గొనిపోయి వానిని విక్రయించి తమ జీవితావసర వస్తువులను తెచ్చుకొనుట యాచారము. నిరంతర కాయకష్టముచే వారి యొడళ్ళు చేవదేలినవి. శీతవాతాపములను వారు లెక్కసేయరు. ఆ పల్లెలలో చాకళ్ళు, మంగళ్ళు మొదలైనవేర్వేరు వృత్తులవారుండిరి. వారిని ప్రతివిషయమున నడిపించువారు గ్రామపెద్దలు. వారి యాజ్ఞ సుగ్రీవాజ్ఞ. ఈ గ్రామ పెద్దలకు దేశపరిస్థితులు తెలియును. వీరిలో కొందరికి సైన్యములోని దళవాయులతోను, రాజ్యములోని ప్రాంతీ యోద్యోగులతోను పరిచయమున్నది.

విద్యాగంధము లేక మారుమూలనున్న శ్రామికులు మొదలు, విద్యావంతులైన యున్నతోద్యోగుల వరకు ప్రజలలో కాకతీయ ప్రభువులపై, ఆంధ్రరాజ్యముపై మొక్కవోని యభిమానము భక్తి తొణికిసలాడు చుండెను. వేర్వేరు కులములవారు సంప్రదాయముగ వచ్చుచున్న స్థిరమైన చక్రమువంటి నీతి నిష్ఠలందు బ్రతుకు చుండిరి. స్థిరముగనున్న యీ వ్యవస్థకు భంగము కల్గించుట నాటి వారు మహాపచారముగ సంఘోపద్రవ కరముగ భావించెడివారు. ఏ వృత్తి వారావృత్తి నాశ్రయించి బ్రతుకుట. ఆ వృత్తిలో నైపుణ్యము చూపి కీర్తి ప్రతిష్ఠలను సంపాదించుట, వారి

వారి సంఘములందు పెద్దరికము వహించుట తరతరములుగ వచ్చు చున్నది.

ఒకనాటి రాత్రి వీరన్న యను నొక రజకుడు, రంగన్న యను నొక క్షురకుడు మహమ్మదీయ గుడారములందు పనిచేసి వారి గ్రామము లకు పోవుచుండిరి. వారిట్లు మాటాడుకొన జొచ్చిరి.

వీరన్న : రంగన్నా ! నీ కెట్లుంటుందో కాని తురకోళ్ళను చూస్తే నా వొళ్ళు భగ్గునమండుతుంది. మొన్నొక ముసల్మాను మాబొట్టెను వొంగోబెట్టి, ఖాంభోడీ, ఖాంభోడి, యంటూ గుభికిగుభికి గుద్దుతుంటే నా గుండె తరుక్కు పోయిందనుకో, ఆ తురకోళ్ళకు కన్నూమిన్నూ కనబడటంలేదు. వాళ్ళ పొగరణిచే వాళ్ళింకా కనబడ్డంలేదు. పెద్ద మంత్రిగోరు మా పెద్దోళ్ళ మూలంగా వాళ్ళనుకునే మాటలు మూటకట్టుకు రమ్మన్నారు. వాళ్ళ బాస నాకు బాగ తెలుస్తది. కాని తెలవనట్టు తిరుగుతుంటాను. ఆడపన్లుకి కులపోళ్ళు నన్నె ముందుకు నడిపిస్తారు. అళ్ళు చెప్పినట్టు నడవకపోతే పెద్దతనం దక్కదు. తుర కోళ్ళ గడ్డాలు చూస్తే వొళ్ళు గరపొడుత్తుంది. అక్కడికి పోయి యిచ్చ కాలాడకపోతే కులపోళ్ళతో పోటు. ఎట్టాచచ్చేది.

రంగన్న : యీరన్నా, నీ కెందుకయ్యా యింత బయం. అందరికీ వుతికి నట్టే ఆళ్ళకీ వుతకరాదా ఏంటి. అళ్ళు మాత్రం మడుసులు కాదా. కొట్టి సంపుతారా. పైగా నువ్వుచేసే పని అంత గడ్డది కాదాయె. నేను వాళ్ళ గడ్డాలు తలలూ గొరగటంలా.

వీరన్న : వోసెబ్బో ! యెంత మొనగాడువు. చెప్పటం కేంలే. చెయ్యటం కట్టం. బరబరా గొరగటం కాదయ్యోయి. మీ పనికి మా పనికి వారుంది. మంటి గుడ్డలు మైలగుడ్డలు పెద్దపెద్ద మూటలు గట్టుకొని

యీపులు కాయలు కాసేటట్టు గాడిదలాగున మోస్తము. రేవుకిపోయె యాటికి గూళ్ళకీళ్ళు బందవుతాయి. బండమీద కొట్టిందేకొట్టి పిడిసిందే పిడిసి మల్లెపూవల్లె తెలుపుతెచ్చి ఆరబెట్టి మడతపెట్టే తప్పడికి పెద్దలు దిగొత్తారు. మా పనంటే మాట్లనుకున్నావా ? ఎంత వుతికినా, తోవినా కాస్త మాసికుండదా. అది చూసి ఒరే సాకలీ ఇట్రారా అనేదీ బండ బూతులు తిట్టేది వాంగోబెట్టి గుద్దేది ఇదీ వరస. ఎందుకియ్యా మా బతుకు. అన్నీ వున్న మారాజులు అంత అదిరిపడరు. కాని కూడూ గుడ్డాలేని నాయాళ్ళకు పట్టపగ్గాలుండవు. ఆళ్ళను మెప్పించటం కట్టం. ఎంత కట్టపడ్డా తిట్లుమొట్లు తప్పదు.

రంగడు : వోరి యీరన్నా. ఇట్టను యీ కట్టమంతా వొక తురకగడ్డం గొరిగే కట్టంలో సగంలేదు. మేం గొరగటంలో కొంచెం చురుక్కు-మంటే గిరుక్కు-న మొగం తిప్పి యేవిరో మదమెక్కి-ందా ? అని కళ్ళెఱ్ఱచేస్తడు తురకోడు. జీతం బత్తెం యిచ్చే మారాజు లేవర నరుగాని, జీతం బత్తెం యివ్వలేని దుడుకు పిండాలు యేసే గంతులు సెప్పాలా ? మొన్న వొక తురకోడు సవరం చేత్తుంటే కాత్తి కత్తి తెగిందోలేదో ఫెడేలున చెంపకేసి కొట్టిండు. ఏం చేసేది. గుడ్డనీళ్ళ గుడ్డ కుక్కు-కొని యేడ్చాను. పదిమందికీ చెప్పుకుంటే పొరువు పోద్ది. పనోడికి బయంలేకపోతే తన్నాల్సిందే నంటరు.

వీరన్న : రంగన్నా; నీ పనికీ నా పనికీ తేడాలేదు. రెంటి కట్టం వొకటే. మన పెద్దోళ్ళ నడిచినట్టు మనం నడవాలట. పెద్ద కులపోళ్ళ సబలు చేత్తారు. బల్లలెక్కు-తారు. లేతలేత సొరకాయలు కోత్తారు. అందరూ వొకటే నంటారు. బల్లలు దిగుతారు. మళ్ళా మాపూలు నడకను పోతారు. అంతే. వుంది వుండట్టే వుంటుంది. జరిగేది జరుగుతుంది.

నా బోటోళ్ళ యెల్లి యిబ్బందులు సెప్పుకుంటే యిబ్బందులేంటి చచ్చి నట్టు చాకిరీ చెయ్యాల్సిందే నంటారు. ఆళ్ళ సబలు సట్టుబండలుకాను. మన కట్టం కాత్తయినా కనిపెట్రు. పోనీ, ఎంచేద్దాంమన రోజులు మంచియికావు. మనమీద పెత్తనం చెయ్యటానికి అందరూ పెద్దలే. అందరూ కత్తులూ కటార్లూ దూసేవాళ్ళే.

రంగన్న : ఆళ్ళను యీళ్ళను అనాల్సిన పనేవుంది ? మనోళ్ళలో నాలు గచ్చరాలొచ్చినోడుంటే ఆళ్ళ బడాయి కనొచ్చేది. అయి లేకపోవటం మన కిట్టా కట్టాలొచ్చాయి. మన కులాలెప్పుడో పైకొచ్చేది.

వీరన్న : నీ మాటలు బలేగున్నాయయ్యా ! మన బాధలు యియ్యాల పోతయ్యా రంగన్నా మంతిరిగోరు సెప్పిన పకారం యీ తురకోళ్ళ గుట్టు తెలుసుకోవాలి. ఆళ్ళతో గుడారాల దగ్గిర చనువుగా తిరిగి వాళ్ళనుకునే మాటల్ని మూటగట్టుకొని రమ్మన్నారు గదా ?

వీరన్న : అవును. నాతో అట్టనే సెలవిచ్చారు.

రంగన్న : గబగబ మాటాడకయ్యా ! ఎవుళ్ళన్నా యింటే కంటం మీద కొత్తుంది.

వీరన్న : సరే, నెమ్మదిగా సెప్పుకుందాం. జయిన్ల పెద్ద దండపావి నీ కంట బడ్డాడా.

రంగన్న : అగపడకేమి ! కుశీలుణ్ణి కొట్టోపెట్టిన్నాటినుంచి వీళ్ళుయేవేవో మాటాడు కుంటున్నారు. తురకోళ్ళు అనుకుంటుండగా యిన్నాను. మన పెబువుగోరు వూళ్ళోలేరనీ, అడవిలో వున్నారనీ అక్కడ పట్టు కోవాలనీ యేవేవో అనుకుంటున్నారు.

వీరన్న : ఓరి రంగన్నా. ఇయ్యన్నీ యెట్టిన్నావురా.

రంగన్న : ఆళ్ళ గుడారాల పక్కనే పొంచుండి యిన్నాను.

వీరన్న : నీకు బాగా తురకం వచ్చునంటావా ?

రంగన్న : నాకు బాగానేవొచ్చు. కాని బాసలో తిరిగి సెప్పలేను. సదు వొకటి లేదుగాని నా కన్నీ తెలుస్తవి. ఎవురైనా మాటాడుతుంటే నా కర్థమవుతుంది. మరి నువ్వో.

వీరన్న : నాకు తురకం బాగానే వొచ్చు. నీ కంటె మెఱుగని చెప్ప గల్ను. అందుకే మనల్ని కులపోళ్ళు మంతిరిగారి మాట పకారం యీ పనికి పెట్టారు పెబువుకు మనం సాయపడాలి. ఆళ్ళ ఉప్పు పులుసూ తిన్నందుకు.

రంగన్న : మనకు తురకం రాదని తురకదండు వుద్దేశం.

వీరన్న : అది మంచిదే. రహస్యెం కూడ మనకు తెలుత్తుంది. ఆ సంగ తుల్ని మనం జేరేయవొచ్చు.

రంగన్న : అవును. మనరాజు చల్లగవుంటే మనకు కావల్సినంత కూడు గుడ్డ దొరుకుతుంది. మనం పచ్చగా వుంటాం. తురకోళ్ళ పెబుత్తం మనకొద్దు.

వీరన్న : కూడు నీళ్ళు లేకుండా మారాజులు దేశాలు బట్టి తిరిగి కష్ట పడుతుంటే మనదేశానికి మాత్తరం సాయం చేలేమా :

రంగన్న : కాని పెద్దోళ్ళకీ తేగులేవిటి? జయనుల పెద్ద దండపాణి ఇంకా యెందరోవొచ్చి తురకోళ్ళతో గుసగుసలాడి పోతున్నారు. ఇది మత పిచ్చి. ఓరే వీరన్నా! మతాలవల్ల కులాలవల్ల యీ దేశానికి

యెంత నట్టం వత్తున్న దంటావు. ఈ రోగం వదిత్తేగాని మనదేశం బాగోదురా ?

వీరన్న : నువ్వు సెప్పింది సినలైన మాటరా ?

రంగన్న : తైమూరు సాయిబుగారికి మొన్న సవరం చేసినాడు అక్కడ్నే వున్నాను. దండపాణి ఇంకా జయిస్లువొచ్చి యింకా కొన్ని గుట్లు మాటాడుకున్నారు. నాకు తురకం తెలీదనుకున్నారు. దండపాణిని నిలువునా తెగేసినా పాపంలేదు.

వీరన్న : సరేలే. వాళ్ళపని దగ్గరపడింది. ఏమిటాగుట్లు.

రంగన్న : మన పెబువు అడవిలో వున్నారనీ, కొంత మూక నక్కడికి పంపి రాజును చెఱబట్టాలని, కొంతమూకతో వోరుగల్లుకోట పట్టాలని యెత్తేశారు. మనం యీ సంగతుల్ని తచ్చన కులవోళ్ళతో సెప్పి మంతిరిగారికి జారేయించాలి.

ఈ విధముగ వారుభయులు మాటాడుకొనుచు తమ పల్లెకు చేరిరి.

# 21

తూరుపు యెల్లలు దోలపమయమున తైమూరు వన ముఖముగ దండు వెడలుట కాజ్ఞ యిచ్చెను. కొలది సమయములోనే వారెల్ల తగు సన్నాహము గావించిరి. ప్రయాణోచితమైన యుడుపులతో, సాయుధులై నిలచిరి. త్రిశూల పాణియు, కాషాయాలంకర ధారియునైన యున్నత పురుషుడొకడు దండున కగ్రపీఠి నుండెను. అతని మెడయందు బంగరు

లింగకాయగలదు. అతడు ఎడమ చేతి దండ యందు బసవలింగేశ్వర విగ్రహము గల పట్టు రుమాలు చుట్టుకొని యుండెను. భస్మరేఖలు, రుద్రాక్షమాలలు నాతనికొక వింతకాంతి నిచ్చెను. ఆ దేవర పర్మానా మహమ్మదీయ సేనకు తిరుగులేని యాజ్ఞగ చెలామణి యగుచుండెను. ఇతని వెనుక తైమూరు నాయకత్వమున నాశ్వికదళము, నావెనుక సాయుధులైన వీరభటులు నడచుచుండిరి తైమూరుకు సాయముగ వచ్చిన సేనాపతి ఖాన్ అనువాడు కాల్బలమునకు నాయకత్వము వహించి యుండెను.

ఇట్లా సేన జాము ప్రొద్దుండగనే యీ సేన పెక్కుకొండ మలుపులు చుట్టి దుర్గ మారణ్య ప్రాంతముల నధిగమించి సేలయేళ్ళ నుత్తరించి కడకొక తమాల వృక్షాక్రాంతమైన వనభూమిని జేరిరి. జన సంచారము లేని యా ప్రాంతమును సైనికులు కొందఱు నలువైపుల పరిశీలించిరి. కొంతదూరమున పశువుల కాపరులైన బాలురు క్రీడాపరాయణులై యుండిరి. ఆ దేవర కొందఱు సైనికులను పంపి యా బాలురను తన యొద్దకు పిలిపించుకొని యిట్లనెను.

"కుఱ్ఱలారా ! మీ రెవ్వరు ? ఇచట మీ పనియేమి ? మీదేప్రాంతము ?" అని ప్రశ్నలు కురిపించెను.

ఆ కుఱ్ఱలు మొదట కొంత భయపడిరి దేవర యను నయమున ధైర్యము నొంది యిట్లనిరి.

"అయ్యా ! మేము గోపాలురము. మాది యీ సమీపమున మన్న పల్లె. మాకీ ప్రదేశ మంతయు తెలిసినదే. ఈ చిట్టడవి పట్టున మేము పశువులను మేపుకొందుము."

దేవర : ఈ ప్రదేశమున వేటకొరక రాజువచ్చి యుండవలెను. మీకా సమాచారము తెలియునా ?

కుఱ్ఱలు : ఎవరో ప్రభువీ ప్రాంతమున వేట నిమిత్తము వచ్చి కొంత కాలము విడిదిచేసిరి. వారు గొప్ప మహారాజులు కావచ్చును. వారికి గొప్ప వేటబృందముకూడ నున్నది.

దేవర : అయిన వారు విడిదిచేసిన తావు చూపగలరా ?

కుఱ్ఱలు : అచింతతోపావల కొండ మలుపున నెరబాదాటిన మీకు పులులు, లేళ్ళున్న యడవి కన్పించును. మీకు తెల్లని గుడారములు కూడ కన్పించును.

దేవర ; ఆ రాజుగారిక నచటనే యున్నారా ? తమ నగరము చేరినారా?

కుఱ్ఱలు : లేదయ్యా ! ఆ మహారాజింకను వేట సంబరములోనే ఉన్నారు.

ఆ దేవర వారి మాటలకు సంతృప్తుడై వారికి కొన్ని రూకలిచ్చి పంపివేసెను.

ఇది విన్న బడబడాఖాన్ బాలకుల మాటలు నమ్మి నృపతి తన చేజిక్కినట్లూహించి పిల్లల మాటల యదార్థ్యము నెఱుంగదలచి యిర్వుర భటుల నా ప్రాంతమునకు పంపెను. వారా చోటికరిగి సంగతి గ్రహించి తిరిగి వచ్చి ఖాన్‌తో నిట్లనిరి.

భటుడు : సర్దార్ ! ప్రతాపరుద్ర మహారాజుగారున్నారు.

ఖాన్ : ఎచటనున్నారురా ?

భటుడు : వారివిడిదియందు.

ఖాన్ : ఆట పిల్లలు చెప్పిన చోటనేనా ?

భటుడు : చిత్తము.

ఖాన్ : ఆయన యేమి చేయుచుండిరి.

భటుడు : ఆ డేరాయందొక మరమంచమున్నది దానిపై పట్టు పరుపున్నది. దానిపై వారు పరుండియున్నారు.

ఖాన్ : నిద్రపోవుచున్నారా ?

భటుడు : చిత్తము.

ఖాన్ : ఇంక విశేషములేమి ?

భటుడు : ఆయన పరున్న మంచమున కిరుప్రక్కల నిరువురు సేవకులు నెమలి కుంచె వీనల విసరుచుండిరి. ఇర్వురు పాదము లొత్తుచుండిరి.

ఖాన్ : సిబ్బంది లేదా ?

భటులు : లేదు. ఇర్వది వేటగుఱ్ఱములు మాత్రము చెట్లకు కట్టబడియున్నవి. పది జాగిలములు గలవు. వేటబంట్లు సుమారు ఇన్నూరు పైగ గలరు. కొందఱు పాచకులు వంటపాకలందున్నారు.

ఖాన్ : ఒరేయ్. మీరు తిన్నగ రాజును చూచితిరా ; చూచినచో వాని యాకారమెట్టిది వాని వేషమెట్లున్నదో చెప్పగలరా ?

భటులు : అయ్యా ఆయన దేహము బంగరుఛాయ. ముఖము విశాలము—బారడేసి కన్నులు—రొమ్ము విదివియైనది. ఆయన తొడిగిన యంగము తెల్లగ మల్లెపూవువలె నున్నది. చెవులకున్న పోగులు చుక్కలవలె తళతళలాడుచున్నవి. వాటి కాంతులు కడుపసందైనవి. ఆతని రూపము ఆకర్షణీయమైనది.

ఖాన్ : తరువాత.

భటులు : వచ్చినవారు కూర్చొనుట కొరకు పెక్కాసనములు కలవు.

ఖాన్ : ఒరేయ్. మీకింత స్పష్టముగ పరిశీలించుట కవకాశ మెట్లు కలిగినది ?

భటులు : సర్కార్ : మేము మీ యొద్ద సెలవుపొంది పేద బ్రాహ్మణుల మైతిమి. కొల్లాయి గుడ్డలు మేము తయారు. శివాలయము కట్టించు నిమిత్తము సాయము వేడవచ్చిన వారివలె మేము దేరాను సమీపించి తిమి. పహరా సేవకులు మమ్ము దూరముననే నిలిపిరి. మేము బ్రతి మాలి రాజున్న దేరా ప్రక్కను కూర్చుంటిమి. మమ్మితరు లనుమా నింపకుండునట్లు లోకాభిరామాయణము పారాయణము చేయుచు కొంత సేపటనే యుండి సందుసందున దేరాతెరసందుగ రాజును సందర్శించి వచ్చితిమి.

అంతట ఖాను, తైమూరు, దేవరయు పరిస్థితిని గ్రహించి ముట్టడికిది తగిన సమయమని సంతసించిరి. సులభముగ రాజు నిచటనే బంధించి విజయము సాధింపగలనని తైమూరు మురిసిపోయెను

పిమ్మట బడబడాఖాను భటులకు బహుమతులొసగి సత్కరించెను. వారు మహోల్లాసమునచెలరేగి పొదరింటనున్న సింగపుకొదమను పట్టుటకు చుట్టు క్రమ్మివచ్చెడి మృగములవలె గుడారము ముట్టడించిరి. అంత నాదేరా దగ్గర చెట్లక్రింద పవ్వళించి యున్న వేటకాంద్రు లేచి యాయుధములు ధరించి రివ్వున వారిని మార్కొనిరి. వారికి యవనవీరులకు ముహూర్త కాలమున తీవ్రముగ పోరాటము జరిగెను. రణరంగమున ముక్కాకలు తీరిన వీరభట సహస్రములకు మృగయావినోద పథాయణులైన వేట

కొంద్రకు కయ్యమా ? గెల్పొందిన యవన భటులకు జయపత్ర మిచ్చుట చూపరులకు న్యాయమా ? ఏటిమాట ?

ఆ క్రుమ్ములాటలో తురకలచేయి మీదయినిది. అత్యల్ప సంఖ్యా కులైన మృగములేమి చేయగలరు. వేటకురమ్మనిన వచ్చేదరు. మహమ్మ దీయ సైనికులు జయావహులై యుత్సహించుచు కంటబడిన కావలివాండ్ర నెల్ల సంహరించి తటాలున గుడారము నలుచెఱగుల చించి యొక్కు మొగి లోన ప్రవేశించిరి. అక్లేగిన సైనికులు కంటపడినంత నాకృత్రిమ భూపతి ప్రాణములు తల్లడిల్లెను. అతనికి రుద్రుని పోలికలు కలవుగాని పరాక్ర మాది గుణములులేవు.

పతాపరుద్ర భూపాలుని యుపదేశ శిక్షణాదుల ప్రాబల్యమో, రాజో చిత వేష ప్రభావమోగాని క్షణములో నాతని విక్రమశక్తి యావేశించెను. జడుపు తొలగెను. ధైర్యము వహించి ఖడ్గపాణియై హుంకరింపుచు శక్తి వంచనలేక యుద్ధమొనరింప జొచ్చెను. అట్లు సాహసమున విజృంభించిన కృత్రిమ భూపాలునిపై లంఘించుటకు శాత్రవులకు ధైర్యము చాలలేదు రూపసాదృశ్యమంతగ గుణసామ్యము వింద కుదురుకొనకున్నను నట్టి యెడ శాత్రవులకు కృత్రిమ రాజు విక్రమాటోపమున రుద్రభ్రాంతి కలిగినది.

ఆతని సన్నాహము యవనవీరులను చకితులనుగావించి చీకాకుపర చెను. కొలదిసమయమునకే ఖాను ప్రోత్సాహమున నాతనిని నిరాయుధుని గావించి బంధించిరి. నా గురంజిక్కిన పిట్టవలె నా యశిక భూపతి యవ నుల వశమై దిట్టతనము కోల్పోయి చింతానిమగ్నుడయ్యెను.

తైమూరు రుద్రభూపతి బంధితుడయ్యెనని నమ్మి త్రిలింగదేశము తనకు స్వాధీనమైనట్లే యూహించెను. దేవరతోను ఖానుతోను సంప్రదించి

తదాఖాసనృపతిని పటకుటీరమునందలి వస్తుసముదాయమును గ్రహించి, హతశేషులైన మృగయులను ఖైదీలనుగ గొని జయపతాక మెత్తించెను. ఇందింత ప్రముఖపాత్ర వహించి తురుష్కులకు తోడ్పడిన యీ దేవర యెవరోకాదు. జైన నాయకుడైన దండపాణియే. ఓరుగంటి ముట్టడిలో నిమగ్నులైన తనను మున్నగుసేనానులకు విజయవార్తనంపెను. త్రైమూరు సేననంతటి నోరుగంటి మార్గము పట్టించి కొలది వీరభటులతో బంధితు నశ్వారోహితుని జేసి ఢిల్లీకి రహస్యమార్గమున పంపెను.

# 21

చారుమతి ఢిల్లీ గొనిపోబడిన నాటినుండి యుల్లూఖాను పరిస్థితిలో ప్రస్ఫుటమైన మార్పు గోచరించెను. దివారాత్రములు యుద్ధసన్నాహము లందో, రాచకయ వ్యూహములందో ప్రొద్దులు బుచ్చు నాతనికి చారుమతిని గూర్చిన యాలోచన ప్రధానమైనది. చారుమతికి ఫకీరు రక్షణభారము వహించి యామెను కంటికి రెప్పవలె కాపాడు చుండెను. హిందూధర్మా చార పద్ధతి నా తురుష్కరాజునకు వివరించుచు, చారుమతి ప్రసన్నురాలిని గావించుటకు కొంత నిగ్రహము వలయుననియు నా ఫకీరు ఉల్లూఖానునకు సమయోచితముగ బోధించుచు కొంత కాలము గడపెను.

కాని యిది యెంతకాలము సాగును ?

ఆమె రక్షణ భార మా తురుష్క సన్యాసికి తలకుమించిన విషయ మైనది. పరిస్థితి సుతిమించకమున్నే యామెకు భద్రత సమకూర్ప నెంచి నాతడు, బేహారితోను, ఢిల్లీవాసియైన మఱియొక నూతన వ్యక్తితోను రహస్య సంభాషణలు గావించి యొక నిర్ణయమునకు వచ్చెను. ప్రాప్త

కాలజ్ఞుల ప్రతిభ యిట్టిదే గదా ! ఆ నిర్ణయమెట్లు కార్యరూపము నొందెనో పాఠకులు గమనింపగలరు.

అది యొకనాటి సాయంసమయము. సూర్యకాంతి క్రమముగ సన్నగిల్లినది. సంజకెంజాయలు కూడ క్రమముగ నంతరించుచున్నవి. ఢిల్లీ నగర పరిసర ప్రదేశములందు జనసంచారము సన్నగిల్లెను. క్రమముగ లోకమున చీకటి రాజ్యము చేయవచ్చినట్లుంచెను. ఢిల్లీ దుర్గమునకు కుడివైపుగ నొక త్రోవగలదు. ఆ త్రోవ మలుపున మూడు త్తమాశ్వములు ప్రయాణమునకు సమాయుత్తమై యున్నవి. ఆశ్విక వీరులు ముప్వురు సాయుధులై ప్రయాణోచిత వేషములతో తగు సన్నాహములతో నచ్చటికి వచ్చిరి. అప్పటి కాప్రదేశ నిర్జనముగ నున్నదని చెప్పవగును ఆ ముప్వురును మూడు దారులుగవచ్చి యిచట కలిసిరి అందొక వీరుని ననుసరించి చారుమతి మేలి ముసుగులో నాతావునకు వచ్చెను. ఆ వీరుడు మన జనార్దనుడు. వీరిద్వురు నొక యశ్వమును, మిగిలిన యిర్వురు వేఱియొక యశ్వము నారోహించి ముందునకు సాగిరి. ఆ నిశ్శబ్ద నిశీథమున చీమచిటుక్కు మన్నట్లులేదు. గడ్డిపోచయు కదలుట లేదు, మానిసికి మానిసి కన్పింపని కారుచీకటి. ఆ ముప్వురిలో నూతన వ్యక్తిగాక మిగిలిన యిర్వురు బేహరి–ఫకీరును. వారుముప్వురు ప్రచ్ఛన్న వేషధారులే.

ఆ గుఱ్ఱములు రౌతుల మడమ గ్రుద్దులచే పిట్టలవలె మహావేగమున పోవుచున్నవి. ఆ వేగము పందెపు గుఱ్ఱములకైన నుండదు. అది అరేబియా జాతివి. వీని స్వభావము నశ్వవ్యాపారియైన మన జనార్దనునకు మిక్కిలి పరిచితము. ఆ రాత్రి వారు మిక్కిలి శ్రమకోర్చి చాలదూరము దక్షిణముఖముగ పయనించిరి. వారికినిద్రలేదు. కొండలు కోనలు లోయలు

వనములు నదులు మైదానములు గడచి తెల్లవారుసరికి వారికి తారసిల్లిన కమలాకరమును చేరిరి. దానికి చక్కని సోపానములు కలవు. కనుచూపు మేరలో నొక కుగ్రామము వారికి కన్పించినది. ఆ కొలనునొడ్డున చక్కని ఛాయావృక్షములున్నవి. వారచట విడిసి కాల్యములు నిర్వర్తించిరి. అనంతరము వారు వెంట తెచ్చికొన్న రొట్టెలను భుజించి తన్నిర్మలోదకమును సేవించి కొలది సమయమచట విశ్రమించిరి.

మరల ప్రయాణమై దక్షిణ మార్గమున శరవేగమున పోదొడంగిరి. అంత పోవంబోవ కూతర్రవేటుదూరమున నేవోగుఱ్ఱములువచ్చు చప్పుడు వినబడెను. అది విని ఫకీరు బేహారితో నిట్లనెను. 'జనార్దనా' ఈ నిర్జన ప్రదేశమున నేవో గిట్టల చప్పుడు వినబడుచున్నది. ఎవరైయుందురు. మనలను పసిగట్టి యడ్డగించుటకు వచ్చు తురుష్కులు కాదు గదా!'' యనెను.

బేహారి : అవును. దూరమున కొన్ని యశ్వములు కన్పించుచున్నవి. రౌతులు మహమ్మదీయులుగ కన్పించుచున్నారు

ఫకీరు : మనము జాగ్రత్త వహింపవలయును, పరిస్థితి గ్రహించి సమయోచితముగ ప్రవర్తింపవలెను సుమా!

బేహారి : నాకొక యనుమానము బాధించుచున్నది. మనకు ఢిల్లీనగరమున నాగయగన్న మంత్రిపంపగా చేరిన లేఖ యందలి యంశములకు నీ వచ్చు తురుష్కులకు సంబంధము కలదేమో యనిపించుచున్నది

ఫకీరు : నిజము రాజబంధనోద్యోగులైన తురుష్కులు వీరై యుండవచ్చును. కనుక ప్రసిద్ధమార్గమును విడిచి యీ రహస్యమార్గమున

మనవలె వచ్చుచున్నారు. ఇదియు మంచికే వచ్చినది. తైమూరు నా ఖడ్గమున కాహారము కాగలడు.

బేహారి : అతడీ పరివారము నందున్నట్లగపడుటలేదు.

ఫకీరు : కారణము

బేహారి : వీరినిట్ల ఢిల్లీమార్గము పట్టించి విజయమందితినన్న మహాగర్వమున కొంత సైన్యముతో నోరుగంటికి పోయియుండవచ్చును.

ఫకీరు : వారింకను ప్రభువేషదారిని ప్రభువనియే నమ్మియుందురా ?

బేహారి : కావచ్చును. లేకున్నచో వింతశ్రమపడి, యింత జాగ్రత్తతో యింత కట్టుదిట్టముగ నిటువచ్చుట తటస్థింపదుగదా !

ఫకీరు : రానిమ్ము మూర్ఖులు - తగినఫలము ననుభవింతురు.

అని యిట్లువారు సంభాషించుచుండ తురుష్క పరివారము వీరిని సమీపించెను. ఉభయపక్షముల కిట్లు సంభాషణజరిగెను.

ఫకీరు : ఎవరు మీరు ?

తురుష్కుడు : మేము సుల్తాను వారి యాశ్వికులము.

ఫకీరు : మీ వెనుక నున్న మహాపురుషుడెవ్వరు ?

తురుష్కుడు : ప్రతాపరుద్ర మహారాజులుంగారు.

ఫకీరు : (మందహాసమున) వారెట్లు మీకు చిక్కిరి ?

తురుష్కుడు : వీరరణ్యమున నుండగ ముట్టడించి యోడించి బంధించి తోడ్కొని వచ్చుచుంటిమి.

ఫకీరు : మీ నాయకుడెక్కడ ?

ఇంతలో తురుష్క వీరుడొకడు గుంపునుండి ముందునకు వచ్చి "మీ రెవరు. మా వ్యవహారముతో మీకేమి పని" అని బెదరించుచు తిరస్కార భావమున మాటాడెను. పకీరు కోపో ద్రిక్తుడై "ఆ బంధితుని మాకు స్వాధీనము చేయుడు. లేకున్న మీ ప్రాణములు దక్కవు" అని హెచ్చరించెను.

తురుష్క వీరుడు : ఏమేమి ? ప్రాణహానియా ? శత్రువిధ్వంసమున నారితేరిన మహమ్మదీయ ఖడ్గప్రహారము లెన్నడు చవిచూడలేదు కాబోలు అని హుంకరించెను.

పకీరు : (ఖడ్గముదూసి) బంధితుని విడుతురా లేదా.

తురుష్కవీరుడును ఖడ్గపాణియై ముందునకు దుమికెను. ఇట్లుభయులు ఘర్షణపడుచుండగ జనార్దనుడు తనచేతి ఖడ్గమును ఝుళిపించుచు యుద్ధసన్నద్ధుడయ్యెను. వీరి ననుసరించి వచ్చుచున్న నూత్నవ్యక్తి చారుమతి రక్షణభారమును వహించెను. కొలదిసేపటి కత్తుల తళతళలు రక్తపు మెఱుపులు నా ప్రదేశమున వ్యాపించెను.

యవనాశ్వికు లిర్వురు భూమిపై కొరగిరి. క్షతగాత్రులైన కొందరు తురుష్కభటులు కాలికి బుద్ధిచెప్పిరి. బంధితునకు వెనుకనున్న కొందరు వల్లే వీరిని సమీపింపగ లేళ్ళను జూచిన సింహములవలె బేహారి పకీరులు వారిపై దుమికి కొందఱిని పొడిచియు, కొందఱ వికలాంగుల గావించియు మిగిలిన తురుష్క పరివారమును చెల్లాచెదురు గావించియు లబ్ధవిజయులై కృత్రిమభూపతిని బంధవిముక్తుని గావించిరి. పకీరుడా విముక్తునకు స్వీయ

వృత్తాంతము నెఱిగించి సంతోషపరచెను. వారు విజయోత్సాహముతో చారుమతీ సహితులై యోరుగంటికి పయనమైపోయిరి.

# 22

ప్రతాపరుద్ర చక్రవర్తి సామంతరాజులతోను సేనాపతులతోను నొకసభ నేర్పాటు చేసెను. అందు నాగయగన్న మంత్రి యిందులూరి యన్నయ పంచపాండ్య విజేత యిందులూరి. రుద్రుడు గజబలాధ్యక్షుడైన బెండపూడి యన్నయ, నశ్వదళాధిపతియైన సాహిణీమారుడు ప్రతాపరుద్ర ప్రతినిధియైన ఎద్దదాచనాయుడు, కాయస్థసేనానులైన త్రిపురాంతకుడు అంబదేవుడు, గుండయమేచయ, రెడ్డిసైన్యాధి పతియైన భోజారెడ్డి మొదలైన వారును, ఆర్వేటిరాజైన నరపతిరాయలు, రాజసోదరుడైన యన్నమదేవుడు, సురపురపు సామంతుడు విజయరామరెడ్డి మొదలగువారీ సభలో పాల్గొనిరి. ప్రతివీరాగ్రేసరుని హృదయము క్రోధప్రపూర్ణమై దహించుచుండె సభయందు నిప్పుల వాన కురియుచున్నట్లుండెను ఆ సభయందింకను వీర భటాగ్రేసరులు, నుపసేనానులు కలరు. అందు సర్వసైన్యాధిపతి యిట్లు పన్యసించెను.

దేశాభిమానులారా ! ఆంధ్రమహావీరులారా ! కొదమసింగములకు విహారభూమియగు గుహాభ్యంతరసీమను క్షుద్రమృగము లాక్రమింప దలచినట్లు త్రిలింగసామ్రాజ్యమును మహమ్మదీయు లాక్రమింపగోరి ముందుకు వచ్చుచున్నారు ఈ పవిత్రభూమి సరిహద్దుదాటి యాంధ్ర రాజ్యమందడుగిడుటకు మ్లేచ్ఛులకెట్టి హక్కుగలదు ? గొఱ్ఱెకొవ్వెక్కి కాల్దువ్వుచు మహారథమును ఢీకొనినట్లు మ్లేచ్ఛులు పోతరించి యెడలెఱుగక మనపై దండు వెడల సాహసించినారు యవనులు ద్రోహచింతతో మనలను సమీ

పించి నక్కవినయములు ప్రదర్శించుటయు మీరెఱిగినదే. త్రిలింగవీరులు ప్రళయరుద్రులై వీరభద్రులై తమ శౌర్యాగ్నిని ప్రజ్వరిల్లజేయు సమయము వచ్చినది. కాకలుతీరిన పదిలక్షల వీరశేఖరులు విజృంభించి యవన సేనాటవిని దహింపజేసి దేశ మాతృసేవాపరతంత్రతను ప్రదర్శింపగలరు. (సభలో వీరావేశముతో సందడి)

రణమన్న మహావేశముతో భూమిని రక్తముతో తడిపుచు ముందునకు సాగు వీరరసావతారులైన పదివేల మైలారుభటులను గాంచిన శాత్రవుల కొడలు జలతరింపకుండునా ? చతురంగ బలములను సమాయత్త పరచి మీరు యుద్ధసన్నద్ధులు కావలసి యున్నది. అని హెచ్చరించెను.

అనంతరము కటకమత్తేభ సింహమైన రెండవసేనాధిపతి యిందులూరి యన్నయ లేచి "యేమియీకాలవైపరీత్యము ! మనమిట్లు యవనుల విషయమున నుపేక్షించిన కొలది నీ సామ్రాజ్యమునకు ముప్పువాటిల్లక మానదు. ఆంధ్రవీరులు దేవగిరి యాదవులనుగా తలంచిరిగాబోలు. తురక గుంపులెన్ని దిగిన దిగనిమ్ము. పిట్టలగుంపును తరుముటకొక దేగచాలదా? ఒక తురక పటాలమునకొక యాంధ్ర వీరుడు చాలడా ? అట్లు చాలని వాడాంధ్రసేనలో లేడు. రిపువర్గ మనర్గళ ప్రభావమున బైకొనుతరి తన దేశరక్షణమరచి యల్లాడు సోమరి మందునకైన నాంధ్రసేనలో లేడు. గజపతులను పరాభూతులను గావించిన యాంధ్రవీర విక్రమస్ఫూర్తి జగద్విదితము. మరల యాంధ్రవీరశౌర్య ప్రదర్శనావకాశము సిద్ధించినది. వీరులందరు కాచకట్టి, కత్తిపట్టి రణరంగమున దుముకవలెను అనిహుంకరించెను.

తృతీయుడైన యిందులూరి రుద్రుడు ముందునకు వచ్చెను. ఇతడే నాటికాలమ్మున పరిసరరాజ్యములందు కూడ ప్రసిద్ధుడైన ఖడ్గవిద్యానిపుణుడు

కొలని ప్రతాపరుద్రదనువాడు ఇతనిని జూచి వీరపటాలము హర్షావేశము నొందినది. అతాడాజాను బాహువు. ముఖమున శౌర్యరేఖలు యిట్టెగోచ రించును. నడుమున బిగించిన కృపాణము కంపింప ఇతడు ముందునకు వచ్చి యిట్లనెను.

"అన్నయ సేనాని వచనములు ప్రత్యక్షర సత్యములు. ఆంధ్ర వీరులు తమ పూర్వుల శౌర్యపరాక్రమ ప్రతిష్ఠలను స్మృతికి తెచ్చు కొనుడు. వీరగంధము పంచిపెట్టుడు. ఖడ్గవిద్యలో నిపుణులైన నా శిష్యులు, వెలమ, కమ్మ, రెడ్డి, కాపు వీరులలో నసంఖ్యాకముగనున్నారు. మీ వీర ఖడ్గచాలనమున రిపు శిరస్సులను దునుమాడి నాకు గురుదక్షిణ యిండు. మీ విద్యానైపుణ్యమును ప్రదర్శింపుడు గ్రుడ్డెద్దు చేనిలోపడినట్లు మన దేశమునకువచ్చి విఱ్ఱవీగు తురక బండ్ల తునాతునకలుచేసి తైమూరు కాంక్ష స్వప్నతుల్యమొనర్పుడు.

నాల్గవ సేనానియైన బెండపూడి యన్నయ ఓ వీరాగ్రేసురులారా ! పొగరెక్కిన మానిసి పులిమీసల నూగులాడదలచినట్లు మధుపానమత్తులై తారతమ్యమెఱుగక త్రుళ్ళుచున్న యవనులకిపుడు తగిన శాస్తిజేయకున్న హిందూవీరులిక మీద పౌరుషవిహీనులై వారివారి బిరుదముల వర్జింప వలసి యుండును. అభియాతులు నిర్భయులై స్వేచ్ఛగ నాంధ్రదేశము ప్రవేశించి నివాస మేర్పరచుకొని మొగ్గరము లొగ్గుచుండుట గని యూర కుండదగునా ? ఇంతకంటే ననదతనము-చాలవు-న్యూనత వేఱొకటి లేదు ఆంధ్రవీరశేఖరులారా? మీపూర్వులైన శాతవాహన పల్లవ చాళుక్య వీరుల రణవిహారమును, వీరధర్మమును జ్ఞప్తికి తెచ్చుకొనుడు. త్రిలింగ గజవాహిని కటకమునుండి కావేరి వరకు శత్రు విధ్వంసమున ప్రసిద్ధి గన్నది. మరల నేడు విజృంభించి యవనులను కాలబట్టి నేలరాయు సమ

యమువచ్చినది. అశాశ్వతమైన భౌతికకాయముకంటె శాశ్వతమైన కీర్తి కాయము శ్రేష్ఠతరము" అని ప్రసంగించెను.

అయిదవ సేనాని సాహిణిమారుడు "యుద్ధమున తురుష్కుల నెదుర్కొని నిల్చుటకు తగిన యాశ్వికసంపత్తి మనకుగలదు. హయహేషా రవములు మిన్నుముట్టి తురుష్కాశ్వధాటి నెదిరింపగలదు. పరభూముల నుండి వచ్చిన యాశ్వసంపదచే మనబలము విస్తారముగ పెరిగినది" యనెను.

ఇట్లు సేనాపతులు సైన్యసంపదను గూర్చియు యుద్ధసన్నాహము లను గూర్చియు చర్చించు చుండ భటుడొకడు వేగముగా వచ్చి నాగయ గన్న మంత్రితో 'అయ్యా! యెవ్వరో మువ్వురు దూర ప్రాంతము నుండి తమదర్శనమునకై వచ్చియున్నారని విన్నవించెను. మంత్రి యనుమతించ వారిలో నిర్వురు లోనికి వచ్చిరి. వారిర్వురను లోని కడుగిడుచునే ప్రభువు నకు వందన మాచరించిరి. వారిని గుర్తించి మహానందముతో గన్నయ్య స్వాగతము పలికి యుచితాసనము లనుపవిష్టులను గావించెను. వారిని సభ్యులు గుర్తించి యుండరని యాతడిట్లనెను. 'వ్యాపార వేషమున నున్న వీరు రాజ్యతంత్ర నిపుణుడు నా మిత్రుడు జనార్ధనుడు. సమరరంగమున సాధ్యముగాని శత్రువ్యూహములను భేదించు బుద్ధిశాలి. తురుష్క మౌల్వీవలె కన్పించు నీరెండవ వ్యక్తిమనకు సుపరిచితుడైన మహావీరుడు ముసునూరి కాపయనాయకుడు వీరిప్రజ్ఞాబలముచే యవనుల ద్రోహచింతను గ్రహించి రాజ్యమును రక్షించు కొనగలిగితిమి. యనపుడు మంత్రి దండనాధ ప్రముఖులు ప్రశంసా పూర్వక కరతాళ ధ్వనులు చేసిరి. ప్రతాప రుద్రభూపతి ముఖమునందు ప్రశంసా భావము పొడగట్టెను.

అంతజనార్ధను డిట్లనెను. "మహామంత్రీ! మాతోపాటు నొక యువతి బహుకష్టముల కోర్చి యోరుగంటికి వచ్చియున్నది. ఆమె విషయము కొంతకాలముక్రిందట చారులవలన వినియుందురు. ఆమె ప్రభువు వారిని దైవముగ నారాధించు సుగుణశీల దురదృష్టవశమున మాయోపాయమున యవనులకు చిక్కి బహుక్లేశములకు గురియైన యభిమానవతి. ఆమెకు ఢిల్లీ నగరమున రక్షణ కల్పించుచు కొన్నాళ్ళల్లో కాలము గడపితిమి. ఆమెకు విపత్కర పరిస్థితి సంఘటిల్లనున్నదని మేమిట్లు పయనమై రహస్యమార్గమున నేటి యుదయమ ననే యోరుగల్లు చేరితిమి. ఆ యువతి మన మేధావి పుత్రిక చారుమతి. ఆమె నభ్యంతర మందిరమున ప్రవేశ పెట్టగోరెదను. అని ముగించుతరిన ప్రతాపుని కనులందానందోత్సాహములు దోబూచులాడినవి గతించినవేటదృశ్యము వనప్రదేశమున ప్రశాంతముగనున్న పర్ణశాలాదృశ్యము జ్ఞప్తికి వచ్చినవి. ఆమె యంతఃపురము ప్రవేశింప ననుమతి యొసంగెను

సభలోనుండి యీ మాటలు వినుచున్న మేధావి సంతోషమునకు హద్దులేదు. తన యేకైక పుత్రికనిట్లు తీసికొనిరాగల్గిన మిత్రుల నానంద బాష్పపూరిత నేత్రములతో గాంచెను.

ఇట్లు ఆనందోత్సాహములతో నాటి రాజసభ ముగిసినది. స్వీయ పరివారముతో రుద్రుడు రాజప్రాసాదమున కేగెను.

ప్రముఖనాయకులు తమతమ మందిరములకు బయలుదేరిరి. మేధావి మహానందమున, అప్పటి వరకు ఫకీరుగ శత్రుమధ్యమున ప్రదర్శించి కార్యసాధకుడైన మహాపురుషుని ముసునూరి కాపయనాయకుని భక్తివినయములతో దర్శించి కృతజ్ఞత సూచకమైన వందనము లర్పించెను. వారి ప్రజ్ఞాసాహసము లను మిక్కిలిగ ప్రశంసించెను. ఈ కాకతీయసామ్రాజ్య

రక్షణకు పెట్టిన కోటయని బహువిధముల కాపయనాయకుని మేధావి యభి నందించెను.

తన నెచ్చెలియైన జనార్ధనుని చాకచక్యమును గూర్చి మేధావి కొండాడుచుండ నాతనిని వారించి జనార్ధనుడిట్లనెను. 'ఇందు నేను నిమిత్త మాత్రుడను. ప్రజ్ఞావంతులైన కాపయనాయకుల వారి సన్నిధిని మెలగి యింత ఖ్యాతిని పొందగల్గితిని. నీ పుత్రికా విముక్తికి కారణములు వారి శౌర్యసాహసములు—సమయోచిత, ప్రజ్ఞావిశేషములు—రాజనీతి చాతు ర్యమును. ఇట్లు మేధావి—జనార్ధనుడు శ్రీ కాపయనాయకుని యొద్ద సెలవు గైకొని అచటనుండి నిష్క్రమించిరి. కాపయనాయకుడు ముఖ్య రాజకీయ రహస్యమును ప్రభువుతోను, నాగయగన్న మంత్రితోను చర్చిం చుటకు రాజప్రాసాదమున కేగెను.

ఇట్లు సైనికసమావేశము మహాసంరంభసమాకులమై సమరావేశో త్సాహములతో నుప్పొంగెను. అంత నాగయగన్న మంత్రి యాసనము నుండి లేచి, మీ వంటి వీరసింగము లున్నంత వరకు నాంధ్రసామ్రాజ్య మున కెట్టి విపత్తును కలుగనేరదు. మీ నిశ్చయము—దేశభక్తి—ప్రభుభక్తి- ధర్మానురక్తి మిక్కిలి శ్లాఘ్యములు. ప్రతాపరుద్ర మహారాజు లేడని విశ్వసించి శాత్రవులు మన దేశము ప్రవేశించిరి. వారు దీనిని ప్రథమ విజయముగ భావించుచున్నారు. వారి వ్యూహములు కూడ విచిత్రముగ నున్నవి.

వైరులు ప్రబల సైన్యముతో నరణ్యమునకేగి రాజును ముట్టడిం చుట. ప్రభువు నగరప్రవేశముచేయుట వారికి తెలియదు గాబోలు. తెలిసి నచో నిట్టి యనుచిత కార్యమునకు యత్నింపరు.

తురుష్కులు సమావేశమై పన్నిన పన్నాగమిది. దీనివలన చక్రవర్తి వారికి వశమగుననియు, త్రిలింగ రాజ్యము తమ హస్తగతమగుననియు వారి నమ్మకము.

మఱియు తగీన్ ఓరుగల్లు ముట్టడికి సిద్ధముగ నుండెనట. ఆతనికి గుఱ్ఱపుదళము సాయమైవచ్చునట. ఆతనికి మన ప్రాకారనిర్మాణశక్తి తెలియదు. మన శతఘ్నిపంక్తుల భయంకరాగ్ని పిండముల తాకిడికి ఆగడు. ఎఱిగియున్న తాను తొలి కబళముగ రాడు ఆంధ్రవీర కంఠీరవముల కంఠముల నూపిరి యున్నంతవరకు మనసామ్రాజ్యమున కెట్టి భయమును లేదు. మరల సభలో కలకలము పుట్టెను.

అంత నాగయగన్న మంత్రి ప్రతాపరుద్రభూపతి యొసగు సందేశమును వినవలసినదని సభ్యులకు తెల్పెను. వెంటనే సభయంతయు నిశ్శబ్దమును వహించెను. ఉన్నత పీఠినుండి ప్రభువు లేచి "ఆంధ్రవీరాగ్రేసరులారా ! మీ శౌర్యమనివార్యము దేశ పరిపాలనమంతయు మీ విక్రమ విహారముపై నాధారపడియున్నది. మీకు మాయందు మా పరిపాలనయందు కలిగియున్న విశ్వాసాభిమానముల కానందించుచుంటిమి. మీరు కుల మత వర్గభేదములను, ప్రాంతీయ ద్వేషములను పాటింపక యైకమత్యముతో దేశరక్షణ గావింపవలెను. మిమ్మందర నొకపరి సందర్శించు భాగ్యము లభింపజేయుటచే మహమ్మదీయులు మన్ననార్హులని భావింతుము. మీబోటి విక్రమ సింహాల శౌర్యసంపద యున్నంతకాలము తురకలేకాదు, యావద్భారతము దండెత్తివచ్చినను లక్ష్యపెట్టబనిలేదు. త్రిలింగ రాజ్యలక్ష్మి పరులచే నపహరింపబడదు. మీరు యుద్ధభూమిన విలిచిన జయకన్య మిమ్ము వరించితీరును". అని పలుకుల నాలించి సభ్యులు కరతాళ ధ్వనులు చేసిరి

సభ ముగిసెను. అందున్న ఒక్కొక్క వీరుడు యుద్ధావకాశమున కెదురు చూచుచుండెను. వెలుగు వెనుక నీడయన్నట్లే ధర్మనిర్ణయము వెనుక ద్రోహచింత కొందఱిలో లేకపోలేదు. అదియు సమయము వచ్చి నపుడు వ్యక్తము కాగలదు.

# 23

ఆ మూడవనాడు దిక్కులదరునట్లు, పదినూర్ల శతఘ్నులు ప్రేలిన ట్లోరిగంటి యందు పెద్ద ధ్వని పుట్టెను. హేతువేమి ? సముద్ర గర్జించుచు పొంగుచుండెనా ? కాదు. అది యాంధ్రుల రణభేరి. ఆ ధ్వనికి పరిసర పర్వతగుహలు మారుమ్రోగుచున్నవి. ప్రతిపౌరుని కర్ణకుహరములు గింగురు మనుచున్నవి. బ్రహ్మాండ కటాహము ఢమ్మని పగిలినంత భయంకర ధ్వని పుట్టినది.

ఆ నగరమున కోటబురుజులపై, రాజసౌధములపై, సింహద్వార ములపై యుద్ధప్రకటన చిహ్నములైన వరాహలాంఛనధ్వజములు రెపరెప లాడినవి. రణభేరి మ్రోగిన కొన్ని నిముసములలో నాంధ్ర భటశ్రేణి రణోత్సాహమినుమడింప, సానలుదీరిన ఖడ్గముల ధరించి యొక్కపెట్టున యుద్ధభూమికి నడువదొడంగెను.

ఓరుగంటి ప్రజ ఆబాలగోపాలము సర్వవర్గములు మహోద్రేక స్థితియందుండెను. ఎక్కడ వినవచ్చినను యుద్ధప్రసంగములే. స్త్రీల సమా వేశములందు యుద్ధప్రస్తావనలే బాలురక్రీడలందును యుద్ధాలాపములే. దేవాలయ ముఖమంటపములందు పురాణ ప్రవచనమునకు కొలువుదీర్చిన శాస్త్రి నోటినుండియు సందర్భానుకూలములైన యుద్ధకథాగానములే. నగ

రము వెలుపలకు సైన్యములు దళాధిపతుల నాయకత్వమున చేరిపోవు చున్నవి. భర్తృపాల దేశ తిలక రచనావ్యగ్రమూర్తులైన వీరవనితలు — వీరనాయకులకు హారతినిచ్చి యాశీర్వాదించు సోదరీమణులు పాదాభివందన మొనర్చిన యేకైక పుత్రుని శిరము నిమిరి, ముద్దాడి ఖడ్గమునందిచ్చిన వీరమాతలు, ఏమాకలకలము. ఏమా మహాంధ్ర శౌర్యరమాహేల ! పల నాడట యవతరించినట్లున్నది. పురసౌధములనుండి అసూర్యంపశ్యలైన యాంధ్రనారీమణులు సమర కల్యాణమునకేగు వీరకిశోరములపై పులా జలు పుష్పాక్షతలు కురిసిరి.

ఇట్లు సర్వసైన్యాధిపతియైన భేతాళనాయకుడు, పంచపాండ్యవిజేత యైన యిందులూరి రుద్రుడు, గజబలాధ్యక్షుడైన బెండపూడి యన్నయ, అశ్వదళాధిపతియైన సాహిణిమారుడు, సభట దళాధిపతి యిందులూరి అన్నయ వరుసలందు తమతమ సేనలను నడిపించుచుండిరి. వారు తమ తమ పరిథవములతో బిరుదులతో సింహధ్వానములు గావించుచు సైన్యము లను కదలించిరి. ఆ భేరీభాంకృతులు — తత్పతాక పంక్తులు, భటోత్సా హము నా సేనానుల యుద్రేకము కనిన మూలనున్న ముసలమ్మ యేని కత్తి పట్టి కదనమున కురుకకమానదు.

అహా ! యేమి యా రణ యాత్రామహోత్సవము ! వైవాహిక మహోత్సవమేని యిట్లుండునా ? శరనిధి బొబ్బరిల్లి పొంగి తరంగబాహా వుల పృధివిని కౌగిలించుకొన్నట్లుండెను

# 24

ఓరుగంటి ముట్టడిని తలపెట్టి యుద్రేకపూరితులై తురుష్క సైన్యము మహావేశమున యుద్ధసన్నద్ధమై యున్నది. ఇంతలో నకిలీ

రాజును బంధించిన తురుష్కపటాలము మహానందమున ప్రధాన సైన్య ముతో కలిసెను. ఒక ప్రధాన వాహినిలో మధ్యేమార్గమున నొక యుప నది కలిసినట్లయ్యెను. తురుష్క సేనానులు తమకు విజయము నిశ్చయ మని మహోల్లాస పడుచుండ సైన్యమింకను ముందునకు సాగెను. కట కమునుండి తురుష్కులకు సాయముగ పూర్వపు టొడంబడిక ననుసరించి పదివేల సైన్యముతో అశ్వికులతో కొంత గజబలముతోవచ్చి మౌద్గల్యము నొద్ద కలిసెను. కాకతీయ ప్రభువునకు విరోధి పక్షమువాడైన దేవగిరి రాజు పంపగ వచ్చిన కొంత సైన్యముగూడ తురుష్క సైన్యమునకు సాయమై వచ్చెను. ఇట్లు మహమ్మదీయ సేనావాహిని సమధిక బలసమ న్వితమై విజిగీషతో ముందునకు సాగుచు గోల్కొండ సమీపమునకు వచ్చి తమ కెదురగు కాకతీయ సైన్యమును మోహరింప సంసిద్ధ మయ్యెను.

కాకతీయ సైన్యములో కొంతభాగము నాగయగన్న మంత్రి నాయ కత్వమున నగరరక్షణకు నియుక్త మయ్యెను. మేధావి నాయకత్వమున సుశిక్షితులై రణమున ప్రాణమొడ్డు స్వామిభక్తి పరాయణులైన ఆటవి కులు ఖడ్గచాలనమున, విలువిద్యయందు నారితేరి యుండిరి. నాగయగన్న మంత్రి యాజ్ఞను షురస్కరించుకొని యీసైన్యములు సమయమునకు సర్వసన్నాహములతో తురుష్కుల నెదిరించు కాకతీయ సైన్యముతో గోల్కొండ కీవలనే కలిసినవి. ఇంకను కంభము—కంచి—రాజమహేంద్ర వరము—కేరళప్రాంతములందలి దండులు వేర్వేరుగవచ్చి, కాకతీయ సేనావాహినిని పుష్పకుంతము, సముత్సాహతరంగితము గావించినవి. ఇట్లు భయసైన్యములు గోల్కొండవద్ద తారసిల్లినవి.

ఆ యుభయసైన్యములు హుంకరింపుచు నొకరిపై నొకరు కవిసిరి. భయంకర యుద్ధము జరిగెను. వారి ఖడ్గములు రక్తస్నానము చేయు చున్నవి. వారి యుడుపులు ఘర్మవారిచే తడియుచున్నవి. ఆ సమరమున కొన్ని తలలు తాటిపండ్లవలె ధం, ధమ్మని పుడమిబడుచుండెను. కొన్ని ఖడ్గములు పరస్పర సంఘర్షణచే నగ్ని ఖండముల గురియుచుండెను. కొన్ని పీన్గులు పదాతుల కాళ్ళ క్రింద నలుగుచుండెను. కొన్ని కబంధము లటనిట దొరలుచుండెను. నేలరాలిన తలలు మిట్టిపడుచుండెను. ఆ కబంధ ములనుండి చిమ్మన గొట్టములంబోలె వేడిరక్తమున చుమ్మన జిమ్మబడు చుండెను. ఆ రక్తము కొన్నిచోట్ల ప్రహించుచు మడుగుల గట్టుచుండెను. కొన్ని యెడలనది కరడుగట్టుచుండెను.

కొనప్రాణముతో నున్న సైనికుల మూల్గులు, గంధసింధూరము లఘీంకృతులు, అజానీయముల హేషలు. రణవీరకరకీలిత ఖడ్గప్రహార సుజనిత ధ్వనులు, వీరసింహనాదములు నొక్కచో కలిసి దిక్కులదరునట్లు చేయుచుండెను.

ఆ నెత్తురుటేర్లు, ఆ మెదడు రొంపి, ఆ ప్రేవుల ప్రోవులు, మాంసపు గుట్టలుచూచిన నెట్టిధీరునకేని భయానక భూతమావేశింపక మానదు. మింట వలయాకృతిని పరిభ్రమించు మాంసభుక్కులైన కాక గ్రుధ్రాది పక్షి సమూహముల కోలాహలము క్రమముగ నతిశయించెను. ఇట్లిరు పక్షములు హోరాహోరి గావించు పోరాటము రెండు జాముల కాలము జరిగెను. యుద్ధభూమి కడుభీభత్సమయ్యెను.

అంతలో నేలకొండపల్లెనుండి నరసింహరాయని నాయకత్వమున వచ్చిన సైన్యము కాకతీయ సైన్యమున గలసెను. ఆ సైన్యము నిరుప మాన పరాక్రమమున తురుష్కుల నూచకోత కోయదొడగెను. వారి

పౌరుషము వర్ణనాతీతము. అటు చూడుడు ! పీన్గుల ద్రొక్కుచు యవనుల నెటు వెనుకకు తరుముచుండిరో. అబ్బ ! వాని ఖడ్గ సర్పములు దెప్ప కొక తురక బంటు ప్రాణవాయువుల గ్రోలుచుండెను. తురుష్క వీరులు మాత్రము సామాన్యులా, కారు వెనుకంజవేయక రిపు సంహార మొనర్చు చుండిరి. మహమ్మదీయు లొక క్షణము, నాంధ్రు లొక క్షణము పైచేయిగ పెనగుచుండిరి. పొట్టేళ్ళవలె పోరుచున్న నాయుభయ సైన్యములకు నల సట మెండయ్యెను. సైన్యాధ్యక్షులు హెచ్చరికలు, పౌరుషవాక్యములు వీరులనుత్సాహపరచుచుండెను.

ఆ సమయమెట్టిదో యాప్రతాపమెట్టిదోగాని గోల్కొండయందున్న చీమయేనియు నొక విరోధిని కుట్టక మానినదికాదు.

మహమ్మదీయులు మహాపరాక్రమవంతులు, బలశాలురగుటచే రెండు గడియల కాలము తులారణము జరిగెను. వారే దుర్బలులైనచో నాంధ్రుల తొలితాకుననే హతులైయుందురు. అదిగో ! ఢిల్లీనుండి క్రొత్త సైన్యములు వచ్చుచుండెను. ఏమి యా సైన్యముల యుత్సాహము. ఆ సేనా సముద్రమునకు చెలియలి కట్టలేదు. ఆ సైన్యమును చూచిన భేతాళ నాయకుని సింహధ్వనులు దిక్కులు పిక్కటిల్లగ స్వసైన్యమున కావేశము గల్గించుచుండెను. అతని పార్శ్వమున నిలిచి కయ్య మొనరించు వీరులే యాంధ్ర వీరులు. అప్పటి సమరరీతి తీవ్రస్థాయి నందుకొనెను. అందు భేతాళ నాయకుడు ప్రదర్శించిన రౌద్రరసము శత్రుభయంకరమై నది. ఈ విధముగ నిరువాగుల వారికి పోరు ఘోరమయ్యెను ఆంధ్ర వీరుల ఖడ్గవిద్య నైపుణ్యమునకు విలువిద్యా ప్రావీణ్యమునకు తట్టుకొన లేక తురుష్కులు ఫిరంగుల నుపయోగించిరి. కాకతీయులకు ఫిరంగి

దళము లేదు. కాని యాంధ్రుల ప్రతాపము ముందు యవనులు నిలువలేక పోయిరి. ఇట్లు ఘోర దినత్రయము మహాఘోరముగ జరిగెను. ఉభయ పక్షములందును సైన్యమపారముగ నష్టమొందెను. యవనులకు క్రొత్త సైన్యమెప్పటి కప్పుడే వచ్చుచున్నది. ఈ విషయము తెలిసి భేతాళ నాయకుడు నాగయగన్న మంత్రికి వేగునడిపి యుత్తరాదినుండి వచ్చు తురుష్క సైన్యములను మార్గమధ్యమున నెదిరించి యోడించుటకు తగిన యేర్పాట్లు గావించెను. మహమ్మదీయ వీరులకు ధైర్యోత్సాహములు సన్నగిల్లెను. ఢిల్లీనుండి సైన్యములు వచ్చు జాడయేలేదు. నాగయగన్న మంత్రి వారికి భోజనపదార్థము లందకుండ జేసెను. దినదినమునకు శత్రు సైన్యము క్షీణించుచున్నది. ఆంధ్ర సేనాలు విజృంభించి మహమ్మదీయ సైన్యమును సంకురింపజొచ్చెను. ఆంధ్రవీరుల ధాటికి నిలువలేక మహమ్మదీయులు పలాయనము ప్రారంభించిరి. వారిని వెన్నంటి దేవగిరివరకు తరిమిరి. కొంత సైన్యము పట్టువడెను. ప్రతాపరుద్రుడు విజయలక్ష్మీకరగ్రాహియయ్యెను.

# 25

ఓరుగల్లు నగరమంతయు విజయోత్సాహముతో నుబ్బితబ్బిబ్బగు చుండెను. ఎల్లెడల నలంకారములతో నా మహానగరము దర్శనీయముగ నున్నది స్త్రీలు పురుషులు పిన్నలు పెద్దలు నూతన వస్త్రధారులై వైవాహిక మహోత్సవమున పాల్గొను వడువున నగరవీధుల సంచరించుచు బంధుమిత్రులను కలసుకొనుచుండిరి. ఒండోరులను కౌగలించుకొను మిత్రులు, పెద్దల ఆశీర్వచనము నొందు వీరయువకులు, భగినీ మాతృమూర్తుల మెప్పుల స్వీకరించు దళవాయులునై నగర జనము పట్టరాని

సంతసమున మెలగుచుండెను. ఎచ్చట చూచినను, విన్నను యుద్ధ విజయ వృత్తాంతములే, పరపంథి నిర్మూలనచణ యుద్ధకళా ప్రశంసలే. మంగళ తూర్యనాదములు. నానావిధవాద్య విశేషఘోషలు మిన్నుముట్టుచుండెను. సేనాపతుల, రాజప్రముఖుల మందిర పరిభాగములందు ప్రభుత్వకార్యాలయ ములపైనను వరాహలాంఛన శోభితములైన కాకతీయ విజయపతాకలు ప్రకాశించినవి.

విజయోత్సాహ సూచకముగ నొక మహాసభ జరిగినది. ఆ సభకు వివిధ ప్రదేశముల నుండి సామంతరాజులు. సేనాపతులు, రాజప్రము ఖులు, పాళియగాండ్రు, ప్రభుత్వోద్యోగులు, ప్రముఖకవి పండితులు, శాస్త్ర వేత్తలు, వీరశైవాచార్యులు, శైవపీఠాధిపతులు, పురప్రముఖులు సభలో పాల్గొనిరి.

సభామందిరము రమణీయముగ నలంకరింపబడినది. మేలికట్లతో బహువర్ణకిర్మీరితములైన ద్వారగవాక్ష దేశ సంస్థగిత యవనికా జాల ముతో కనుల పండువు గావించుచుండెను. శిల్పాభిశోభితములైన కుడ్య ములు, స్తంభాలంకరణములు వైభవముగ నున్నది. ఆమందిరము నందం తట రత్న కంబళము కూర్పబడినది

వేదిక రత్న దీపికాసమాలంకృతము - పుష్ప రాగహాసరోచిస్సు ధలు వ్యక్తములగు చున్నవి. నానారత్న శోభితమైన కంబళి వేదికను ధగధగలాడించుచున్నది. ఆపైన స్వర్ణమయమై వజ్ర వైఢూర్యాది మహా రత్న స్థగితమైన సింహపీఠి యున్నది. దానిముందు శిల్పాభిరామమై కాంతులీను పాదపీఠమున్నది.

వేదికకు సన్నిహితముగ నాగయగన్న మంత్రి ప్రత్యేకాసన ముండెను. కాకతీయ కులగురువులైన వీరశైవాచార్యులా సమీపమున నాసీనులైరి. వారికి సమీపమున వివిధ శాస్త్ర పండితులు తమ యాసనముల నలంకరించిరి. వేదిక కెదురు భాగమున రాజపురుషులు, రాజప్రతినిధులును పవిష్టులైరి. వారికి ప్రక్కగ సర్వసేనాపతి వివిధ సేనాపతులు సుర్హాసనాసీనులైరి. ఆ వెనుక కవి పండితులు, నున్నతోద్యోగులు పౌర ప్రముఖులు వివిధ కళాకారులు సభ నలంకరించిరి. నేత్రహస్తులు మందిరము వెలుపల బరాబరులు చేయుచుండిరి.

[ఆ మందిరమునందు కుంకుమాగరు శ్రీగంధ కస్తూరీ సుకుమాదాది పరిమళ ద్రవ్యప్రభావము నలుదెసల వ్యాపించునది. నానావిధ పుష్పమాలికలందందలంకరింపబడినవి.]

ఇంతలో మంగళవాద్యములు మ్రోగినవి. శంఖనాదములు విన్పించినవి. నాగయగన్న మంత్రి శైవాచార్యులు ముందునడువ కొలది రాజ పరివారముతో ప్రతాపరుద్ర మహీపతి భద్రగజము నవతరించి సభా మందిరము సమీపించెను. అంత వందిమాగధులు భూపతి బిరుదావళులో పరింపుచు కైవారములు గావించిరి.

'జయహో !' 'బహుపరాక్' ధ్వానములు మిన్నుముట్టి సభ్యుల మానసమును పులకరింప జేసినవి. ప్రభువు రాకకు సభ్యులు గౌరవభక్తి పురస్కారముగ లేచినిలచిరి.

రుద్రభూపాలుడు మదగజగమనమున ముందునకు నడచి వేదికపై సింహపీఠినలంకరించెను. అనంతరము సభ్యులందరు నాసీనులైరి. శైవాచార్యుల వేదవిప్రుల యాశీర్వచనానంతరము నాగయగన్న మంత్రి యిట్లు ప్రసంగించెను.

మహావీరులారా ! రాజ ప్రముఖులారా ! కవిపండిత ప్రజాప్రముఖులారా ! మహాప్రభువు విజయ లక్ష్మీశోభితులై దయచేసి యీ సభ నలంకరించుటచే నీదినమును కాకతీయ చరిత్రలో చిరసంస్మరణీయమైనది ఈమహాసమరమున దుమికి వీరవిహారము గావించిన సేనానాయకులకు వివిధభలాదిపతులకు వీరసైనికులకు మాస్వాగతము. మీభుజశక్తి, శౌర్య సాహస గుణసంపదపై కాకతీయ మహాసామ్రాజ్యము శత్రు దుర్నిరక్షమై శోభిల్లుచున్నది. కుతంత్రములు పన్ని యశాంతిని కల్పించిన తురుష్కులను తరిమి, వారివ్యూహములను విచ్ఛిన్నము గావించిన యమాత్యుల బుద్ధిబలము, వీరనాయకుల శౌర్యసంపద యాపట్లశార్ధకమై ప్రశంసాపాత్రమైనది. మీత్యాగశక్తికి దేశభక్తికి ప్రభుభక్తికి నాయభివందనములు. కులమతభేధములు పాటింపక యైకమత్యముతో పోరాడిన మీవిశాల దృష్టి స్తవనీయము. ఇట్లే సంకుచిత భావములకతీతముగ ప్రవర్తించి దేశ రక్షణగావింపితిమేని త్రిలింగసామ్రాజ్యము వర్ధిల్ల గలదు. అనైక్యము దేశరక్షణకు, దేశాభివృద్ధికి గొడ్డపెట్టుకో గలదని చరిత్రగతిని గ్రహించిన మీకు తెలుపవలసిన పనిలేదు మన సామంత వీర భూపతుల సాయము మరువరానిది. వారి మహాంధ్ర శ్రేయోకాంక్ష మెచ్చదగినది. మనతురుష్క-విజయము నీకటకమునకు దేవగిరికి హెచ్చరిక కాగలదు. ప్రజలలో శాంతి నెలకొల్పి, వారివారి వృత్తులు సుభద్రముగ కొనసాగునట్లు మీరెల్లరు రాజ్యతంత్ర నిర్వహణమున మాకు తోడ్పడగలరని విశ్వసించుచున్నాము. ప్రజల సర్వతోముఖ వికాసమునకు వారు శ్రమించు నవకాశము లింకను కల్పించి దేశసుభిక్షతకు, సాంస్కృతిక చైతన్యమునకు, తోడ్పడి మీదక్షతను ప్రకటింపగోరెదను. ఈమహారణమున వీరమరణము నొందిన సైనికకుటుంబములకు జోహారులర్పించి జీవనభృతుల కలుగ జేయవలసి యున్నది. ప్రభువు వారి యనుమతిని యామహావీరుల కుటుంబ

ముల కట్టి యేర్పాట్లు గావించుచు శాసనములు ప్రకటింపబడినవి. అవి తత్కుటుంబముల కందింపబడును." అని రాజముద్రాముద్రితములైన శాసనములు, అధికారపత్రములు ఒక్కొక్కటిగ పఠింపబడినవి. శిరఃకంప మున రాజనుమతింప నాదానశాసనము లొసంగబడినవి. విజయముసాధించి గణనకెక్కిన సేనాపతులకు వీరసైనికులకు బిరుదప్రదానములు గావింప బడినవి. కొందఱికి ఘనసన్మానములు గావింపబడినవి.

ఈసభ ముగిసిన తర్వాత హృదయాహ్లాదియైన నాట్యప్రదర్శనము ప్రారంభమైనది. అది జగత్ప్రసిద్ధి నర్తకియైన మాచలదేవి నాట్యము.

మాచలదేవి జగత్ప్రసిద్ధ వారాంగన. రాజాదరణ పొందిన ధన్యు రాలు. ప్రతాపరుద్ర ధరణీశోపాత్త గోష్ఠీప్రతిష్ఠాపారీణ. ప్రతాపరుద్రుని కాలమున పలువురు నృత్య, గీతవాద్య నిపుణులు గలరు. వారిలో మాచల దేవి సుప్రతిష్ఠాఖిని. ఆమెకు మదనరేఖ–కామమంజరి (పునర్భవు) యను నిర్వురు కుమార్తెలు గలరు. మదాలస యను చెల్లెలు కలదు. వీరందరు కానాటి నృత్యమునందు పాల్గొని సభ్యుల నానందజలనిధిని ముంచితేల్చిరి.

నృత్త, నృత్యనాట్యములు బహుప్రాచీన కాలమునుండియు ప్రపం చమున బహుప్రసిద్ధములు. తొలిమానవుని ప్రాదుర్భావమునుండియే నృత్త, నృత్యనాట్యములు పుట్టినవి. శిశువుపుట్టగనే ప్రాణవాయువు కొరకై లయబద్ధముగ శ్వాసనుతీయును. ఈశిశువు హావభావ విలాసములను ప్రదర్శించును. రక్తప్రసరణ కొరకు కరచరణములను క్రమబద్ధముగ కదలించును నాద నామక్రియ రోదనము ప్రారభించును. ఇది మానవుని తొలి నృత్య, నాట్యప్రదర్శనము. మానవుడు పెరిగి పెద్దయైన తర్వాత నానందము కల్గినపుడు నాపద వాటిల్లినపుడు, నిర్భరావేశము నొందినపుడు నింకను బహువిధ మానసిక ప్రవృత్తు లందాతడు తన మనోభావమున కను

గుణముగ కరచరణాదుల కదల్చుటయు, ముఖభంగిమను మార్చుటకు హస్తాదులను కూర్చుటయు సహజముగ సర్వదేశకాలములందును వ్యక్తములగు చేష్టలు, ఆదిమ మానవసంస్కృతిలో సంతోష సన్నివేశములలో ప్రదర్శింపబడు నృత్త, నృత్య నాట్యములే యీకళకు నాందీగీతి నాలాపించినవి. ఆకసము మేఘావృతమైనపుడు నృత్యము సేయు నీలకంఠమును, వనభూములందు వంశీనాదా కర్ణనమున పడగవిప్పి యానంద తన్మయమున నాట్యము సేయు సర్పరాజును, సంతోషమున రెక్కలల్లార్చి బిడ్డలను దరికిదీయు పక్షిసంతానమును తొలిమానవుని నాట్యకళ కాచార్యస్థానీయులు. క్రూరమృగములను వేటాడుసమయమున ధరించిన వేషములు, చేసిన నృత్యములు, నావేశముతో పల్కుమాటలు. తాత్కాల ప్రదర్శితములైన ముఖభంగిమలు ప్రాచీన నాట్యకళకు మూలరూపములు. ఇట్లాదిమ మానవజాతి ప్రాదుర్భావమున, ఆదిమమానవ ప్రథమశిశు జనన వేళా సమాసన్నాంగిక సంచలనమున, ప్రకృతి సహజముగ తిర్యక్కులానందాది భావములను ప్రకటించు శారీరక సంచలన సందర్భములందు నీ నృత్యకళ ప్రారంభమై యుండవచ్చును.

భారతదేశమున నృత్త నృత్యములు వేదకాలమునుండియు ప్రసిద్ధములు యజ్ఞకార్య నిర్వహణకై ఋషుల సమావేశమై సందర్భములు, ఋగ్వేదములోని యూర్వశీ పురూరవ సంవాదము నత్యంత నాటకీయములు. భరతనాట్యశాస్త్రమున నృత్త గీతవాద్యముల నానుషంగికముగ వివరించినాడు.

నాట్యశాస్త్రము బ్రహ్మప్రోక్తమని నిర్దేశించి దానికి దివ్యయోనిత్వము నాపాదించెను. ఆదిమ మానవ పక్షిసంతానముల నాటపాటల నుండి యుద్భవిల్లిన నాట్యమునకు దివ్య యోనిత్వమును హేతువాదు

లంగీకరింపరు మన శాస్త్రకారులు ప్రతిశాస్త్రోక్తకృత్తికి నీ దివ్యత్వము నంటగట్టుదురు. మన శాస్త్రవేత్తలు నృత్త, నృత్య నాట్యములను గూర్చియు రసస్వరూప నిరూపణములను గూర్చియు, మిక్కిలి వివరముగ చర్చించిరి. వారు వీనిని శరీర ధర్మశాస్త్రముతోను, శాస్త్రీయ దృక్పథము తోను సమన్వయ పరుపలేరు.

ఆంధ్రదేశమున క్రీస్తుకు చాలపూర్వమే నాట్యవిద్య వికసించి యున్నది. శాతవాహన మహారాజుల కాలమున వెలసిన గాథా సప్తశతి యందీ ప్రస్తావన గలదు. నందికేశ్వరుని యభినయ దర్పణమున తెలుగు దేశపు నృత్య, నాట్య, సంగీతచరిత్ర కలదు. అమరావతి నాగార్జునకొండ త్రవ్వకములందు వెల్వడిన బౌద్ధశిల్పాదు లాంధ్రుల నాట్య సంగీత విష యములను తెలుపుచున్నవి. ఆ శిల్పగీత నృత్యభంగిమలు, వాద్యవిశేష ములు నానాటి లలితకళల వికాసమును నిరూపించుచున్నవి. చాళుక్యుల కాలమున నృత్త, నృత్య, నాట్యకళలు ప్రదర్శించుటకు నాట్యమందిర ములు నిర్మింపబడుటచే నీ కళలాకాలమున మూడు పూవులారుకాయలుగ వర్ధిల్లినవని చెప్పనగును. నన్నయ మహాభారతమున, నన్నెచోడుని కుమారసంభవ కావ్యమున నీకళల ప్రస్థావన యున్నది.

సుఖదుఃఖ సమన్వితమైన జీవితమును ప్రదర్శించుటకు నాట్య ప్రక్రియలు పెక్కులుండును. ఇట్టి నాట్యప్రక్రియలు దేశీయ పద్ధతికి చెందినవి పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రమున బసవపురాణ మున కలవు. ఇంకను ఏలపాటలు, జాజిపాటలు, తుమ్మెదపదాలు శివ తాండవ నృత్యదృశ్యము లీ ద్విపదరచనలందు విస్తారముగ నున్నవి. బసవపురాణములోని సంగయ్యకథలో నృత్యవిధానము వర్ణితము. అతడు శివునిగొల్చిన సందర్భమున సంగీతశాస్త్ర ప్రశంసయున్నది. పండితా

రాధ్య చరిత్రలోని శివరాత్రిత్సవ సంధర్భములో నృత్య సంగీత వాద్యాది ప్రక్రియలు విపులముగ తెలుపబడినవి. ఈకావ్య మానాటి లలిత కళలను చక్కగ ప్రతిబింబించుచున్నది.

కాకతీయులు లలితకళలలో శిల్పమును నృత్యము నత్యధికముగ నాదరించిరి. ప్రథమ ప్రతాపరుద్రుడు విద్యాభూషణ బిరుదాంకితుడు, నీతి సార గ్రంధకర్త, లలితకళాపోషకుడు, కాకతీయ ప్రభువులలో నగ్ర గణ్యుడైన గణపతిదేవుడు తన యరువదేండ్ల చక్కనిపాలనలో లలితకళ లను మహోన్నతముగ నాదరించెను. ఇతనికాలమున గజసేనాధ్యక్షుడుగ ప్రసిద్ధుడైన జాయప 'నృత్త రత్నావళి' ని రచించి తత్కళాపాచుర్యము నకు తోడ్పడిన ప్రజ్ఞామూర్తి. ఆనాటి తిక్కన సోమయాజి విరాటపర్వ మున నృత్యప్రదర్శనమును గూర్చి విపులముగ వర్ణించెను. ఆ మహాకవి శైలిలోనే నాటకీయత కలదని విమర్శకాభిప్రాయము.

నృత్తరత్నావళి యందు నృత్త–నృత్యపద్ధతులు వివరింపబడినవి. ఫేరణి - ప్రేంకణము - చర్చరి - రాసకము - నాట్యరాసకము - శివ ప్రియము - దండరాసకము - మొదలైన బహుదేశ ప్రక్రియలు కూర్చ బడినవి. నాటికాలమున పెంపొందిన నాట్యవిద్యకే విశరణములన్నియు ప్రతిబింబములని చెప్పనగును.

నాటిశిల్పకళ నాట్యవిద్యా ప్రభావమున బహువిధ నాట్యవిన్యాసము లతో సూక్ష్మపరిశీలనకు గోచరించు ముద్రలతో ముఖభంగిమలతో వర్ధిల్లి నది. నాటిశిల్పి నాట్యవిద్యా సార్వభౌముడు. నాటిశిల్ప రహస్యముల నవ గతము చేసికొనవలెనన్న విద్యార్థి నాట్యవిద్యను ప్రధానముగ స్వాదీనము చేసికొనవలెను. దీనికి రామప్ప దేవాలయమే ప్రత్యక్ష నిదర్శనము. నాడు సాహిత్యగోష్ఠులతోపాటు నృత్యనాట్యకళలను గూర్చికూడ గోష్ఠులు

చర్చలు జరిగెడివి. నృత్య నాట్య సంగీతకళల కాంధ్రులే పట్టుగొమ్మలను మాట నిర్వివాదాంశము.

ఆనాటి సభయందు మదాలస, కామవల్లి, మదనరేఖ, మొదలైన నర్తకీమణులు తోడుగ మాచలదేవి ప్రతాపరుద్రుని విజయసూచకముగ నాట్యప్రదర్శనము గావించినది. నాట్యసభా భవనము లలితకళల కాలవాల మైన మందిరమని చెప్పవచ్చును. అచటి శిల్పములు నాట్యాభిరమములు-సంగీతలయన్వితములు - చిత్రవర్ణశోభితములు - బహునాట్య సంప్రదాయ ములచటి పటములపై చిత్రింపబడి కూడ్యములకలంకరింపబడినవి. రాజ పరివారము - ప్రముఖులు, కళకారులు - మంత్రిదండనాథ పురోహి తులు - సభ నలంకరించిరి. అంతఃపుర జనమునకు ప్రత్యేకముగ రమ్యా సనము లొకక్రీవ నెలకొల్పబడినవి. నాడు నాట్యాచార్యులని ప్రసిద్ధి గన్న వారందరు సభకు విచ్చేసిరి.

విశాలమైన వేదిక నాట్యప్రదర్శ నానుకూలముగ నలంకరింపబడి నది. వైణికవాంశిక మార్దంగికాది కళానిపుణులు వేదికపై వెనుకకక్ష్యలో నాసీనులైరి. నేపథ్యగాయకులు వేరొకకక్ష్యలో నాసీనులైరి.

నాట్యప్రదర్శన గణపతిపూజతో మంగళాచరణ శ్లోకముతో ప్రారంభమైనది. అనంతరము రాధాకృష్ణ నృత్యము ప్రేక్షకుల నానంద పరవశులను జేసినది. ఇట్లు భామకలాపము దశావతార ఘట్టములు, కృష్ణ లీలలు, పార్వతీకళ్యాణాది శివలీలలు క్రమముగ నాట్యవిశేష నిరూపక ములై సభ్యులను అద్భుత శృంగార, వీరరసాంబుధిలో ముంచినవి నాటి యపూర్వప్రదర్శనము శివతాండవముతో ముగిసినది.

ఈ యద్వితీయవిజయ మాంధ్రుల కుత్సాహమును సంతోషమును గూర్చినది. శాంతి సహృద్భావ సౌఖ్యము లెల్లెడుల వ్యాపించినవి. యాద

వాది పరిసరభూపతులకే విజయ మాత్మపరిశీలనకు కారణమైనది. ఆంధ్ర ప్రజలు యధాపూర్వకముగ తమ తమ వృత్తులయందు నిమగ్నులైరి. యుద్ధమున వీరయువకులు పెక్కుమంది మరణించుటయు, నార్థిక సంక్షోభ మేర్పడుటయు కారణములుగ దేశాభివృద్ధికి ప్రజలు నిర్విరామకృషి చేయవలసి వచ్చినది. విజ్ఞానవంతుడు, మహావిద్వాంసుడు, పరిపాలనా దక్షుడునైన ప్రతాపరుద్రు డార్థిక, సాంఘిక, సాంస్కృతిక, వైజ్ఞానిక పురోభివృద్ధికి మార్గము లేర్పరచెను. అర్థికవిషయములందు కాకతీయులు మొదటినుండి యాకడ జాగరూకత వహించెడివారు రుద్రుని యార్థిక విధానము వివేకవంతమైనది. ఆదాయ వ్యయరీతు లితనికి బాగుగతెలి యును. భూరాజసమును ప్రజల కేవిధముగ ఖర్చుచేయవలెనో కాకతీయు లకు బాగుగతెలియును. ప్రతాపుని గణాంక విధానమువలన నేవృత్తుల వారెన్ని కుటుంబములున్నదియు ప్రభుత్వమునకు తెలియును. వృత్తుల మీద పన్నువిధించుట, వారి యవసరములను ప్రభుత్వము తెలిసికొనుట, వారికి ప్రభుత్వము సాయముచేయుట, సదుపాయములు కల్పించుట కాక తీయుల ముఖ్యధ్యేయము. గణాంకములను ప్రభుత్వమే తయారుచేసి ప్రజలకు న్యాయము జరుగునట్లు చూచెడిది. ఓరుగల్లు నగరమున వృత్తుల పట్టీ చక్కగ నిర్వహింపబడెడిది. ఈ వృత్తులపై విధించిన పన్నును, భూరాజసమును ప్రజోపయోగకరమైన పనుల కే వినియోగించెడివారు.

వ్యవసాయదారులకు చెఱువులను నిర్మించి కాలువలు త్రవ్వించి కృషికి తోడ్పడెడివారు. వ్యవసాయాభివృద్ధికి వనభూములను పంట భూములనుగా మార్చిన సందర్భము లనేకములున్నవి. పాకాలచెఱువు వంటివి నాటి వ్యవసాయాభివృద్ధి కెంతగానో తోడ్పడినవి.

కాకతీయ సామ్రాజ్యముయొక్క యాదాయవ్యయములు ప్రాచీన హిందూధర్మముపై నాధారపడియున్నవి. సామంతరాజులవలన వారికి

ఇర్వదినాలుగుకోట్ల రాబడి, నిజభుజపాలితమైన రాజ్యమునుండి వచ్చు రొక్కమిర్వదికోట్లు భూరాజసమువలన పదికోట్లు. ఇట్లు బండారమునకు వచ్చు నాదాయము యేబదినాలుగు కోట్లు. ఖర్చాదాయమునకు లోబడియుం డును. నగరిమొగసాల రక్షించు నవలక్ష ధనుర్ధనులకు రొక్కము మూడు కోట్ల యెనుబదిలక్షలు వ్యయమయ్యేడిది మదగజోత్తమాశ్వ పోషణకు రెండుకోట్ల యేబదిలక్షల రొక్కము రా..గృహములకు రెండుకోట్లు. అన్నసత్రములకు రెండులక్షల రొక్కము. పురరక్షకుడైన నిశ్శంకవల్లభునకు భటులకు జీతముల కెనుబది యెనిమిదిలక్షల యిరువదివేల రొక్కము, ఏకశిలానగర వైభవమున కొకలక్షయు, నన్యప్రాంతము లందలి దివ్యక్షేత్రములకు రెండుకోట్ల రొక్కమును, నిత్యవైభవములకు, సహపంక్తి భోజనములకు నగరదీపములకు ప్రతివర్షము రొక్కము మూడుకోట్ల యిరువదిలక్షలు వ్యయమయ్యేడిది.

దీనినిబట్టి చూడ కాకతీయ సామ్రాజ్యము చక్కని యార్థికవ్యవస్థ గల్గి సుభిక్షమై ధనధాన్య సంపదలలో నలరారుచున్నదని చెప్పవచ్చును. వీరి యార్థిక విధానము కౌటిల్యుని యార్థిక సూత్రములపై నాధారపడి యున్నది. ఇట్టి సుష్టు ఆర్థిక ప్రణాళిక ననుసరించిన ప్రభుత్వవిధానమొక కాకతీయ రాజ్యము నందే గలదు. ఇదియే యీ పద్ధతిని పాటించిన తుది హిందూ రాజ్యము.

కాకతీయుల కాలములో వీరశైవము విరివిగ వ్యాపించినది. జైన మతము నశింపజొచ్చెను. ఈ కాలమున ననేక దేవాలయములు నిర్మింపబడినవి. ప్రజలు శైవ మతావేశ పూరితులై జైన విహారములను నాలయములను పడగొట్టిరి. కొన్ని యాలయములందు జైన విగ్రహముల నూడ బెరికి శైవ విగ్రహములను ప్రతిష్ఠించిరి.

జైనమత గ్రంథములను నాశనము జేసిరి. జైన చైత్యారామముల నాక్రమించుకొని వానిని హిందూ దేవాలయములుగ మార్చిరి. దేశభాష లందు శైవగాథలను దెల్పు పెక్కు గ్రంథములను రచించిరి. బసవ పురాణ పండితారాధ్య చరిత్రములీ కోవకు చెందినవి. పంచాక్షరీ మంత్రము లతో త్రిపుండ్రములతో రుద్రాక్ష మాలలతో లింగధారణతో వీరశైవము వెఱ్ఱి తలలు వేసినది. మతద్వేషము లానాడు పరాకాష్ఠనందినవి. మొఱ్ఱో యన లింగము మెడకు గట్టినట్లను సామెతకు నాటినితులే యాధారకా వచ్చును. ఈ మతద్వేషము తన క్రూర వికృత చేష్టలతో సామ్రాజ్య విధ్వంసమునకే దారితీసినది.

ఓరుగల్లు సర్వకళలకు విద్యలకు నిలయమై యున్నది. ప్రతాప రుద్రుడు విజయోత్సాహమున మునిగి కాలమును వృధాపుచ్చక కళావిజ్ఞా నాభివృద్ధులకు తోడ్పడెను. కత్తి పట్టి యుద్ధమున వీరవిహారము సల్పిన వీరులు శాంతి సమయములందు ఖడ్గముల నావలబెట్టి సాహితీ కదన రంగమున నపూర్వ విజయముల సాధించిరి.

కళాకారులందరును కళాభివృద్ధికి తోడ్పడిరి. లలితకళలతోపాటు వేదాంత జ్యోతిషాది వివిధ శాస్త్ర గ్రంధ రచనలు కూడ తామర తంపరు లుగ సాగినవి. వివిధ మత సంప్రదాయ గ్రంధ రచన సాగినది. శాకవెల్లి మల్లికార్జునుడు, విద్యానాధుడు మున్నగు సంస్కృత కవులును హుళక్కి భాస్కరుడు రంగనాధుడు పాల్కురికి సోమనాధుడు, మారన, మున్నగు తెలుగు కవులును నాడు సుప్రసిద్ధులు. కృష్ణమాచార్యుడను ప్రథమాంధ్ర వచన రచయిత ప్రతాపరుద్రుని కాలమువాడు. ప్రేమాభిరామమును రచిం చిన సంస్కృత కవి రావిపాటి త్రిపురాంతకు డిప్పటివాడే. అప్పటి విద్వ న్మహాసభలు నేటికి ప్రసిద్ధములే. కావ్యచర్చలలో పంచాంగం వారికిని మిగిలిన వారికిని వాదప్రతివాదములు చెలరేగినవి.

ఇట్టి వికాసమొక రీతిని జరుగుచుండ రాజ్యమున రాజకీయముగ నొక గొప్ప విపత్తేర్పడెను.

గండికోట ప్రాంతమున నచటి సామంతరాజులు ప్రబల విరోధము తలపెట్టిరి. రుద్రభూపతి స్వయముగ నచటికేగి రాజద్రోహమునకు కారకులైన వారిని శిక్షించి యచట పెక్కు గ్రామములను నిర్మించి రాజ్యమును సుభిక్షము చేసెను.

ఆనాడు దేశమంతయు నాడు—సీమ—స్థలము మున్నగు విభాగములుగ పేర్కొనబడినది. కమ్మనాడు—పాకనాడు-ముల్కినాడు వెల్నాడు మున్నగు నామములు, కోరుకొండ సీమ—గండికోట సీమ మొదలగు సీమలును వెల్నాటి స్థలము - పింగళి స్థలము గురువిందాల స్థలము మున్నగు స్థలములును నాడుండినట్లు తెలియుచున్నది. ఒక్కొక్క విభాగమున కొక రాజప్రతినిధి యుండెను. వీరిని నిర్ణయించుటలో రాజు మిక్కిలి విచార బద్ధులై యుండెను. ఈ రాజప్రతినిధులకు చక్రవర్తియే యధిపతి. పరిపాలనా విధానముల నిర్వహించుటకు రాజున కనేకులు ప్రధాన మంత్రులుండిరి. చక్రవర్తి సర్వసైన్యాధిపతియేగాక, కొన్ని సమయము లందు స్వయముగ యుద్ధరంగమున కేగెడివాడు.

రాజ ప్రతినిధులను ప్రధానులను సైన్యాధిపతులను, మంత్రులను రాజే నియమించుట యాచారము. రాజే సర్వాధినేత - సర్వ న్యాయ నిర్ణేత. వివిధ రాష్ట్రము లందలి రాజప్రతినిధులు సామంతులు, నాయకులు చక్రవర్తి యాజ్ఞలకు లోనై యుండవలెను. కాకతీయ ప్రభువులు శాత్రవులను విద్రోహుల నణచి వాణిజ్యము నభివృద్ధి పరచి దేశమున నెల్లపుడు శాంతిని కాపాడెడివారు. ప్రజాక్షేమమే వారి క్షేమముగా నెంచెడి

వారు. ప్రజలు శాంతి సౌఖ్యముల ననుభవించుచు తమ యార్థిక స్థితిని పెంపొందు కొనుచుండిరి. త్రిలింగ రాజ్యము సస్యశ్యామలమై మహైశ్వర్యముతో దేశదేశముల ఖ్యాతి నొందియుండెను.

ఇట్లాంధ్ర సామ్రాజ్యమంతయు ధనధాన్యములతో తులతూగుచుండ సంగీత సాహిత్యాది కళలతో తేలియాడి వర్తక వ్యాపారములతో దేశ మభ్యుదయ పథమున నడువ కొన్ని వసంతములు గడచెను యుద్ధ యాత్రలందు తురుష్కుల ప్రకృతి విచిత్రమైనది. ఓటమి వాటిల్లినను వారు యుద్ధ ప్రయత్నములను విరమింపరు సరిగదా సైన్యమును సర్వ విధముల వృద్ధి పరచి జయము నొందువరకు దీక్షతో యుద్ధయాత్రలు సాగింతురు. ఉల్లూఖానుడు గతమున నాంధ్రవీరులచే పరాభూతుడయ్యెను మరల దక్షిణమునకు యుద్ధయాత్ర మొదలు పెట్టెను. అతని కార్య దీక్షయు నుత్సాహ శక్తియు నట్టిది. దేవగిరి రాజు సాయముకూడ లభించెను. దేవగిరికి రాజు యవన పరాధీనుడు. ఆంధ్రులు స్వతంత్రులై యుండుట సహింప లేకపోయెను ఆంధ్రుల పరాధీనతను కూడ చూచి యతడు తృప్తినొంద దలచెను.

దేశీయ రాజులలో గల 'యిట్టి తుచ్ఛ భావములే భారతదేశ దుర్గతికి కారణములైనవి. ఆంధ్రులు సంగీత సాహిత్యాది కళా వినోదములందు తేలియాడు చున్నారని చారులవలన మహమ్మదీయ చక్రవర్తికి తెలిసినది. సమయము లభించి నందులకు మిక్కిలి సంతసించి మాలిక్ నాయక్ కాఫర్‌ను సేనాధ్యక్షునిగ నియమించి యాంధ్ర దేశముపై దండెత్త బంపెను.

ఆ సేనాని గొప్ప సైన్యముతో వచ్చుట వేగుల వలన త్రిలింగ భూపతికి తెలిసెను. ఇంతలో వారు దండెత్తి రాగల్గుటకు కారణ మాతనికి

బోధపడలేదు. రుద్రభూపతి మేరు నగధీరుడు. యుద్ధ సన్నాహములకు వెంటనే సేనానుల కాజ్ఞలను పంపెను. సేనానులు సమావేశమైరి. కొంత సైన్యము నగర రక్షణ బాధ్యత వహించెను. కొంత సైన్యము గోల్కొండ సమీపమున, కొంత హనుమకొండ ప్రాంతమున విడియునట్లు చేసెను. ప్రభువు వార్తనందుకొని సింహాచలమున నున్న అన్నయ మంత్రి వచ్చెను. నాగయగన్న మంత్రి సర్వవిషయములను సమాలోచించి బలములను సంసిద్ధము గావించెను.

మహమ్మదీయులు దేవగిరి దగ్గర నీలకంఠ సమీపమున నెనిమిది దినములుండి యుద్ధయాత్ర సాగించుచు నాంధ్రదేశ సరిహద్దున నున్న శిరిపురము చేరిరి. వారీసారి దేశములోనికి జొచ్చుకొని వచ్చుచు గ్రామములను ధ్వంసము చేయసాగిరి. జనులు హింసింపబడిరి. సస్యములు పాడగుచుండెను. గ్రామాలను తగులబెట్టుట వారికొక హేలగా నుండెను. ప్రజలు భీతావహులైరి శిరిపుర దుర్గము తురుష్కా క్రాంతమయ్యెను. అటనుండి నాలు దినములలో బీడరు దుర్గమును చేరిరి ఇది స్వాధీనముకాగా వారు ముందునకు సాగిరి.

తురుష్కులు చొచ్చుకొని వచ్చుట విని యాంధ్రవీరులు విజయోత్సాహముతో వారి నెదిర్చిరి యుద్ధము వారము దినము లతి భయంకరముగ సాగెను ఈసారి మహమ్మదీయుల నెదిర్చుట కొంత కష్టమయ్యెను. వారి సైనిక సన్నాహమట్టిది. ఇంతలో సుల్తాఖానుడు మరణించెనని ఢిల్లీ నుండి వార్త వచ్చెను. మహమ్మదీయ స్కంధా వారములో కలకలము వ్యాపించెను. వారిలో నీపరిణామముపై స్వార్థ ప్రయోజనము లున్నవి. వారిలో నుత్సాహము సన్నగిల్లినది. భీతి, సంశయము హెచ్చినవి. ఈ స్థితియందున్న యవన సేనను చుట్టుముట్టి యాంధ్ర సేనాపతులు

పరాభూతులను గావించిరి. తురుష్క సేన మిక్కిలి నష్టము పాలయ్యెను. మల్లికాఫర్ ప్రాణములు చిక్కబట్టుకొని ఢిల్లీ మార్గము పట్టెను.

ఆంధ్రులు తురుష్కుల నెదిరించుచున్న సమయమున దక్షిణముగ పాండ్యులు విజృంభించి కాంచీ నగరమును స్వాధీనము చేసికొనిరి. రుద్రమదేవి కాలము నుండియు కుక్కిన పేనువలె పడియున్న పాండ్యులు విక్రమించుట గాంచి కాకతీయ చక్రవర్తి పద్మనాయక సేనానులలో నొక డగు నెజ్జి దాచానాయని వారిపైకి పంపెను. ఈ సేనాని మహాపరాక్ర మము చూపి పాండ్యుల గర్వ మణచి వారి స్వర్ణ సింహాసనమును వజ్ర వైడూర్య మరకత మాణిక్యములను స్వీకరించి యోరుగంటికి వచ్చి తన చక్రవర్తికి విజయలక్ష్మితో పాటు వానిని కూడ సమర్పించెను. చక్రవర్తి యీతని సామర్థ్యమునకు సంతసించి యెర్రి దాచానాయనికి 'కాంచీ కవాట చూరకార' 'పంచపాండ్య దళవిభాల' బిరుదము లిచ్చి గొప్ప సత్కారము గావించెను.

రెండవసారి తురుష్కులతో జరిగిన యుద్ధమున కాకతీయ సేనా నులు కొందఱు వీర మరణము నొంది, ఈ యుద్ధములచే, సామంతుల తిరుగుబాట్లచే ఖజానాలో ధనము విపరీతముగ వ్యయమయ్యెను. ఈసారి విజయోత్సవములంత వైభవముగ జరుగలేదు. ఈ విజయముల పిమ్మట పుణ్యక్షేత్రములను సేవింపవలెనను కాంక్ష చక్రవర్తిలో కలిగెను.

ఈ కాంక్ష కేవల మాముష్మిక దృష్టితోనేగాక, రాజ్యము నలు మూలల సంచరించి సామ్రాజ్య మంతయు పరిశీలించి వలయుచోట్ల కట్టు దిట్టములు చేసి రాజ్యమును సుభిక్షము గావించుట యాతని ముఖ్యో దేశము.

ఆయన కొంత బంధు మిత్ర పరివారముతో దక్షిణ దేశయాత్రకు పయనమయ్యెను. ప్రయాణములో మొదట కాంచీ నగరమును దర్శించెను. దక్షిణా పథమున సుప్రసిద్ధ శైవ క్షేత్రము కంచి. ఇది కేవలము పుణ్య క్షేత్రమేగాక సంగీత సాహిత్యములకు కూడ ప్రసిద్ధి కెక్కినది. కంచి బుద్ధుని నాటికే ప్రసిద్ధి చెందియుండెననియు, ఆయన యచటి ప్రజలను బౌద్ధులనుగా మార్చెననియు నొక ప్రతీతి. ధర్మపాలుడు కంచిలో జన్మించె ననియు, అశోకు డచట నొక బౌద్ధస్తూపమును నిర్మించెననియు చైనా యాత్రికుడు హ్యూయాన్ సాంగ్ తన గ్రంథమున వ్రాసియుండెను. శంకర రామానుజాచార్యులు వారి దిగ్విజయ యాత్రలో నీ క్షేత్రమును దర్శించి తమ పీఠముల నిచట నేర్పరచుకొనిరి. శంకర కామకోటి పీఠం నేటికిని ఇచటనే యున్నది ఈ కంచి యందు నూట యెనిమిది శైవ క్షేత్రములు కలవు పదునెన్మిది వైష్ణవ క్షేత్రములు నున్నవి. పెదకంచి చినకంచి యనియు రెండు భాగములు. మొదటిది శివకంచి.

ఏకాంబరనాథ దేవాలయ మిచట పేర్కొనదగినది దీని కైదు ప్రాకారములు గలవు. సావర్ధక ఈశ్వర మండపములు రెండిచట గలవు. మొదట ప్రాకారము దగ్గర ఎత్తైన గోపురము గలదు. ఇచట నొక పెద్ద అమ్రవృక్షము కలదు. ప్రతాపు డేకాంబరుని సేవించి పేదలకు పెక్కు దానములు చేసి శిలాశాసనములు వేయించెను. నాటి శిలాశాసన శైధిల్యములు నేటికిని కానవచ్చుచున్నవి.

రాజు చాటి సామంతులతో సుదీర్ఘ చర్చలుచేసి సామ్రాజ్యమును పటిష్ఠము గావించెను. ఆయన యచట నుండి దక్షిణముగ పయనమై శ్రీరంగ పట్టణము దర్శించెను. కావేరి శ్రీరంగ పట్టణము వొద్ద రెండుగా చీలి మరల కొంత దూరమున కలియును. నది రెండుగా చీలుటచే నొక ద్వీప మేర్పడినది. ఆ ద్వీపమే శ్రీరంగ క్షేత్రము. ఇది తిరుచునాప

సమీపమున నున్నది, ఇది దక్షిణ దేశమున చాల ప్రాముఖ్యము నొందిన స్థానము. ఇది పురాణ గాథా శోభితము - ఆలయము బహు పురాతనము. అలెగ్జాండరు దండయాత్రకు పూర్వమే యీ దేవాలయము కలదు. చోళ రాజులకు శ్రీరంగము ముఖ్య పట్టణము, రంగనాథుడు కులదైవము.

రామానుజు డిచట నివసించినట్లు పెక్కు నిదర్శనములున్నవి. ఇచట వేయి స్తంభముల మంటపము కలదు. ఈ యాలయమును ప్రాకార సప్తకసమావృతము. పదునైదెత్తైన గోపురములు కలవు ఈ ప్రాకారము లన్నియు నల్లరాతితో కట్టబడినవి. ద్వారములు వెండి బంగరు రేకుల తొడుగులతో నొప్పియున్నవి. గర్భగుడి పైనున్న విమానము బంగరు పూతతో ధగద్ధగాయమానముగ వెల్గొందుచున్నది స్వామి ధరించు నగలు లక్షల విలువైనవి.

ఈ నగలలో కోహినూరు వజ్రమును బోలెడి వజ్రమొకటి గలదు. ఇది మిక్కిలి విలువైనది. ప్రాక్ గోపురము శిల్ప కళా నైపుణ్యము గల్గి చూచుటకు ముచ్చటగ నుండును. ఈ గోపురము నాలుగు వందల యేబది యడుగుల ఎత్తుగల్గి నూట ముప్పది యడుగుల వెడల్పు గల్గి వేయి స్తంభముల మంటపముతో నలరారును. ఈ స్తంభములు ఏక శిలా నిర్మితములు. వీనిపైన యేనుగులు సింహములు గుఱ్ఱములు చక్కగ శిల్పింపబడి యున్నవి.

దక్షిణద్వార సమీపమున నాండాళమ్మ గుడి గలదు. ఈ గుడి యందిరువైపుల వసంతోత్సవ మంటపము ఉయ్యాల మంటపము గలవు. ఈ మంటపములపైన పెక్కు శిల్పములు రచింపబడినవి ఇవి మిక్కిలి రమణీయములు. ప్రతాపుడు రంగనాథుని సేవించి యిచట తెలుగు పటములకు వివరములు వ్రాయించెను. పెక్కు శిలాశాసనములు చెక్కిం

చెను. బీదసాదలకు దానధర్మములు చేసి యచట నుండి బయల్వెడలి జంబుకేశ్వరాలయమునకు వెడలెను.

అచట ఆలయము శివాలయము. ఇది పంచ లింగములలో నొకటి, జలలింగము ఈ లింగము నుండి నిరంతరము జలము పడు చుండును. ఈ లింగమునకు జంబుకేశ్వరుడని పేరు అమ్మవారికి అఖిలాండేశ్వరి యను పేరు గలదు. ఈ దేవాలయమునకు పంచ ప్రాకార ములు కలవు. గర్భాలయము నుండి మున్నూట యిరువదియైదు దినము లును జలధార పడుచుండును. దీని వెనుక జంబూవృక్షము గలదు. నేరేడాకులచే నీ స్వామి నర్చన చేయుదురు. అందుచేతనే జంబుకేశ్వర నామము సార్థకమైనది. ప్రాకారములపైన చిత్రితమైన శిల్ప విన్యాసము శ్రీరంగ దేవాలయముపై గల శిల్పము కన్న మిన్నయైనది. ప్రతాపుడు జంబుకేశ్వరు నారాధించి యచట నొక శిలాశాసనమును వేయించెను ఈ శాసనము నేటికిని చూడ నగును.

అప్పటి కాప్రాంతమున రుద్రునకు ప్రబల శత్రువులు లేకుండిరి. చోళులు బలహీనులైరి. పల్లవుల పాలన మంతమొందెను పాండ్యులు దుర్బలులైరి. ఈ కారణమున ప్రతాపరుద్రుడు జంబుకేశ్వరమున విజయ ధ్వజమును నాటగల్గెను. అతడచట నుండి బయల్వెడలి మరికొన్ని క్షేత్ర ములను ప్రముఖ నగరములను దర్శించుచు రామేశ్వరమును చేరెను.

రామేశ్వరము భారతదేశమునకు దక్షిణపుకొన. ఇది యొకద్వీ పము. ఇది దాదాపు ఇరువదియైదు మైళ్ళ పొడవు నెనిమిది మైళ్ళ వెడ లుపు కలిగి కొబ్బరి చెట్లచేతను, తాళ్ళ వృక్షముల చేతను బాబుర్ అనెడి నికుంజములచేతను నిండి దర్శనీయముగ నుండును. ఈ ద్వీపము చతు రంబోధి పరివృతమై జగత్ప్రసిద్ధి చెంది భారత దేశమునకు రత్నపేటిక

వలె నొప్పుచున్నది. అయోధ్యా వివాసియైన శ్రీరాము డిచటి నుండియే లంకను ముట్టడించెనని రామాయణము ఘోషించుచున్నది. లంక యిచ టికిరువదియైదు మైళ్ళు. లంక చుట్టును రత్నాకరమున్నది. రాముడు సేతువు కట్టి రత్నాకరమును దాటి రావణలంకను చుట్టుముట్టి రావణుని జంపి యా రాజ్యమును జయించెను. రావణుని చంపుటచే బ్రహ్మహత్యా పాపమునకు గుఃయ్యె రామేశ్వరాలయమున శివలింగ ప్రతిష్ఠ చేసెనను, ప్రతీతి కలదు. అందువలననే యీ స్వామిని రామలింగేశ్వరుడందురు. ఈ దేవాలయమునకు మూడు ప్రాకారములు కలవు. వీనియందు ద్రవిడ శిల్పము చెక్కబడినది. ఈజిప్టు శిల్పము కూడ యిచట గోచరించును. దేవాలయమునకు ముందొక పెద్ద నంది విగ్రహము గలదు. ఇది భారత దేశమునందలి పెద్ద నంది విగ్రిహములలో నొకటి.

మూడవ ప్రాికారము లోపల పెద్ద మంటపము కలదు. ఇంత పెద్ద మంటపము భారతదేశములో నెచటను లేదు. పూజావిగ్రహముల చేతను, ఉత్సవ విగ్రిహముల చేతను శిల్ప విగ్రిహముల చేతను నీ మండపము చూచుటకు రమణీయముగ నుండును. గర్భ గుడిలో రామలింగ విగ్రిహ ములు పర్వతవర్ధని విగ్రహములు కలవు. అమ్మవారికి ఇర్వది మణుగుల బంగారు కలదు. ప్రతి శుక్రవారము నీమెను సువర్ణ రత్నమయ పల్యంకి కలో నూరేగింపు గావింతురు. ప్రతాపరుద్రుడు రామలింగేశ్వరుని గంగా జలముచేనభిషేకించి పర్వతవర్ధనిని పూజించి ధనధాన్య వస్తువాహనములను బహూకరించి తన దేశమునకు తిరుగు ప్రయాణము చేసెను.

ఈ సందర్భమున ప్రతాపుడు కన్నడ రాజ్యమందలి కొన్ని భాగ ముల పర్యటించి యచటి సామంతులను కప్పము గట్టునట్లు కట్టడిచేసి శివ

గంగ పర్వతాగ్రమునకేగి యచటి పుణ్యోదకముల స్నానమాచరించి పెక్కగ్ర హారముల దాన మొసంగి. యేక శిలానగమునకు వేంచేసెను.

# 26

ఒకనాడు చక్రవర్తి నగరాధ్యక్షుని పిలువనంపి చిన్న సమావేశ మేర్పరచెను. ఆ సభలో సామ్రాజ్యపు టార్థిక స్థితినిగూర్చి సైన్య పురోభి వృద్ధిని గూర్చి చర్చించిరి. ఆర్థిక పరిస్థితులకు పెక్కు సూచనలు చేయ బడెను. ప్రజల మీద యెక్కువ సుంకము వేసి వ్యాపారము నుండి ధనమును రాబట్టి ధనాగారము వభివృద్ధి చేయుటకు నిశ్చయించిరి.

గడచిన రెండు యుద్ధములందు సైన్యము విశేష నష్టమునకు గురి యైనది. పెక్కురు సైన్యాధిపతులు వీర శయనము నలంకరించిరి. మరల యుద్ధ వచ్చెనేని చాలినంత సైన్యములేదు. ఏమి చేయవలెనో రాజునకు తోచుటలేదు. నాగయగన్న మంత్రితో నిట్లనెను. "మనకు సైనిక బలము తక్కువగ నున్నది. దీనినెట్లభివృద్ధి గావింపవలెను ?" అంత నాగయ గన్న మంత్రి యిట్లనెను "ప్రభూ ! ఈసారి కార్మికులను, కర్షకులను సైన్యమున జేర్చి శిక్షణ మొసంగిన నీలోపము పూరింపబడును. ఇంత కంటె నుపాయాంతరములేదు. పురుషులు మరణించుటచే స్త్రీలు మన దేశమున నెక్కువగ నున్నారు.

మనకు రుద్రమదేవి కాలమున విస్తారమైన మహిళా సైనికదళము గలదు. అప్పుడది సుశిక్షితము కూడ. కాని తర్వాత వీరసైనిక బృంద సంపదచే ఆ సైన్యము నంతగ వృద్ధిగావింపలేదు. నేడా సేనా వాహిని పునరుదరింపవలసి యున్నది. ప్రభు వనుమతించినచో మహిళా సైన్యాభి

వృద్ధికి తగిన యేర్పాట్లు గావింతును అని చెప్పెను. అంత ప్రభు వాలోచించి తన యనుమతి నొసంగెను. నాగయగన్న మంత్రి రాజానుమతి నొంది వెడలిపోయెను.

# 27

మంత్రి వెంటనే రాజాజ్ఞానుసారము కార్మికులకు కర్షకులకు స్త్రీలను సైనిక శిక్షణ నిప్పింపదొడగెను మహిళా సైన్యము దేశము నలుమూలల సుశిక్షితమై దేశరక్షణకు కంకణము ధరించెను. మంత్రి శేఖరుడు తగిన పరివారమును పంపి వీరనారీమణులను రప్పించి యుద్రేకపూరితమైన యుపన్యాసము లిచ్చి చారుమతిని వారికి నాయకురాలిని గావించెను.

ఢిల్లీ సుల్తానుచే నపహరింపబడి మాయోపాయమున నోరుగల్లు సురక్షితముగ జేరిన చారుమతిలో చాల మార్పు గనవచ్చినది. ఆమె రూప విజిత రతీదేవియయ్యు దేశపరిస్థితిని గమనించినది. అబలత్వము నుజ్జగించి యాత్మ రక్షణకు దేశరక్షణకు వలసిన వివిధాయుధ విద్యలందు శిక్షణ బొందసాగినది. తండ్రికి సన్నిహితులైన వీరుల సాయమున నాయుధశాలలోని వివిధాయుధ సంపత్తిని వినియోగింప సాగినది. ఆమె కొలది కాలమునకే వీర వనితగ ప్రసిద్ధి నొందసాగినది.

గత రెండవ యుద్ధమున కూడ తురుష్కులను పారద్రోలుటకు మహిళా దళమునకు శిక్షణ మొసంగినది. నగర రక్షణమున బాధ్యత వహించినది. రాజిట్లు మహిళా సైనిక బలమును వృద్ధిగావింప నిశ్చయించు నాటికే చారుమతి వీరనారిగ ప్రసిద్ధ రాలైనది. నేడామెలో వీర శృంగార రేఖలు ముడివడిన సత్యభామ గోచరించినది. రాణామె దేశ

భక్తికి త్యాగబుద్ధికి లోలోన సంతసించెడివాడు. సంకల్ప సుద్ధియున్న యెడల కార్యసిద్ధికి కొదువయేమి ? ఆమె ననుసరించి వీరవనితలు వందల కొలది యేక శిలానగరమున నపరరుద్రమ దేవులవలె వీరసైనికుల కావేశ స్థానములైరన్న నాశ్చర్యమే మున్నది శాంతి సమయములందు భోగ మయ జీవితముతో ప్రొద్దులు పుచ్చు నారీమణులు దేశము సంకటస్థితి యందున్నపుడు పురుషులకు తోడ్పడి తమ శక్తిని ప్రదర్శించుట కర్తవ్య మని చారుమతి గావించిన హెచ్చరికలు మహిళా సైన్యమును వీరావేశ సంభరితము గావించెడిది. ఇట్లీమె యత్నములు, సన్నాహములు నాగయ గన్న మంత్రి కార్యక్రమములకు మిక్కిలి సహకరించినవి.

ఆమె ఖడ్గ విద్యా శిక్షణము - విలువిద్యా ప్రావీణ్యము, అశ్వా రోహణ - గజారోహణాది చాతుర్యము తండ్రియైన మేధావిని ఆశ్చర్య నిమగ్నుని గావించెడివి. సుకుమార వనీవల్లీమ తల్లిగ నాశ్రమమున పెరి గిన పదునారేండ్ల లేబ్రాయపు తన కుమార్తె యెక్కడ. కరకౌశరణ విద్యా నైదూషిని భూషితయై, నయనాంచలారుణ వీర రేఖా రంజితయైన నేటి చారుమతి యెక్కడ ? పరిస్థితుల బలమును బట్టి మానవులెట్లు పరిణామ మును పొందుదురు ! ప్రభువుతో వివాహము కాకున్నమానె ఆ వీర శేఖరుని పదసన్నిధిని యుద్ధ రంగమున వీర మరణము నొందుటకైన సంసిద్ధురాలైనది చారుమతి. తురుష్కులతో రాబోవు మూడవ సమర మున నోరుగంటి మహిళా సైనిక పాత్ర, అందును వీరనారీమణి చారు మతి పాత్ర యొక మెఱుపు వంటిది. అది కొలది కాలమైననేమి, ఆంధ్ర నారీమణుల, వీరవిక్రమాటోపమునకు ప్రబల నిదర్శనమని చెప్పదగిన సమయమది.

# 28

నాగయగన్న మంత్రి గత యుద్ధానంతర విజయోత్సవ సందర్భమున ఖైదీలను విముక్తులను గావించెను. ఆ సందర్భమున జైన నాయకుడై రాజద్రోహ చర్యలు గావించుచున్న కుశీలుడు కూడ విముక్తుడయ్యెను. విజయానంతర మిట్లు బందితులను విముక్తులను చేయుట ప్రతాపరుద్రుని యౌదార్యమునకు ప్రబల నిదర్శనము. అట్లు విముక్తులైన ఖైదీలకు హితోపదేశము చేసి వారికి కూడ రాజాజ్ఞ ననుసరించి సైనిక శిక్షణ నొసంగబడెను. కుశీలునికూడ సైన్యములో జేరవలసినదిగ నాగయగన్న మంత్రి కోరినాడు. అంతట

కుశీ : అయ్యా ! నేను సైన్యమున జేరుటకెట్టి యభ్యంతరమునులేదు. సైన్యమున నాకు సముచిత స్థానమీయవలెను. ఒక సామాన్య సైనికుడుగ పదాతిదళమున జేరనిష్టములేదు.

నాగ : అట్లయిన మీకేపదవి కావలెను ?

కుశీ : నే నాశ్వికదళములో చేరెదను. నాకు జవనాశ్వమును నిశిత కరవాలము నిప్పింప ప్రార్థన. అప్పుడు యుద్ధరంగమున నా శక్తి కొలది కాకతీయ విజయమునకు తోడ్పడగలను.

నాగ : మీకు కోరినట్లే యిప్పింతును.

నాగయగన్న మంత్రి యశ్వసైన్యాధిపతి కొక లేక వ్రాసి యొక భటుని వెంటనే పంపెను.

అందిట్లున్నది.

"ఈ వచ్చు వ్యక్తి ప్రముఖవీరుడు, కుశీలవుడు. ఇతనికొక ఖడ్గ మును నుత్తమాశ్వమునిచ్చి యాశ్విక దళమున జేర్పగోరెదను."

ఇట్లు

నాగయగన్న మంత్రి

మహా మాత్య ముద్ర.

మహామంత్రి యాజ్ఞానుసారము కుశీలవుడు సంకల్ప సిద్ధు డయ్యెను.

ఈ యవకాశమును వినియోగించుకొని దేశద్రోహమున కతడుద్య మించెను. అతడు వెంటనే జైన నాయకులతో రహస్య సంభాషణములు గావించి తన కొసగబడిన యవకాశమును స్వప్రయోజనమునకు దుర్వి నియోగము చేయు పధకములు వేయసాగెను. జైన నాయకు లాతని పధ కమునకు మిక్కిలి సంతసించి తగిన సమయమున తోడ్పడుటకు నిశ్చ యించిరి. రాజకీయ వైరముతో ప్రభువునకు శత్రుపక్షమువాడై ప్రచ్ఛన్న ముగ కుట్రలు పన్ను భోజారెడ్డి నితడు దర్శించెను. వారు కొన్ని రహస్య విషయములను మాటాడుకొనిరి. అవి యిట వివరింపరానివి.

# 29

శరత్కాలము ప్రారంభమైనది. వర్షములు వెనుకబట్టెను. మేఘ ములు జీవనములు విడిచి వాయువశంబులై చెదరి చెదల వ్యాపించినవి. చుక్కలు దీపశ్రేణివలె గగనాంగణము నలంకరించినవి. శరచ్చంద్రుడు శ్వేత కాంతితో లోకమును ధవళకందుకము గావించెను. వెన్నెలకాంతిలో

పొట్టలు పోసి కొన్న పైరులును, కడుపునిండ ఫలములు మెక్కి నింగి కెగయు శుకపికాది శకుంత సంతానములును, నిర్మలోదక జలాయశములు, తేట నీరొప్పు నదీ గర్భములును, హారిద్ర కాంతిపుంజములతో భాసించు వాసంతికాది లతావని కుంజ పుంజ పరిశోభితములై దినకర కిరణ ప్రసరణము లేని వనభూములును మందార మకరంద బిందు సందోహసమాస్వాదమున ఝుంకృతులు గావించు మదభృంగీ సంతతులను కలిగి శరత్తు లోకమున కడుగిడినది. '

వరి పొలములు క్రొత్త కంకులనీని వింత సోయగములతో తల లూపుచు గాలి పిల్లల నాహ్వానించుచున్నవి. రైతులు మాగాణి పొలముల గట్లపై పెట్టిన బీర, సొర, పొట్ల మున్నగు కూరపాదులున్నట కొనలు సాగి మొగ్గతొడిగి పందిరి కెక్కినవి. మందార, చేమంతి, గులాబి, విర జాజి, సన్నజాజులు మున్నగు పూలమొక్కలు పుష్పభరితములై ముద్దు లొలుకు చున్నవి.

శరత్తు వచ్చి జానపదుల ముంగిళ్ళకు వింతశోభను సమకూర్చి నది. పచ్చిక మెసవి చియ్యబట్టిన పుల్లావుపెయ్యలు నిగనిగలు పోవుచు కృషికులకు సంబరము గూర్చుచున్నవి. రోగదేవత తన ప్రచారమును విరమించుకొని ప్రజలకు కొంత యనామయమును ప్రసాదించినది. ఆ శరత్తున నేకశిలానగర మందెచట చూచినను ప్రశాంతత, విందుదనము ముట్టిపడుచుండెను.

వాణిజ్యము నగరమున వృద్ధిపొందియున్నది. నాటి నిత్యావసర వస్తుసముదాయము నగరమున నుత్పత్తి యగుచున్నవి. రత్న కంబళ ములు, జంబుకాణములు తయారగుచున్నవి. సన్నని మేలి వస్త్రములు నేయు పేటి పనివాండ్రు కుబేరులై యుండిరి. వీనికై ముచ్చటపడని

ప్రభువులుగాని, రాణివాసపు స్త్రీలు గాని నాడు లేరనవచ్చును. ఊరి వెలు పల జరుగు సంతలందు విక్రయార్థము సర్వవస్తు సముదాయములు చేరి యుండెడివి. ఆకుకూరలు, వివిధ ఫలములు, ధాన్య విశేషములు, పప్పు దినుసులు, కస్తూరీ సుకుమార కుంకుమాగరు కర్పూరాది సుగంధ ద్రవ్య ములు, ఇంకను పెక్కు గృహ సంభారములు విరివిగ లభ్యమగు చున్నవి.

కాకతీయ రాజ్యము నుండి పెద్ద స్థాయిలో భారతదేశము నందలి వివిధ ప్రాంతములలోనే గాక ప్రపంచము నందలి పెక్కు దేశములతో వ్యాపారము సాగుచుండెను.

సముద్ర మార్గమున కూడ నితర దేశములతో నెక్కువగ వ్యాపా రము జరుగుచుండెడిది. మచిలీపట్టణము, మోటుపల్లియు నాకాలములో సుప్రసిద్ధ నౌకాస్థానములు. ఈ రేవులకు సుమిత్రా, జావా, బోర్నియా, పర్షియా, అరేబియా, చైనా దేశముల నుండి సరుకులు వచ్చుచుండెడివి. ఏలకులు లవంగాలు, జాపత్రి మున్నగు సుగంధద్రవ్యముల వ్యాపారము నీ దేశములతో విరివిగ సాగెడిది. పట్టు, ముత్యములు, దంతపు పనిముట్లు మున్నగు విలాస వస్తువుల వ్యాపారము చైనాతో విస్తారముగ జరిగెడిది.

ఓరుగంటి నుండి నాగరకత నిత్యనూత్నముగ నలుదిశల వ్యాపించి యున్నది. వివిధకళా వినోదములకు కాణాచి యోరుగల్లు నగరము— నాటక ప్రదర్శనములు – జంగమ కథా ప్రసంగములు, యక్షి గాన వినో దములు, నింద్రజాలాది జానపద వినోద ప్రదర్శములు నాటి ప్రజల నాకర్షించెడివి. కోలాటములు, బంతులాటలు, పొట్టేళ్ళ పోరాటములు, కోడి పుంజుల పౌరుష ప్రదర్శనములు నాటి ప్రజల వేడుకలు. మైలారు

భటుల వీరభద్ర పళ్ళెములు, నాసికా ఖండన నయనోత్పటి నాది వీరశైవ భక్తి ప్రదర్శనములు ప్రజల నావేశపరచెడివి.

రాజపురుషులు జవనాశ్వములపై పయనించెడివారు. సామంతులు భద్రగజముల నధిరోహించి యోరుగల్లున కరుగుదెంచెడివారు. ధనవంతులు పల్లకీలలో పయనించెడివారు. నాటి ప్రజల భోగవిలాస జీవిత దృక్పథము ప్రశంసనీయమైనవి. సామాన్య ప్రజల మొదలు ధనవంతుల వరకు వారి జీవితము సుందరతరము గావించుకొనెడివారు. ధనికుల యిండ్ల పడతులు కాలాగురుచ్చను లేపనములు, స్థూల ద్విత్రపిటావకుంఠనములు, దట్టుపునుగు, మృగనాభి మున్నగు సుగంధ ద్రవ్యముల నుపయోగించెడివారు. సంపన్నులు క్రొత్త మలకవాళ్ళ కిర్రు చెప్పులు తొడిగెడివారు. స్త్రీలు తాటంకములు, ముత్యాల కమ్మలు, కాంచీనూపుర తారహారములు, రత్నాల కంకణములు, త్రిసరములు, మొరవంక కడియములు, మున్నగు నాభరణములు ధరించెడివారు. పురుషులు బంగరు కడియములు, రవ్వల పోగులు, బంగరు మొలనూళ్ళు ధరించెడివారు.

ఆ కాలమున వేశ్యాసాంగత్యము పురుష లక్షణముగ భావింపబడెడిది. వేశ్యా వృత్తి మిక్కిలి ప్రచారములో నున్నది. మాచలదేవి యను వీరవనిత నాట్య సంగీతాది కళలందు ప్రవీణయై రాజ నర్తకిగ ప్రసిద్ధురాలు. ఆమెకు గల ప్రసిద్ధి ఢిల్లీ సురతాణికి గూడ లేదు. పూర్వము నుండియు దేవాలయములనందు దేవదాసీలు కలరు. వారికి మడిమాన్యము లిచ్చి పోషించు బాధ్యత రాజులదై యున్నది. రుద్రమదేవి కాలమున పదిమంది దేవదాసీలకు దేవాలయము నొద్ద నాడుటకు పదునయ్యరు పాడుటకు నేర్పాటుచేయబడియున్నది.

ఓరుగల్లు నగరమున నగణ్య వస్తువాహన శోభితములైన పెక్కు గృహములు కలవు. ఏకశిలానగర వేశ్యావాటికలు సామాన్యమైనదికాదు. అవి విద్వేషిభువన జిగీషారంభ విజృంభమాన ఝషధ్వజ భుజపరాక్రమ సముత్సాహ నాటక ప్రస్తావనా ప్రథమ నాందీ శ్లోకంబులగు వేశ్యావాటికా నికుటుంబులు నిట శిఖామణులు వేశ్యాంగనలకు శాటీహాటక నిష్కములను కాన్కలుగ సమర్పించెడివారు.

ఇట్లు ప్రజలు భోగలాలసులు, ధర్మచ్యుతులునై నిర్వీర్యులగు చుండిరి. వీరధర్మము, త్యాగానురక్తి నేర్పిన వీరశైవ సంప్రదాయము కడకిట్లు క్షీణదశనొంది ప్రజలలో విలాసప్రియత్వము భోగవాంఛ పెచ్చు పెరిగినది. కాకతీయరాజ్యారంభ వికాస దశలందున్న త్రిలింగ శూర దేశప్పు రానురాను నిర్వీర్యమై తాను పెంచుకొన్న భౌతిక సంపదల ననుభవించుటలో ధర్మచ్యుతి నొంది యాత్మ వినాశనమునకు దారితీసినది. రాజ్య వికాస పతనముల మలుపులిట్టివేగదా!

# 30

ఈ విధముగ నాంధ్రులు భోగలాలసులై కలనైనను శాత్రవపీడ నెఱుగకున్న సమయమున నుప్పెన వలె నుత్తర దిశనుండి యవనులు మరల నోరుగంటిపై దండయాత్ర ప్రారంభించిరి. మహమ్మదీయ సేనలు వచ్చి దేవగిరి కోటయందు విడసిరి. దేవగిరి రాజు వారికి ప్రోత్సాహ మిచ్చుటయేగాక తన కాల్బలమును నాశ్విక దళమును తోడుగ పంపెను. మహమ్మదీయులు ద్విగుణీకృతోత్సాహముతో ముట్టడి నారంభించిరి.

ధైర్యసాహసోపేతుడైన ప్రతాపరుద్రున కీవార్త పిడుగుపాటువలె తోచినది. కాకలు తీరిన సేనాను లందఱును గత యుద్ధములందు మరణించిరి. రుద్రునకు కర్తవ్యము బోధపడలేదు. నాగయగన్న మంత్రితో సంప్రదించి క్రొత్త సేనాధిపతుల పిలువనంపి కోట రక్షణ సైన్యమును శత్రువుల నెదిరించుటకు కొంత సైన్యమును నియోగించెను. కాని సైన్యము చాలుటలేదు.

పూర్వ యుద్ధములందు తగినంత సైన్యముండెడిది. ఆ సైన్యము ఏకశిలానగరమునకు వంద మైళ్ళ దూరముననే శత్రువుల నెదుర్కొని పరాభూతులను గావించెడివారు. వారి యాహార పదార్థములను మార్గ మధ్యముననే హరింప జేసెడివారు. కాని నేడట్లులేదు. కోటను రక్షించుకొనుటయే నేడు దుర్భరమైనది. ఈ పరిస్థితులు వేగుల వలన గ్రహించి మహమ్మదీయ సైన్యములు సమరోత్సాహముతో నల్లేరుపై బండి నడక వలె రాజధాని వైపు పురోగమింప సాగినవి.

అవి గిరిదుర్గములను కాకతి ప్రాకారములను రాజ ప్రాకాకారములను స్వాధీనము చేసికొనుచు ముందునకు వచ్చుచున్నవి. లద్దర దేవుని రక్షణయందున్న దుర్గమును తురుష్క సైన్యములు నాశనమొనర్చెను. లద్దర దేవుడు సామాన్యుడు గాడు. అరివీరభయంకరుడు. సమర కర్కశుడు, బహు సమరము లందారితేరిన యోధాగ్రేసరుడు. అతడే గతిలేక సాహాయ్యమునకై యోరుగల్లుపాఱిపోయెను. మహమ్మదీయసర్వసైనాధిపతి యైన జునా ఇద్దరు సైనానులను పల్వార విలుకాంద్రను పరిస్థితులు గమనించుటకై యోరుగల్లు పంపెను. వారోరుగంటి బలమును తెలిసికొని కోటను ముట్టడించుట బహు సులభమని తెలియపరచిరి. అనతికాలములోనే యోరుగంటి ముట్టడి ప్రారంభమైనది.

మహాంధ్ర సామ్రాజ్య మిట్టి దుర్భర క్లిష్టపరిస్థితు లందుండగ రెడ్డి సామంతులు ధరణికోట ప్రాంతమున తమ స్వతంత్ర పతాక నెగుర వైచిరి. ఈ వార్త విన్న పిమ్మట ధీరుడయ్యును ప్రతాపు డాందోళన చెందెను. ఎట్టకేలకు ధైర్యము నూని కొంత సైన్యమును ధరణికోటకు పంపి రెడ్లను లొంగదీసికొన యత్నించెను. కాని ప్రయోజనము లేక పోయెను. రెడ్డి రాజులిట్లు సామ్రాజ్య సమైక్యమునకు భంగము కల్గించుటకు కారణము వారికి పద్మనాయకులపై గల ద్వేషభావమే. కుల ద్వేషములే మహాసామ్రాజ్యము దారుణముగ వినాశమొందుటకు కారణభూత మైనది.

మహమ్మదీయ సేనలు మహోత్సాహముతో మట్టి ప్రాకారము సమీపించినవి. వారి కగాధమైన యగడ్త యెదురయ్యెను. అయినను మహమ్మదీయసేనాని తన సైనికులను తెప్పలతో నగడ్తను దాటించెను. ఆశ్విక దళము యగడ్త నీదుచు మృణ్మయ ప్రాకారమును ముట్టడించెను. మట్టితో నగడ్తను పూడ్పించి గజబలమును కోట దరికి చేర్చెను. కోటను నలువైపుల నుండి శత్రువు లొకేసారి ముట్టడించిరి. తురుష్క సేనాని శిబిరము యేకశిలానగర సింహద్వారమున కెదురుగ నిర్మింపబడెను. దాని ననుసరించి కొన్ని వేల యవన శిబిరములు శ్రేణిగ నేర్పడినది. అది యొక దుర్గమ ప్రాకారమువలె నుండెను.

యుద్ధము ప్రారంభమయ్యెను. ఆంధ్రులు కోటలో నుండియే సమరము చేయనిశ్చయించుకొనిరి. మట్టికోట నెట్లు భేదింపవలెనో మహమ్మదీయులకు బోధపడలేదు. తురుష్కులు తమ శతఘ్నుల నుపయోగించి కోటను భేదింప యత్నించిరి. ఒక్కొక్క శతఘ్ని కోట

ప్రాకారమును తాకి వేగముగ కందుకము వలె వెనుదిరిగి శత్రుసైన్య ముపై పడుచుండెను. ఒక్కొక్క శతఘ్ని ధాకకు రెండురెండు మట్టి పెల్లలు మాత్రమే నేల రాలెడివి. మహమ్మదీయులు కోట బురుజులను మించెడి కఱ్ఱ మంచెలను నిర్మించి శతఘ్నులను ప్రయోగించి శత్రువుల నెదుర్కొన సాగిరి. నిచ్చెనల సాయమున తురుష్కులు మట్టి గోడ కెగ బ్రాకుచుండిరి.

ఆంధ్రసైనికులు పైనుండి కాగిన నూనెను వారిపై గ్రుమ్మరింప మొదలిడిరి. పెద్ద శిలాఖండములను దొర్లించుచుండిరి. అయినను మహమ్మదీయులు ధైర్యము వీడక కోట నాక్రమింప జూచుచుండిరి. ఇట్లు మూడు దినములు భయంకర యుద్ధము జరిగినది. ఎట్టకేలకు మహమ్మదీయులు మట్టికోట యందలి మూడు బురుజులను స్వాధీనము చేసికొనిరి. ఆ మార్గముగ తురుష్క సేనలు మట్టికోటను దాటి లోన ప్రవేశింప సాగిరి. ఉక్కుతునకల వంటి యాంధ్ర వీరులు లోన ప్రవేశించు తురుష్కులను పెక్కు మందిని వధించిరి. వేల కొలది తురుష్క సైన్యము నెట్లు నిరోధింప గలరు ? లోన ప్రవేశించిన వారికి మరల కందకముతో చుట్టబడిన శిలాప్రాకారము కన్పించెను. కందకము నతి కష్టము మీద దాటి శిలాప్రాకారమును దాటుటకు ఉడుముల నుపయోగించిరి. అంత నాంధ్ర సైన్యము శిలాప్రాకారము నందున్న మెట్లపైనుండి కాగిన నూనె పోయుట, కారము చల్లుట చేయసాగిరి.

శిలా ప్రాకారమునందలి యొక బురుజు వారికి స్వాధీనమయ్యెను. చారుమతి నాయకత్వమున వీరసైనిక వేషములు ధరించిన వీరనారీమణులు యుద్ధరంగమున ప్రవేశించిరి. వీరి రాకతో నాంధ్రవీరులు మరల విజృంభించిరి, తురుష్క సైన్యమును వారు నిలువరింప గల్గిరి. ధైర్యసాహసో

పేతమైన యాంధ్ర వీరనారీమణుల సమరోత్సాహము వర్ణనాతీతమైనది. ఏ వంక చూచినను చారుమతి జననాశ్వము మోహరమున మెరుపువలె విహరించుచుండెను. అసంఖ్యాకముగ వచ్చు తురుష్క సైన్యమును ఆంధ్రులు నిలువరింపలేకపోయిరి.

ఆంధ్ర సామ్రాజ్య మిట్టి జీవన్మరణ సమస్యకులోనై యున్న సమయమున తేరాల భోజారెడ్డి తురుష్కులతో కుట్రచేయమొదలిడెను. మహమ్మదీయుల నుండి కొంత ధనము గ్రహించి యొకనాడు యుద్ధము మానుటకు అంగీకరించెను. ఈ కుట్ర నెవ్వరును గ్రహింపలేదు. సామ్రాజ్యమునకు తుదికాలము సమీపించినది.

మరునాడు భోజారెడ్డి ప్రభువు నొద్దకు పోయి యిట్లనెను 'ప్రభూ! నా సైన్యము మిక్కిలి యలసట చెందియున్నది. పద్మనాయకులు నేటి యుద్ధమున సర్దుకొని పోగలరు. వారికి బాసటగ వెలమ, కమ్మ సైన్యములు కలవు. ఈ దినము మాకు విశ్రాంతి నిచ్చిన మరునాడు మహోత్సాహముతో పోరగలము' అని చెప్పెను.

ప్రభువునకీ కుట్ర సంగతి తెలియదు. అతడు సమ్మతించెను.

యుద్ధము ప్రారంభ మయ్యెను. మహమ్మదీయులకు ఢిల్లీనుండి యిర్వది వేల పదాతిదళము, కొన్నివేల యశ్వములు సాయముగ వచ్చెను. పద్మనాయకులు తమ శక్తి వంచన లేక మహా శౌర్యమున పోరాడిరి. ఆ భీషణ సమరము దక్షిణభారత యుద్ధ చరిత్రలో చెప్పదగినది. ఆంధ్ర వీర సేనానులు, యోధాగ్రేసరులు రణభూమిని కూలిరి. ఇట్టి విపత్సమయమున యుద్ధము చేయుచున్నట్లు నటించిన భోజారెడ్డి రణరంగము నుండి తొలగిపోయెను. జైనుల నాయకత్వమున కొంత సైన్యము మహమ్మ

దీయులను కలిసెను. దానితో నాంధ్ర సైన్యమున హాహాకారములు బయలు దేరెను. పద్మనాయకుల దేశభక్తి, ప్రభుభక్తి, ప్రశంసింప దగినది. యుద్ధమనిన వారిదే యుద్ధము :

చక్రవర్తి యిది గమనించి మదగజము నధిరోహించి కొంత సైన్యముతో యుద్ధరంగమున దుమికెను. ఆతని ఖడ్గశక్తి కొక్కొక్క తురుష్క నాయకుని శిరస్సు రణదేవత కాహారమగు చుండెను. ఆతని కెదురైన తురుష్కుడు ప్రాణములతో పోవుటలేదు. రెడ్డి సేనానులు ఇదియంతయు చూచుచు నూరకుండిరి.

ప్రభువు చాల తక్కువ సైన్యముతో పోరాడుట తురుష్కులు గాంచిరి. ఆంధ్ర సైన్యము క్షీణింపసాగెను. కాని ప్రభువు పార్శ్వమున నొక కవచధారి నిలిచి సమీపించిన వీరులను వధించుచుండెను. కాని ప్రయోజనము లేకపోయెను. ప్రభువు శిరస్సు గురిచూచి దూరమునుండి యొక ధూర్త సైనికుడు ఖడ్గమును విసరెను. దానిని వెంటనే డాలుతో నొడ్డుకొని యానూతనవ్యక్తి యొక్క దుముకున నొక్క వ్రేటున శాత్రవుని శిరస్సును నేలపై దొల్లజేసెను.

ఆ సంవత్సరము రుధిరోద్గారి, ఆ మాసము మార్గశిరము - ఆ దినము బహుళ విదియ ప్రతాపరుద్రుడు మహమ్మదీయులకు బందీయైనాడు. ఆతనితో బంధింపబడిన యా నూతన వ్యక్తి యెవరో గాదు - ప్రేమమూర్తి ప్రజ్ఞామూర్తియైన చారుమతియే. ఆ దినముతో మహాంధ్ర సామ్రాజ్యభానుడు భయంకరారుణ రేఖల నడుమ నస్తమించినాడు. కాళరాత్రి యాంధ్ర భూవలయమంతయు నాక్రమించినది. కులమత భేదములు అధికార లోభములు సంకుచిత వైరములు నొక్కటై మహాంధ్ర

సామ్రాజ్యమును కబళించినవి. కూడబెట్టుట కష్టము పడద్రోయుట యెన్నాళ్ళు!

ఈ విషయమింకను నాంధ్ర సైనికులకు తెలియదు.

మహమ్మదీయ సేనాపతి రహస్యమార్గమున విశ్వసనీయులను సేనానుల సాయమున ప్రతాపరుద్రుని ఢిల్లీ నగరమునకు పంపెను. పురుష వేషముననున్న చారుమతియు ప్రభువు ననుసరించెను. భోజారెడ్డి మున్నగు రెడ్డి వీరులీ పరిణామము గ్రహించి పశ్చాత్తాపము నొంది తమ సైన్యమును కూడగట్టుకొని రామగిరి యొద్ద తురుష్కులతో ఘోర ముగ పోరాడి యుద్ధమున హతులైరి. మలిక్ బౌదర్, ఖాజాజహా యను సేనాధిపతులు రాజును రామగిరి మీదుగ దారి తప్పించి తీసికొని పోయిరి.

తురుష్క సేన లిట్లు ప్రభువును ఢిల్లీకి గొనిపోవుచు గోదావరీ తీరమున విశ్రమించెనన్న వార్త విని కడసారి రాజదర్శనమునకై యోరు గంటి పౌరులు రామగిరి దగ్గరకు వెడలిరి. వారిలో మహావిద్వాంసుడైన విద్యానాథుడుండెను. అతడు చెమ్మగిల్లిన నేత్రములతో రాజును దర్శించి "ప్రభూ! దురదృష్టవంతుడను. తుదకిట్లు పరిణమించు ననుకొనలేదు. నా తుదికోర్కె యొకటి యున్నది. ప్రభువుల పేరనొక యలంకార గ్రంథమును రచించితిని. అది నా సాహిత్య మహారథి నుండి వెలికి దీసిన రత్నము. ఇది తమ సొమ్ము. దీనిని గ్రహింప ప్రార్థన." అనెను. ఇది విన్న ప్రతాపరుద్రుని మోమున గంభీర ముఖముతో కూడిన చిరునవ్వు సన్నగ వ్యాపించెను.

ఆతని కనులందు ప్రశాంతత, గాంభీర్యము దోబూచులాడుచున్నవి. అతడిట్లనెను. "విద్వన్మణీ ! కాల మొకరు చెప్పినట్లు వినునది కాదు. దాని గతి నిరంకుశము - పరమ స్వతంత్రేము. మీరు కోరినట్లేచేయుడు" అనెను. విద్యానాథుడు మహానందముతో నమస్కరించెను. ప్రభువు ప్రతి నమస్కారమిచ్చు సందర్భమున చటుక్కున తన వ్రేలి యుంగరము స్మృతికి వచ్చెను - వెంటనే ప్రతాపరుద్ర యశోభూషణ కృతి నందు కొను నెడ నా యుంగరమును సాదరముగ నా పండితునకు బహూక రించెను.

కనుల దుఃఖాశ్రువులు స్రవింప కంపించు హస్తములతో విద్యా నాథు డా యంగుళీయకమును మహా ప్రసాదముగా గ్రహించెను. మహా కవి పండిత రాజసభా మధ్యమున కర్పూర తాంబూలముతో జాంబూన దాంబరాభరణ యుక్తముగ గొను ప్రభు సన్మానమున కంటె మిన్నగ భావించి నృపతి ముద్దుటుంగరమును కుంచిత దేహుడై విద్యానాథుడు సభక్తిమై గ్రహించి రాజు నాశీర్వదించెను. ఆశీర్వాచనమును ప్రతాపుడు చిరునవ్వుతో స్వీకరించెను.

అనంతరము తనను జూడవచ్చిన ప్రజలను ప్రేమాభిమానములతో నాదరించి వారి క్షేమము నాకాంక్షించెను. వారు కరములు జోడించి భక్తి వినయములతో శ్రేణిగ నిలచిరి. వారికి ప్రభువు తుదివీడ్కోలొ సంగెను.

అటనుండి తురుష్క సేనానులు రుద్రభూపతి నొక ఆశ్విక శకటా రూఢుని గావించి ఢిల్లీకి గొనిపోవుచుండిరి. అతని వెంట నంగ రక్షకు డుగ జరిగిన మహాయుద్ధమున పాల్గొనిన నూతన వ్యక్తియు పోవు చుండెను. ఆతడు యుద్ధమున రాజరక్షణ భారము వహించెనేగాని ఎవ్వరి తోను మాటాడి యుండలేదు. రెండు మూడు పర్యాయములు ప్రతాపుని

యుద్ధమున శతృవుల బారినుండి రక్షించి యాంధ్రవీరుల కానందాశ్చర్యములను కల్గించెను. ఆ వ్యక్తి ప్రభువుతో నెన్నడు మాటాడ లేదు. అట్టి ప్రస్తావన కవకాశమీయనులేదు. రాజు ప్రశంసింప బోవునరికి ప్రక్కకు తొలగెడివాడు. ఈతని వైఖరి రాజున కవగతము కాలేదు

ఆనాడు ప్రయాణమున నా నూతనవ్యక్తిని సాదరముగ కృతజ్ఞతతో ప్రశ్నించెను. 'మీ రెవరు ? ఇంత మహాత్యాగమున కొడిగట్టియు మీ స్వవిషయమునుగూర్చి తెలుపరైతిరి. మీరింత మౌనమువహించి నన్ని కష్టసమయమున నాతో నీ ప్రయాణమున పాల్గొను హేతువేమి ? కల రూపు తెలిపి నా హృదయావేదనను నివారింపుడ'ని విన్నవించు నంతతో నా నూత్నవ్యక్తి కవచ శిరస్త్రాణములను తొలగించి పాదాభివందనము గావించి యెదుట నిలిచెను. రాజు పొందిన యాశ్చర్యమునకు మేరలేదు. ఇంతకాలము తన హృదయమున మెదలుచున్న చారుమతి యామె. ఈ మహాత్యాగమున కింతటి శక్తి నా సుకుమారి యెట్లు సమకూర్చుకొనెనో ప్రభువునకు బోధపడలేదు.

యుద్ధమున స్త్రీ సైన్యమును గూర్చి విని యున్నాడు. నగర రక్షణలో వారి శౌర్యసాహసములను కనులారా వీక్షించినాడు కాని చారుమతి తనకు సన్నిధాన వర్తినియై వీరపురుష వేషమున తన రక్షణభారము వహించి యిట్లనుసరించుట గ్రహింపలేడు. అతని హృదయమున విభిన్న భావములు చెలరేగినవి. కనుల నీరు క్రమ్మినవి. ఆ వ్యక్తి సాహసమున కానందమో, తన స్థితికి విషాదమో, యీ పరిణామమునకు వింతయో, పాఠకులే యూహింపవలెను ఆమె క్షతగాత్రి మిగుల దస్సియున్నది. శీతలోదకముచే నుపచారములు గావింపబడినవి

ఆమె సవినయముగ "మహాప్రభూ! మహాంధ్ర సామ్రాజ్యమునకు వల్లభులైన మీ సన్నిధిని జీవితము గడుపు నదృష్ట మీ దీనురాలికి కలుగ

లేదు. నా శక్తి కొలది యీ మహాయుద్ధమున మిమ్మనుసరించి నా నేర్చిన యుద్ధవిద్యను చరితార్థము గావించు కొంటిని. అదియే పదివేలు. నాకు రాణి వాస భోగములపై నిచ్ఛలేదు. ఎట్టి కష్టములందైన మిమ్మనుసరింప ననుమతించుటయే నా చిరవాంఛితము - దానిని దయచేయ ప్రార్థన" యిది గద్గద స్వరమున పలికెను.

రాజంతట 'చారుమతీ! దేశరక్షణలో నీ జీవితము సార్థకమైనది. నీ కోరిక నెట్లు కాదందును. కోరి కష్టములనే వరించితివి. నీ యదృష్ట మిట్లయినది. నీ జీవిత పరిణామమును గూర్చి విన్నపుడే నా విషాదస్థితి నన్ను మరింత బాధించుచున్నది. కాలము మన
కననుకూలమైనది. ఏమి సేయుదము" అని వారు మాటాడు కొనుచు పరస్పర దుఃఖోపశన ప్రసంగములు గావించుకొనిరి. మూడవ నాడు వారు ఢిల్లీకి గొనిరాబడిరి.

ప్రతాపుడు ఢిల్లీ చేరగనే రాజోచిత మర్యాదలతో నప్పటి మహమ్మదీయ ప్రభువు కరుణార్ద్ర హృదయుడు కాన సపరివారముగ నెదురేగి సగౌరవముగ తగిన విడిది నేర్పరచెను. ఈ ప్రభువు ఉల్లూఖానుని తర్వాత ఢిల్లీ సుల్తానయ్యెను ఇతడు క్రూరస్వభావుడు గాదు. ఔచిత్య మెరిగినవాడు. ఉదాత్త ప్రకృతి గలవాడు. ఆంధ్ర సార్వభౌముని విశిష్ట గుణములను గ్రహించి తాను జయించిన యాంధ్ర సామ్రాజ్యమును తిరిగి ప్రతాపున కిచ్చి ప్రజలను సుఖశాంతులతో మరల పాలింప వలసినదిగ కోరెను. మరునాడు ప్రతాపుని సగౌరవముగ నాంధ్ర దేశమునకు పంపెను. అతడుత్తర దేశమునుండి ప్రయాణమై గోదావరిని దరిసెను. ఆతని రాకను గూర్చి ముందుగనే విని విశ్వాసపాత్రులైన సామంతులు, సేనానులు నాయనను దర్శింపవచ్చిరి. రాజు వారి నందర నాదరించెను.

వారందరు విషాద వదనులై యోరుగల్లు పొందిన భంగపాటును

రాజున కెటింగించిరి. దేశస్థితి నతడు గ్రహించెను. మహోన్నత నాగ రికతా సంస్కృతమును గల్గి వెల్గొందిన యాంధ్ర నగరము యతనా కాంతమై దారుణ విపత్తుకు గురియైనది. అచటి రాజప్రాసాదములు, దివ్య భవనములు, గోపురములు, పుస్తక భాండాగారములు, నాటకశాలలు, కళా నిలయములు శాత్రవులచే ధ్వంసము గావింపబడినవి. పద్మాక్షీ దేవాలయములు, వేయి స్తంభముల మంటపము, స్వయంభూదేవాల యము, సిద్ధేశ్వరాలయము వికృత రూపము నొందినవి. వీరభద్రాల యము, మసానమ్మ గుడి, కుమారస్వామి యాలయము పాండవుల గుడి ముష్కరుల చేతి యాట వస్తువులై నాశమొందినవి. ఆంధ్ర నారీమణులు బంధింపబడిరి. గ్రామములు పరశురామ ప్రీతి నొందినవి. యవను లమా యకులైన ప్రజలను హించించిరి, దోచుకొనిరి.

ఈ దుఃఖ వార్తలు విన్న ప్రభువు మిక్కిలి వివశుడయ్యెను. తన కుమారుడైన వీరభద్రేశ్వరునకు రాజ్య ప్రదానము చేసెను. వీర పద్మ నాయకులను సన్మానించి, మీమీ ప్రాంతములకు స్వతంత్రులై ప్రజాను రంజకముగ పాలింపుడని యాజ్ఞాపించెను తనకై ప్రాణము లొడ్డిన నవ లక్ష ధనుర్ధరుల సంతానమునకు విస్తారమైన ధనము నొసంగ నాజ్ఞా పించెను.

ఇట్లు అందర సంతృప్తుల గావించి శా.శ. 1291 మాఘ శుద్ధ సప్తమీ దినమున నాంధ్ర భూపతి ప్రతాపరుద్రుడు గోదావరీ గర్భమున లీనమయ్యెను. వీరవనిత చారుమతియు నాతనితో గౌతమీ ప్రవేశము చేసి యాత్మాహుతి యయ్యెను.

మానవుడు తాను నిర్మించుకొన్న కుల మత వ్యవస్థకు తానే యిట్లు బలి యగుట మిక్కిలి విషాదకరమైన విషయము. అశాంతితో రక్తపాత ముతో కూడిన కుల ద్వేషములు మహాంధ్ర సామ్రాజ్యమునే విధ్వం సము చేసి కాల గర్భమున లీనము చేసినవి. మన కీ గుణ పాఠమే మిగిలినది.